ట్లుం డెమ్ము గా వతీతనువనూనరుచింబయిపై నిద్రా లెనా।
చండగభ స్తిసాంధ్యకరజాలముబింబితధాతుశైలముర్॥ ౧౧౦.

శా॥ఇచ్ఛాకేళివిలాసదత్తతనువైరయేలాలతాసౌమన।
స్స్వచ్ఛత్వంబొనగూడరక్తజలయోగాయత్తయైశోణర।
త్నచ్ఛాయల్ పెనుప్రోదివెట్టఁగమనోనాళీకమావాపిలో।
స్వచ్ఛస్వర్ణలతాంగివిచ్చెనునభోవాటీచరుల్ చూడఁగర్॥ ౧౧౧.

వ॥ అత్తఱి. ౧౧౨.

శా॥తారామార్గమునుండితార్క్ష్యకులజాతంబైనపుల్గొక్కఁడా।
యారామాంతరవాపికాజలపరివ్యాప్తాంగనర్మాంసభం।
డారంబంచుభ్రమించిబాణరయచండత్వంబులగ్గింపఁగాం।
తారత్నంబునుగొంచుపోయెనునభోధారాధరశ్రేణికిర్॥ ౧౧౩.

ఉ॥ దగ్గరియున్న కాంతుఁడుకుతారవిలూనశిరస్కభంగియై।
మ్రొగ్గుచుఁగాలుసేతులువిముక్తబలంబులుగాఁగఁబ్రాణముల్।
బెగ్గిలనయ్యయోయనుచుఁబృథ్విఁబడెర్ ప్రియురాలిరోయనా।
నగ్గలమైనధీరతయునాక్షణమేవెలివోయెనక్కటా॥ ౧౧౪.

వ॥ అని కాణభూతి. ౧౧౫.

చ॥ అమలగుణాఢ్యదారుణవనాంతరవాసకిరాతశాబకా।
క్రమితవిహంగముల్ నరునగమ్యపుటుప్పరవీధికేడ్చునే।
భ్రమయును నెపక్షిలోకముసుపర్ణకులోద్భవమట్లుసేయునే।
కమలజుఁడోర్చునేమిథునకల్పముపోగ్రహచారమామెకుర్॥ ౧౧౬.

చ॥ అనవుడుసద్గుణాఢ్యుఁడుగుణాఢ్యుఁడుతొల్లి విహంగరాజుస।
న్మనులగువాలఖిల్యులువిముక్తశరీరసుఖానుభూతులై।
చనితలక్రిందుగాఁదపముసల్పఁగనొక్కద్రుమంబునందుదా।
నినిగొనిపోఁడెతత్కులవనింజనియించినచిచ్చిదక్కటా॥ ౧౧౭.

వ॥ నావుడుఁ గాణభూతి. ౧౧౮.

చ॥ పొలతినిబక్కితీసికొనిపోవఁగముందఱెఱుంగఁడేమియుర్।
జలజలబాష్పముల్ దొరఁగసాగినత్రోవనెనూచుచుండెపెం।
గలఁకమహీతలంబుపయిగ్రక్కునమూర్ఛలెమూర్ఛదేరఁశీ।
తలజలమిచ్చువారెవరు? ధర్మపరిగ్రహమోర్తుదక్కఁగర్॥ ౧౧౯.

శా॥అంతంగొంత నెమూర్ఛదేఱెసుగుణాఢ్యత్ముండు భూపుండు భూ।
కాంతానేత్రయుగంబువన్ దొఱఁగు నేకన్నీటిచేఁదేఱెనో।
యంతర్వాణితరించెనో యటనయోధ్యాపుత్రితన్మానస।
భ్రాంతిన్ బుచ్చినచిత్తమాతివిభు లేపన్ జూచెనోయేమొకో॥ ౧౨౦.

ఉ॥లేచిలలాటసీమఁజెయిలీనత చేర్చిఖగంబుదిట్టుచున్।
బ్రాచినకాంచికాంచిమహివ్రాలుచు లేచుచునంతరిక్షమున్।
జూచుచుఁబువ్వుదోఁటఁబలుచోట్లఁగనుంగొనుచుమ్మలించియా।
యాచోటులన్ దలంచిమదినబ్బురమున్ గడునంతపుట్టఁగన్॥ ౧౨౧.

వ॥ ఇట్లు చింతించు. ౧౨౨.

చ॥ పడఁతివిహంగమేమను నెపంబుననంబరవీథికెత్తెనో।
యడరివిరాళిరావణునియట్టిఁడు చేసినజాలమో భయం।
పడిపడిరక్కసుల్ విహగమాయనొనర్చినయైంద్రజాలమో।
తొడిబడెనో నభంబుచొరఁద్రొయ్యలియేమనువాఁడ నావిధిన్॥ ౧౨౩.

చ॥ విసిఁగెనొయుమ్మలించెనొవివేకముజాఱ్చెనెబాష్పధారలన్।
వెసఁగసుగందెనో విహగవీథిగనుంగొనిడొల్లవోయెనో।
యసువులువాసెనో కలికియాకసపుంగతలేదు నేర్చునే।
డొసఁగినఱెక్కలానలువయూరకయుందునెహా మృగావతి॥ ౧౨౪.

శా॥ఈదినున్ విడనాడిపోవడిమనంబెట్లొప్పె నేప్రేయసీ।
నీదివ్యంబగుమోముఁజూతు నెటువహ్నింగాల్ప నేయియొయ్యెడల్।
నీపృగ్రోమలులేనిచో శరణమెంతే నాకుసన్యాసమే।
యేదిక్కేగితిచెప్పవే గరుడజంబెందేగుప్రాణేశ్వరీ॥ ౧౨౫.

మ॥ అమరీనుత్య భవన్ముఖామృతము నెట్లానింతువో నీకటా।
క్షము నాపైప్రసరింతువెన్నఁడుభవత్సంతోషవాక్చాతురీ।
క్రమమే నాఁడుతరించునో ననువిచారగ్రస్తుఁగావించియే।
రమణీయాశ్రమమందితో ప్రియసఖీప్రాణేశ్వరీసుందరీ॥ ౧౨౬.

శా॥హాయేదారుణకావనాంతరముడాయంబోయితేద్వీపినీ।
స్ఫాయత్కూలముసేరితేజలనిధిన్ జల్లాడు దేద్వీపమీ।
సాయంకాలముమెట్టితేగిరిచరుల్ సైరించితేశత్రురా।
డ్గేయంబుల్ చెవిసోఁకెచెప్పవెప్రియాటీకంబుమోహంబునన్॥ ౧౨౭.

చ॥ కువలయనేత్ర నీ వెటులు గుందుదువో తపనోష్ణరశ్మిఁ బ్ర।
జ్వలనపదయెట్లు శైలపటలమ్ములు మెట్టుదువో భయంకరా।
టవి నెటులుండ ధీరవిరటత్పవనోల్లసితాట్టహాసముల్।
చవిగొను దేలతాంగినవసారిణులోస్తు వెగర్భభారవై॥ ౧౨౮.

చ॥ రవికులతేజుఁడైన రఘురాముననుంగు వెలంది నేలపు।
ట్టువయినుతోల్లి వేఁకటిబటు స్వసదుజ్జ్వలనిర్ఝరాపగా।
భవములసైకతస్థలుల బాలలతో విహరింపఁగోరెమా।
నవులకు రాని కాఁతియలు నాటఁగఁగుంద దెకోర్కెదూఱదే॥ ౧౨౯.

ఆ॥ వెలఁదులార! వేవిళులఁ గోరు కోర్కులు । మిగులనరిదియగుచు నెగడు మందుఁ।
దనివిదీర్పకున్న మనమిచ్చి మాటాడ । రిడుమలననుభవింత్రు నడుపునెడల॥ ౧౩౦.

ఉ॥ ఇంకిటులెంత కాలము ప్రియేశ్వరిఁ బాసి సనొవిచారతన్।
గ్రుంకెడువాఁడ రూపమును కోమలమున్ మృదువాగ్విలాసమున్।
గొంకును గూడు నేయితరకోమలులందు సఖీజనంబునా।
వంకను జూచు నేయనుచు వాలుధరాతలమందు వందుచున్॥ ౧౩౧.

శా॥ ఈసప్తాంగము తేలయీయుపవనంబీ మేడలీపట్టణం।
బీసాంద్రద్యుతి వెల్వరించురమణీయేంద్రాశ్మభూషాళియీ।
కాసారంబులు గీతి కాలయములీ కల్యాణరూపంబు లే।
లా సంతాపనిమగ్న మాత్రునకు బాలాముక్తవిశ్వాసికిన్॥ ౧౩౨.

చ॥ రుచిరతరప్రాయమున్ గుణము రూపము నాయువుఁ గల్గి బంపతుల్।
ప్రచురతనుండ పేధరణిఁ బ్రాయమొ రూపమొ యేదియో యొకం।
డవిరత నొందు నన్ని గలయన్ విధియోర్వక యిట్టి కాఁతియల్।
రచనయొనర్చు సంతసము రాగము నీ మదిఁ బుట్ట దే విధీ॥ ౧౩౩.

శా॥ కాళిందిన్ జిగురాకు పందిరులగంగా వేదికాసీమలన్।
బాలాతాండవమాడు వేళలమనఃపద్మాలయోల్లాపినీ।
కేళీవల్లకు తేడఁ బోయెనను గుంగీరంబులన్ వీడియే।
లీలన్ బోయితివంతరిక్షమునకున్ లీలావతీ చెప్పుమా॥ ౧౩౪.

ఆ॥ అతివ! లోననున్న యర్భకుఁ డెబ్భంగిఁ । దలఁకుఁ దల్లడిల్లును లుకుఁబక్షి।
త్రోటినీదు కేశకూటంబు దగులగ । వింటికేగ మిగుల వెగడువడునొ॥ ౧౩౫.

ఆ॥ పురుడువోసి నిన్నుఁ గరుణింతు రెవ్వార । లోగిరంబులు నిచియూడిగంబు।
లొసగఁ జూతు రర్భకుని బెంచి మూనాళ్లు । గర్భగండదినముగడచు నెటులు॥ ౧౩౬.

వ|| అని. ౧౩౭.

క|| పరిపరిపరు సులవందురి । పొరలును జెయిజేర్చి మూళిఁ బొరిపొరిఁ గన్నీ ।
రరలిం మదిరు గుసటు నిటు । లురమున శిరము నియిట్టులొదుగన్ బలుకున్ ॥ ౧౩౮.

చ|| మనుజునకెప్పుడు త్తలమువాయచుపో! పసినాఁడెయుత్తమం।
బనఁబగుజవ్వనంబున మహాగుణభూషణఁ బెండ్లియాఁడఁద।
ఘ్న నసుఖభోగభాగ్యములు కాలము పట్టున నుండ వెంతియున్ ।
వనజభవుండొనర్చునరవాయికి నేమను వాఁడనక్కటా॥ ౧౩౯.

ఉ|| ఓపికవాణిచాతకమయూరములున్న తపాదపంబులన్ ।
జూపనిపృష్టిమైబుపభషడ్జములొయ్యనఁ బాడు వేళలన్ ।
జూపఋలైనచిల్కలొకసోదిపహింపఁగ మూఁగుటుయ్యలల్ ।
యేపునసూఁగునాదినములెయ్య వియోభువనైకమోహినీ॥ ౧౪౦.

శా|| ఏణీలోచననిన్నుఁ బాసియుమనం బెట్లాఁగెనో హ్రోదినీ।
మానంబయ్యెనొకొక్కరాత్రిమృదువాఙ్మాధుర్యలీలన్ స్వన।
ద్వీణాయంత్రతమోహనిద్రగదురన్ దీక్షాంశుఁడీ ప్రాచితో।
వాణీనాథుఁడు గాఁగలేచుదివసవ్రాతంబులేమయ్యెనో॥ ౧౪౧.

వ|| అని. ౧౪౨.

ఉ|| కానలఁ బుచ్చి యిచ్చ మెయిఁ గర్ణికతోరములైన శారికా।
ధ్వానములేల నాకు విషవహ్ని జలాశయమూలకంబుగాఁ।
బ్రాణముకోలు పుచ్చెదఁ బ్రియావిరహాగ్నిఁ దపింపనేలకో!।
హా! నళినాక్షి యంచు వసుధాధిపుఁడొయ్యన వ్రాలె భూమిపై॥ ౧౪౩.

చ|| పడిఁ బొగగూడదుదీసికొనివాజిఁగఁ బోయెడిపొట్లికై వడిన్ ।
బడఁతినభోంతరంబున శ్రమంజనుటాడియొఱంగి దేవసూ।
తుఁడు తనదివ్యచక్షువునఁ దొందరపాటునవచ్చి మూర్ఛ చెం।
దెమునరపాలు చేరునకుఁ దెప్పి అకుండిన నెంతమాత్రకున్ ॥ ౧౪౪.

ఉ|| నొచ్చియతండు వాడినతనూలతకోపినచల్లనూడిగం।
బిచ్చినఁ దెప్పిటెల్లి ధరణీశుఁడు వందనమాచరించినా।
యిచ్చలు దూలెఁ బ్రోడగొనియే గవిహంగము భానువీధికిన్ ।
జచ్చిననేమి నాకు సురసారథిచెప్పుమయేటిచైదముల్ ॥ ౧౪౫.

మ|| అనువంతిల్ గిలకొట్టుపల్కులకు నాహోమాల ముంగోపిచే।
సినచెయ్యొంతటిపాట్లు దెచ్చెననిజేజేవందికారుణ్యవా।

కుక్కవముచ్చుచ్చురయిడ్డశాపగతి వాఁక్రువ్వన్ విహంగంబువై।
యినతెన్నాతఁడుచూచుచోఁగణిక! నీకెగ్గమిగావించితిన్॥ ౧౪౬.

చ॥ పిలువఁగఁబల్కకుండుటకుబిట్టుకనారిలిశాపమీయఁగాఁ।
బొలతికినుద్వేదంపతులఁబోకడవెట్టినఁబుణ్యమానెకా।
వలపుఁబనంబుదానిసహవా సమువేల్పులకియ్యగొల్పె! మ।
త్రిలివిధికుండలించినయదృష్టముదాటఁగనేర్తురేనరుల్॥ ౧౪౭.

క॥ వెలవెలఁదికోలముచెడుదన । ములఁజూపకయున్నెయోర్వములుసవతింబో।
రులుపుట్టినిండ్లువారికిఁ । గలకాలముధనముఁజూఱగఱతురుమాయన్॥ ౧౪౮.

వ॥ అనిదుఃఖావేశంబున. ౧౪౯.

తే॥ అకటపదునాల్గేండ్లువాయంగనెన్ని । యుగములగునొయందాఁకనేనోర్వఁగలనె।
తనువువిడుచుటధర్మముత్తలముకంటె । ననుడుమాతలినవ్వుచిట్లనియెఁగొసరి॥ ౧౫౦.

చ॥ ఇడుములురావెమానవులకెల్లెడలన్ధృతిఁదూలఁబాడియే।
యడలుజనుండుసైతమునిరామయుఁడైధృతితోననున్నఁబె।
ద్దడవునకైనబాయఁడెవెతల్సుఖమెచ్చటనుండుదుఃఖము।
క్కడవసియించుదీర్ఘమతిఁగాఁటియలెంచకుధైర్యమూనుమా॥ ౧౫౧.

శా॥ ఏయేవేళలనేదియేదినరులందెబ్బంగివర్తించునో।
యాయావేళలనన్నిటంబొరసిమాయాలోకదుఃఖంబులన్।
బాయంజూతురుదూరదర్శులుమనోభారంబువేడింపుమా।
కాయుత్యాగముమానుమాతరుణిమాంగల్యంబుచింతింపుమా॥ ౧౫౨.

వ॥ అని కొంతయూఱటవల్కి యదృశ్యుఁడైన నరేంద్రుండు. ౧౫౩.

ఉ॥ ఏమనిచెప్పువాఁడసఖులెల్లరుఁదల్లడమందిరేదియే।
దీమహిళాలలామయునితేఱఁగనుంగొనజైత్రలక్ష్మియా।
లేమపిఱుందఁబోయినలలింగనుపట్టెడిఁగందువారియా।
రామమురత్నహారములురాజిలకుండెడినేమిచెప్పుదున్॥ ౧౫౪.

క॥ అనిచింతిల్లుచునగరికి । జనమంత్రిప్రముఖులెల్లజననాయకునిన్।
గనియచ్చురశాపంబును । వినియూఱటవల్కిరపుడువెతలుగుడువఁగన్॥ ౧౫౫.

తే॥ సుగముసాలించియెన్నఁడుసుదతిగుఱించి । వార్తలేతెంచుననియార్తివందుదేవ।
వారకామినిమూఱుచువ్యర్థమైన । తనువురోయుచునుండునాధరణివిభుఁడు॥ ౧౫౬.

క॥ అనికాంణభూతివినిచిన । వినివిద్యాదయితుఁడడిగెవెనుకటివృత్తాం।
తనిరూఢియానతిమ్మని । వినయమునాదరముప్రోదివెట్టఁగనచటన్॥ ౧౫౭

గద్య॥ ఇది శ్రీరామకృష్ణకవి ప్రణీతంబైన మృగావతియందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# మృ గా వ తీ.

## తృతీయాశ్వాసము.

---

గీ॥ అనగుణాఢ్యుండు సకలవిద్యావివేక । భూతిఁదనరారు నాకౌశభూతిధిపుఁడు।
నిభునకిట్లను దొలి దెస నెగపెనట్టి । తార్క్ష్యు భవమట్లుపోవుచుఁ దరతరమున॥ ౧.

మ॥ తటినీసంచయముల్ ధరాధరములుద్యత్సారహర్మ్యాగ్రముల్।
నటదుగ్రద్వీపసింహసంకలితకాంతారంబులత్యద్భుతా।
స్ఫుటికాగచ్ఛదమందసైనికసమిత్ప్రాంతంబులశ్రాంతసం।
ఘటితాష్టక్రమతాపసాశ్రమములేకాయేకిగా దాటుచున్॥ ౨.

తే॥ పెక్కుయోజనములు ప్రాయి, భీతుగుడిచి । యొడలుమఱచినయు గ్మలినోరఁజూచి।
పక్షియిట్లను నాయాసపాటులెల్లఁ । దెల్లవారెననిమరలఁదేఱిచూచి॥ 3.

చ॥ భ్రమయుచుమాంసఖండమనిప్రాణిని దెచ్చితినింతదవ్వటం।
చుమదిఁదలంచియచ్చట నెత్తుద్రమ్మృగాకులమైన మేదినీ।
ధ్రమునమృగావతిన్ విడిచి దంచడినీడపుఁద్రోవపట్టెడె।
వము పచరించుకృత్యములవారణముల్ గదపండితోత్తమా॥ ౪.

మ॥ కలలోనైనఁ దలంచెనే మృగమిళత్కాంతారమధ్యంబునన్।
గలఁగింపన్ మదదంతిరావములు వంకన్ నీటినాదంబుమున్।
డుల చెట్లిచ్చెడు కీసనీడలు ఖగన్యానంబు, మైడోల్ల వ్రా।
లలనారత్నము శైలసానువుల వేల్లత్కంటకశ్రేణులన్॥ ౫.

ఉ॥ కాంచనవేదులన్ గలయఁగత్తియుపిండు విపంచికారవా।
భ్యంచితచిత్తలై చెలులు నచ్చరకోటులు కోహళోక్తమె।
ప్పించఁగ దిద్దుముద్దియకు భృద్విషమస్థలి భోగినీవిధుల్।
గాంచఁగనయ్యె నచ్చెరువు గా దెతలంపఁగ నేమిచెప్పుదున్॥ ౬.

సీ॥ చలువరామేడలఁదులదూఁగునుయ్యెలల్ సరివ్రానిగట్టుతాచజీయలయ్యెఁ।
జెలువంపుటిండ్లవై చిత్రిఁజిత్రించినముప్పన్నె మెకములు నివ్వటిల్లె।
శారికాకీరవీణారవంబులు కర్ణకాశిస్య వేదండగానమయ్యెఁ।
దోనాడు నెచ్చెలుల్ కానదౌదవ్వులనిలుచుముండులచెట్లకోలములయ్యెఁ।

జలువమలగాలి పెన్ వీచుజంఝలయ్యెఁ । గానిపచ్చనియొడలిచిక్కఁ పుకంపు।
టూఱపులెబ్బంగి సైనమఱఁగదయ్యె । నేకవస్త్రయేకాకినియింతియపుడు॥ ౭.

తే॥ ఒంటిమైనున్నయువిదయెట్లులికి పెలుచ । నుమ్మలించునొగ్రామశూన్యమ్ములైన।
గట్టుచఱియలటాసుతగడపురేలు । వెఱపువేళలనెవ్వారిమఱఁగుఁజొచ్చు॥ ౮.

ఉ॥ ఎక్కడికేగెనంచనెఱయిూకలపాన్పులతోడనాడుపి।
ల్లక్కలపిండుపండుఎలనన్నలువెట్టినపట్టుపుట్టముల్।
మెక్కడిశాలికాశనమమేయవిభూషలుపల్లకీలుకీ।
లెక్కనసాలభంజికలునింతికనంతవనాంతరంబులన్॥ ౯.

చ॥ అనినగుణాఢ్యుఁడవ్వలికథాంశముచెప్పమటన్నభూతిరా।
డ్ఘనుఁడిటుపల్కనంతవిహగంబొకపర్వతసానువందువీ।
డినయొకకొంతలోనసెకడిందివిచారతవత్సరాడ్వఘూ।
టినిదురలేచుదానివలెడీల్వడుకన్నులువిచ్చువిచ్చినన్॥ ౧౦.

సీ॥ అల్లనగనువిచ్చియఱసంజకెదురైనపడమటిపజ్జతిప్పలనుగాంచు।
మలఁగికనుల్ ద్రమ్మాల్చిమఱికొంతతడవుచింతించిదాపటికనుల్ దెఱచిచూచి।
బయలంటుకొనలనుండియుఁజాఱుచట్రాలుపైఁబడనుంకించుఘణితిఁగాంచి।
వలపటఁదలద్రిప్పివఱలుచీఁకటిగలక్రీచక్కఁబొడగనికీలుగొల్ప।
నుత్తలమువెడవెడముందులొత్తిపాఱు । చిఱుతచెట్టులబుసబుసల్ నెఱపుకీట।
కములుగనివినిపేరలల్కరముమొరయు । మొరపములువిన్నగుండియల్ ద్రమోగెసతికి॥

వ॥ అంత. ౧౨.

చ॥ ఒడలొకచాపరాయిపయినుండఁగనుప్పరవీధినక్కడ।
క్కడనఱకెంపుచాఱలిడఁగాఁదొలిదిక్కన,భానుఁడత్తతిన్॥
బడమటివార్ధిలోమునుఁగఁబొఱడినొక్కడభంగసంగతుల్।
వెడలఁగనొక్కపజ్జఁబృథివిన్ గబళింపఁగఁబోలురాఁగనున్॥ ౧౩.

చ॥ కనియిదిపాడుస్వప్నమనికన్నరమోడ్చెనుగానిశేముషిన్।
వనరుచునుండెనేమియిదిస్వప్నమెయంచునొకింతలోనెరయొ।
య్యనదెఱచెన్ గనుంగవకటా! ప్రియమిత్రమతెచ్చెనిచ్చటన్।
జనరహితాచలావనికశంకితబుద్ధివిహంగమక్కటా॥ ౧౪.

సీ॥ నిడుదైననల్లనినెఱులుకుత్తుకఁగొంతనక్కనగొంతపైప్రక్కఁగొంత।
గాఁగజిబిజిగాఁగఁగరమొకండవనిపైహస్తాంతరముటొమ్ముమస్తరింప।

పలువవీడియుపీడకలవడబుత్తడిబచ్చెనబొమ్మనాఁబరఁగనొడలు।
తొలినాఁడుమగనిముద్దులఁదూగునప్పుడు కెంపునించినమోవిపెంపుగదుర।
వారుమోముసవడిబాష్పవారిదొరఁగ । ముంగురులదుమ్ములెడగొనమొగిళులంటు।
గట్టుచటియలఁబొరలాడుకలికికులికి । పలుచెనోమునఁబుల్గులుపాలెనింగి॥ ౧౫.

వ॥ అంత మృగావతి తటాలునలేచి. ౧౬.

ఉ॥ ఎచ్చటనున్నదాననిదియెక్కడిపర్వతబృందమెట్లుపో।
వచ్చినువత్సభూమికిటవ్రాలెడుభాస్కరుఁడస్తవార్ధిలో।
మ్రుచ్చులుబెట్టిదంపుమృగముల్ ఫణిరాజులుసంచలింపరే।
యిచ్చటనిల్వనేర్తునెప్రియేశ్వర! వాసితిమిమ్ముఁజూతు నే?॥ ౧౭.

ఉ॥ ఆలుమగండుఁగూడిభయదాటవినున్ననుసౌఖ్యవార్ధిలోఁ।
దేలుచునుండ్రుమద్గతులుదివ్యములయ్యెమునీంద్రశాపమో।
వేలుపుటన్నులోర్వమిఁదవిల్చినవారొకొ జన్మపంకజం।
బాలనిమగ్నతాఫలమొబాలలెఱుంగఁగనేర్తురేయిలన్॥ ౧౮.

సీ॥ సాకేతపురమునజనియించిభారతవంశవర్ధనుఁడైనవత్సరాజు।
చెట్టవట్టిసుపర్వసీమంతినీబృందవినుతనైనందనవనవిహార।
ఖేలనాసక్తనై బాలాతపవిదూరనై రూపవిజితాప్సరోంగననయి।
శరభశార్దూలకేసరివరాహోద్దండఫణిరాజులకునాటపట్టునైన।
యిమ్మహాగిరికెటుబలియిచ్చికొందు । నకటవిహగంబులారనన్నాకలించి।
వత్సదేశంబుసేర్పుఁడువల నెఱుంగఁ । గన్నుగాననియీకాననఁగరుణతోడ॥ ౧౯.

వ॥ అని యాకసమువంకజూచి. ౨౦.

సీ॥ మొలినూలిగజ్జెలమొరపంబువినుతల్లి యెవనిఁబెండ్లాడెదవేయటన్న।
ముద్దుపల్కులు రాఁగమురిపెంపుఁదండ్రియు నెవ్వానివరియించెదేయటన్న।
గ్రచ్చకాయలనాడు నెచ్చెలుల్ చిఱునాట నెవనిముద్దాడఁబోయెదవటన్న।
జవ్వనంబునఁజంద్రశాలాతలంబులనడలసఖుల్ తొంటియట్లయడుగ।
వత్సభూపతిఁజెయివట్టవలచుదాన । నతఁడుగొనఁడేనివారివిషాగ్నిమూల।
కముగనసువులువాసెనగరమునమ్మఁ। డనుచుఁబల్కెడిదాననోవినుతశీల॥ ౨౧.

చ॥ అడలకప్రాణముల్ విడకయున్నవనొక్కతెఁబెండ్లియాడిమం।
దెడపడకుండుమెచ్చటికినేగకతాపసవృత్తిఁబూనకి।
క్కడగిరిసానువందుఁబలుకాకులవాయికిమాంసఖండమై।
పడియెదఁబూర్వజన్మకృతపాపమువాయునెప్రాణనాయకా॥ ౨౨.

తే॥ అనుచుఁగన్నీరువిడచుచుమనవనిమీఁద । నొక్కమోకాటినూనిమఱొక్కదాని।
పయినిమోచేయియుంచియప్పడఁతిమౌళిఁ । గరముసేర్చుచునిట్లలందురుగుణాఢ్య॥ ౨౩.

సీ॥ అలనాఁడుజడదారికలలోనవిద్యాధరులనేలుపౌత్రుఁడుగలుగుననియె।
నిక్కడగడయూపిరిడినఁబుత్రుఁడుగానిపాదముపెట్లొక్కయేపుణ్యఫలమొ।
ప్రమదావనంబునఁబ్రమదలతోనాడనబ్రుముగానభ్రమందువేల్పు।
వీటికేగెడుభూమివిభునిగన్నారఁగాంచితిమోహవిభ్రాంతిసెందినపుడు।
సకియలూరడిలంగఁబల్చునిపలుకుల । శమమునొందించిరట్టినాసఖులనుఁగుఁ
బతినిదుఃఖదేవతకుసప్పనమొనర్చి । దిట్టనైతినినాకోర్కెయిట్టులాసఁగె॥ ౨౪.

శా॥ స్త్రీబుద్ధిఃప్రళయంకరీయనుచుసూరిశ్రేణిమున్నాడఁగా।
నాబాలాత్వముసూపుదాననిచటందార్కాణమయ్యెంవిభుం।
డాబావిజ్ఞాపనంబుసేయవలదంచల్లాడెనాపోఁకగా।
కాబంధుప్రవరుండునమ్మలికపాలైపోయెనేమయ్యెనో॥ ౨౫.

శా॥ ఈనిర్మానవభూమియీవనతలంబీయంబరోల్లేఖిసా।
ధానీకప్రచరత్తరప్లవగసింహవ్యాళభేతాళికా।
ధ్వానప్రాప్తవికారమీకటకసంత్రాసంబునన్నెంచినన్।
బ్రాణంబుల్విడనాడునిక్కమిదిమోహప్రాప్తినుంచుర్వపై॥ ౨౬.

ఆ॥ పడిరజోవిభూతినొడలెల్లనుడివోవఁ । జిఱుతటాలమేనుచిండ్లువడఁగ।
నిరులునలుగెలంకులెడగొనుచుండఁబె । ల్లుగవెలందివంతలొగుచుండి॥ ౨౭.

చ॥ యుగములలోననిక్కలిమహోత్తమమిందుగ్రహస్థురాలుభా।
గ్యగతముధర్మకామములకానినకొమ్మముముక్షుమార్గమున్।
దగిలెడునందురిట్టిసుఖతత్త్వముఁబాసిశిలోచ్చయంబులన్।
విగళితజీవనాదుననివేమఱుగంటఁబఱింతునీటిచేన్॥ ౨౮.

ఉ॥ భారతవంశవర్ధనునిబాసివనాంతరఘోరవాటిలో।
ధీరతనున్నదాననెదధిక్కృతవజ్రముకాకయెట్టిదో।
యోరజనీలలామననునూరికిఁదోడ్కొనిపోవెపత్తులా।
రారమణీయమైననికటావనిఁజూపరెయాకలించరే॥ ౨౯.

తే॥ విశ్వవిశ్వంభరాదేవి! విగతదయవు । విపినభూవర్తితాహార్యవీథిలోన।
బరితపించుచునున్నఁగాపాపవేమి । సవతిపోరులనూహింపసమయమిదియె॥ ౩౦.

వ॥ అని మృగావతి పలుదెఱంగుల విలపించుచుండ. ౩౧.

ఆ॥ ఈప్రపంచధర్మమెట్టిదియోకాని । యరయఁగలమెయొక్కపరినసకల।
కష్టములకుమనముకలఁగుచున్నారము । తగిలినట్టికాలెతగులుమఱియు॥ ౩౨.

సీ॥ వాయెఱుంగనిమేకపదుపులవెన్నచాడ్పునమ్రింగుమలమారిమూర్తియనఁగ।
దరితప్పిరేమొదల్ పడమాడుతెరపరిజమునింటితోరణచాలనంగఁ।
బవలెల్లదూలంబుపగిదినొక్కెడద్రావాలుపులుచుట్టుసోమరిపోతనంగ।
దురదృష్టదేవివధూటికై పుచ్చినరుంద్రవాసుకివిశ్వరూపమనఁగఁ।
బొలిసియాకొనిబిట్టుకోఱలుసెలంగ । నోరుపఱపుచుఁగోనలనురుగులొలయఁ।
గొండచిలువయొక్కటిసతిదండఁసేరి । యెదనుభయవృక్షమునునాటెనింతికకట॥ ౩౩.

చ॥ మలచిలువన్గనుంగొనఁగమానినిమేనువడంకనట్టని।
శ్చలతవహించితొట్రిలఁగజంఘులుఁబెన్గరుదాల్చియిట్లనున్।
గలఁతకుఁదోడుగానిదియుఁగల్గెనుభీకరవజ్రదంతమం।
డలిద్రవియించుచున్నదకటాతుదిఁబోయెదఁబాపవాయిలో॥ ౩౪.

తే॥ ఇందులకెనన్నుఁగొనివచ్చెనింతదవ్వ । విహగమునకెగ్గులేమిగావించిసిలుగు।
గూర్చితినటంచుఁగుయివెట్టికుదిసితన్ను । దానెదూషించుచుండెనత్తరుణమందు॥ ౩౫.

చ॥ చెలువయుజీవితాశవిడిచెన్విడనాడియుభర్తకోసమై।
జలజలబాష్పబిందువులుజాఱఁగనుంగవనించెనంతఁబే।
రెలుఁగునబిఱువాలమదియిట్టటుగొట్టుచుఁబొట్టపైనిని।
ట్టలపుశరంబుగ్రుచ్చికొనడమ్మనిత్రెళ్లెనసృక్కణంబులన్॥ ౩౬.

చ॥ అటుజమునింటికేయతిథియైనకుభృత్ఫణిఁగాంచిదేవతా।
ఘటనమొసిద్ధసాధ్యకృతకార్యమొకాకసమీపసంయమి।
స్ఫుటితతపఃఫలంబొవిభుసూచితమాంత్రికమారణక్రియో।
నటనమొయొక్కవ్రేటుననెనాలుకసాచెఁబెనంగియెట్లొకో॥ ౩౭.

మ॥ అనిపెన్నుబ్బురపాటుతోడనవలాయాలించియేశబ్దమై।
ననురానోపునెయంచునల్లడలఁగండాదవ్వులీక్షించిపై।
గనమాంజిష్ఠపటాగ్రమున్బసిఁడికెక్కల్పాదవైషమ్యక।
ల్పనముంగన్గొనిసిద్ధపూరుషునిగాభావించెగంధర్వునిన్॥ ౩౮.

క॥ ముందేమిశుభమువచ్చునో । నందనమందారచందనద్రుచ్ఛాయన్।
బందాడిప్రొద్దుపుచ్చిన । బృందారకుఁడట్లుచిలువఁబీచంబడువన్॥ ౩౯.

చ॥ హృదయముప్రక్కలించుతదహిస్ఫుటపీవరగాత్రవేదికన్।
జెదరినరక్తబిందువులుచెల్వమనంబునభీతురోఁతయున్।

గదికిన సేవగించిసమకట్టినకర్జమొనర్చుపూనికన్।
దదగశిఖాగ్రసీమకు వెతన్ జనునంతకు సమ్ముఖంబునన్॥ ౪౦.
సీ॥ ముదురుమ్రాఁగొమ్మనొండదిమిపెంజుట్టురోఁకటిబండచాడ్పునగరము మెఱయ।
మానిసిపొడువునమలఁగివెల్లలఁదోఁగుకరవాడిరదములగవ సెలంగఁ।
గాటుకమలమాడ్కిఁగండెనవన్నియ నెలయొండెసైననునిలుపఁజాల।
బలియుక్రిక్కిఱియుకుంభద్వయంబుననుండివిమలంపుసీధువు వెల్లివోడువ।
నతిమదోన్మత్తహేలయైయురుగుచెంచు । నొక్కరెంటద్రావుడుగనియుడిఁగిడీవ।
నాశఁదత్పూరఃపాదద్వయంబుకొనలఁ । బడియెనెలనాగద్రొక్కకపాఱెనదియు॥ ౪౧.
క॥ అబ్బురమడుగులవ్రాలిన । ద్రొబ్బకయబ్బాలద్రుళ్లఁద్రొక్కకకరిత।
బ్బిబ్బులఁబెట్టకచనెఁబె । ల్లుబ్బియుభగవంతుచేష్టలు క్త్యతిశయముల్॥ ౪౨.
చ॥ దుడుకు మెకంబుకంబుగళిఁద్రొక్కకపోఁగవిషణ్ణచిత్తయై।
కడుపుననర్భకుండదరఁగాళులుతొట్రిలఁబేరెలుంగుతో।
జడముడివీడఁగ్రిందఁబడిసానువునుండియుసుళ్లువాయనా।
పడఁతియుజాండనాదమునుబందులుగట్టఁగనేడ్చె వెక్కుచున్॥ ౪౩.
ఉ॥ తొట్టిననేత్రనీరములదోఁగఁబయింటచెఱంగుమోముకె।
మ్మట్టిగనెఱ్ఱవాఱఁగటమార్గములన్నులివెచ్చనీరుగ।
న్పట్టఁగనేడ్వనట్టిమొరపంబుసమిత్కుశహోమవస్తువుల్।
పట్టఁగవచ్చునొక్కమునిబాలుఁడువీనులవిన్న మాత్రనన్॥ ౪౪.
ఉ॥ ఎక్కడిదీకృపారసమునీనెడునుగ్మలియేడుపబ్రమే।
ప్రక్కమలంచివచ్చెడినిబక్షివిదూరముపొంధమానవా।
స్పృక్కణపానతత్పరకరిప్లవగోత్కరమధ్వనీనహృ।
త్పక్కణవాసమీయుదయపర్వతమిం చెటుకాంతివచ్చెనో॥ ౪౫.
ఆ॥ అనుచుఁగొన్నియడుగులరిగియచ్చోనొక్క । పెద్దబండనెక్కిపిలచిచూచె।
నచటగానకన్నియడుగులుత్తరమున । గడచిపొలఁతిఁగనియెగట్టుపైన॥ ౪౬.
చ॥ పొడగనిడాయుచిట్లుపలపోసెవెలందినిజూడవేలుపుం।
బడఁతియొగాకవెన్నునెదపైదలియోవిరియంపసింగిణీ।
యొడయనిప్రోడయోయెఱుఁగనోడెదఁగాకమదీయహృత్స్థిరం।
బెడపకచూడఁగోరియిటులిక్కడవచ్చిరొయేమొమద్గురుల్॥ ౪౭.
ఆ॥ అనుచుసందియంబుపెనగొనఁబెనుముండ్ల । నవలఁద్రోచియతివయంతికంబు।
సేరిసొలసియున్నసీమంతినీమణి । నిట్టులడుగుసంయమీంద్రసుతుఁడు॥ ౪౮.

ఉ॥ ఎవ్వరిదాన వెక్కడకు నేగుచు నిచ్చటి కెట్లు వచ్చితో।
యవ్వభవన్ముఖేక్షు వసుధాధిపపుత్రిక మాడ్కిఁ దోఁచెడిన్।
జువ్వె కిరాతభామినులు శూలి నికీయ దలంచి తెచ్చిరే।
యివ్వనరాశిఁ బుట్టి దెగి యీగిరి సేరితె యేది చెప్పుమా॥ ౪౯.

చ॥ అనియడుగన్ మృగావతియు "నన్నయ యోధ్య యనంగ వింటివే।
పనుపడ నొక్కఁ డప్పురము పాలన సేయు రమాసమృద్ధి నా।
తని వరపుత్రి నేను భరతప్రవరాన్వయజాతుఁ డైన వ।
త్సనరపు ధర్మపత్ని నిగుశాంబుపురోపవనాళి నుండుదున్॥ ౫౦.

సీ॥ ఎన్నఁడే మడిగిన నెద నెంత విసువక పరిపూర్తి నొందించు ధరణిధవుఁడు।
కులశైలవిహరణస్థలముల నొకమేన గ్రీడించుచుండు ముక్రేణి సేయ।
సురదంపతీవిలాసరసత్వము సురతీకందర్పులే వేళఁ గాంచుచుండఁ।
జెలికువిందులు పూనిక అకుపూవంపకోలల జగజ్జైత్రులై చలము గలిగి।
యెన్ని వలరాచ సేఁతలు పన్నియుండ । మేల యవియన్ని నొడివితి వీవనంగ।
వలవదు మ్మలమాప నెవ్వానితరము । తలఁపనివి యెల్ల స్మరణకుఁ దగిలె నకట॥ ౫౧.

సీ॥ నెత్రుటి నూతిలో నీరాడఁ గోరితి నాతఁడు దానికియ్యకొనఁడయ్యె।
వెండియుఁ బలుమారు విరసభాషణములనుల్ల సమాడఁ దానొప్పికొనియె।
నలుక చేనప్పుడొ దలయెత్తి చూడనైతి నిబూచె గన్నులుగను దునెప్పు"।
డను చబిట్టెలుఁగుతో నతివయేడ్వఁగఁ జొచ్చె ముని సుతుండూరార్చి ముద్దరాల।
యానతిమ్మెట్లు సేరితీయవనిధరము । దివ్యసీమంతవతులిటఁ దెచ్చినారె।
యనుచు నడిగి దంపతుల నెయ్యంబు లరసి । బ్రహ్మకృతిదూటి తదనంతరంబ నంగ॥ ౫౨.

వ॥ ఆమె యుదుఃఖాతిరేకంబున మాటాడకున్న మునిబాలకుఁడు. ౫౩.

ఉ॥ చెక్కిళులందు నేత్రజలశీకరముల్ పచరింప దుఃఖియై।
వెక్కుచు నేల యేడ్చెదవు విష్యము నాయువు నిత్యమేవృథా।
పొక్కెద వొక్కనాఁడ తనిఁ బొందెద వవ్వలి వృత్తమెట్లనన్।
గ్రుక్కుచు నంతయుం దెలిపెఁ గోమలి నివ్వెఱగంది యాతఁడున్॥ ౫౪.

తరల॥ సవిధభూస్థలిసారసేక్షణజామదగ్న్యమహాశ్రమం।
బవిరతంబును సిద్ధసేవితమై తపోధనయక్షరా।
డ్భవనమై వెలుగొందు నచ్చటి పారికాంక్షిని గొల్చినన్।
వివిధకిల్బిషరోగపాతకవిస్తృతంబులు వోయెడిన్॥ ౫౫.

చ॥ అనిజడదారిపట్టియుండియావచనంబులశాంతి సేసియు।
య్యనఁ దెరవిచ్చికంటకములవ్వలఁద్రోయుచు శర్కరాతలం।
బునగడుమెల్లరమ్మనుచు భూమిధరక్వచిదగ్రపార్శ్వముల్।
మునుకొనిడిగ్గఁజేకటులమున్నగనితంబగుహాప్రదేశముల్॥ ౫౬.

ఉ॥ జగములకర్మసాక్షివయిసాధ్విగిరిస్థలిసల్లలాడఁగాఁ।
బాగులకక్కోపగించుకొనిమోముముడించెదుపద్మినీసతిన్।
దగిలెదువాఁడవంచుజమదగ్నియొసంగునొశాపమంచు నె।
వ్వగఁజరమాద్రిభిల్లజనవహ్నులవెల్చెదగుండుదేహముల్॥ ౫౭.

చ॥ ఇరువురుపర్వతస్థలులసేగఁగనుంగొనిభాస్కరత్విషా।
వరవరదూతులోయనినివాళులొసంగిపదంబులాక్రమిం।
చిరిభయచిత్తలైపొదలఁజెల్వములాడియుఁబొంతిమిగ్గురుం।
బురువనుకందుకంబుబుసుపోకకునాడుతమఃకుమారికల్॥ ౫౮.

ఉ॥ అజగరకుంభకర్ణునకునన్నువపైయడియాసదోఁపఁగాఁ।
నజరుఁడుత్రుళ్లనేసెమనుజాంగనస్వైరదనక్షతంబుల।
క్కజములుగాపటించనుచుగాత్రవిధిక్రియలాచరింపబం।
ధుజనులఁబిల్చిరోయనఁగఁదూలుచుఁగూసిరిపాపరిక్కసుల్॥ ౫౯.

చ॥ తొలిదెసఁగూఁతపవ్వరుగఁదోయధిభంగరవంబులప్పుడి।
కుక్కలనలమన్వధూటియనుఁ ‹‹ గోవిదపర్యజలస్వనంబులి।
ట్టలముగఁబర్వుచున్నయవిడాయఁగడాయఁగఁబెల్లుబ్రామసెడిన్।
దెలియఁగఁజెప్పుమీకెలనఁదీర్ఘములెవ్విప్రహాపంబులేవనన్॥ ౬౦.

మ॥ మునిసూనుండిదిప్రాఙ్మహాజలధియంభోయానమార్గంబునన్।
జనలేరెవ్వరథస్థలంబొరయునిశబ్దంబుతద్భంగపా।
తనజాతంబదిగోకనుంగొనుతపోధన్యాశ్రమంబల్లది।
వ్వనభూజంబులుమినుక్కుమినుక్కునదేవాల్గంటితద్దీపముల్॥ ౬౧.

వ॥ అనుచుఁ గొంతదవ్వరిగి యయ్యిరువురు. ౬౨.

మహాస్రగ్ధర॥ నవకవ్యాఘ్రాసనాసీనవిమలచతురామ్నాయసూత్రాత్తహవ్య।
స్తవనీయంబర్కతేజస్తరుణదధికవాచంయమవ్రాతమాది।
త్యవధూట్యానీతపుష్పస్తబకవిహితపాద్యక్షణామత్సరంబ।
భ్యవితాంతేవాసివాసంబగువరజమదగ్న్యాశ్రమంబొత్తిరంతన్॥ ౬౩.

సీ॥ ప్రభవించునొకచక్కిఁ బావపాగ్రకలాయకలితపక్షివ్రాతకలకలములు।
పొడచూపునొకచోటఁ బుణ్యాంగనాగీతికోపేతసంధ్యాగ్నిహోత్రఘృణులు।
తనరారునొకవంక వనముక్తశార్దూలమృగగోవృషానందమేళనములు।
పొదలించునొకచాయ మునికన్యకావినిర్మితమల్లికామోదరేఖలప్పు।
డాశ్రమంబుసొచ్చి యవనీభవంబులఁ । గడచి యుటజవితతిఁ గాంచి శిష్య।
పాఠకూటములను బాటింపకచ్చోట । నొక్కమందిరంబు నొందిరంత॥ ౬౪.
క॥ ఉదయోదయార్కసంధ్యా । గ్నిదయాదృష్యత్తపస్వినిర్మలతేజో।
విదళితభుజిష్యకిల్బిషు । సదమలు జమదగ్నిఁ దఱిసి సతియుఁ బ్రభులున్॥ ౬౫.
తే॥ ఎఱిఁగి కన్నీట నడుగుల నెఱపెఁ గనిత । పస్విదీర్ఘసుమంగలీభవ యటంచు।
నొడివె దివ్యచక్షుస్సనఁబడినపాట్ల । నెఱిఁగి మునిపతి జమదగ్ని యిట్లు వలుకు॥ ౬౬.
చ॥ వగవకుమమ్మ నీకుఁ గులవర్ధనుఁ డుద్భవమొందు నప్సరో।
విగళితశాపమిట్లొనరె వేగఁ జతుర్దశహాయనంబులన్।
మగిడి సమాగమంబగును మానుము దుఃఖము వీతిహోత్రుసో।
మగువను తింపుమిచ్చట నెమానిసుతాతతితోడ నుండుమా॥ ౬౭.
క॥ అనియూరటవల్కినఁ బెన్ । వినయము భక్తియును భయము వెలువడ మ్రొక్కెన్।
గనదుర్వార్చిస్సహితుని । వినిర్మలతనువుఁ గృశాను వేఁడం దొడఁగెన్॥ ౬౮.
చ॥ విమలతనుప్రభాహృతవివిస్తృతకిల్బిషహేతిసాంద్రసం।
గమనభవేక్షణామునినికాయసమర్పితపూతమంత్రయు।
న్నమితసురాంగనాతతిసనాథనొనర్పుము దాత్తచిత్తజ।
ప్రమదకళాహరా సతము పాలన సేయుము సత్యరక్షణా॥ ౬౯.
చ॥ ఇటులు మృగావతీరమణి యిష్టము చొప్పనగర్భకోక్తిమై।
పటుతరభీషణానలుని బాడఁగఁ గన్గొని సంయమీంద్రుఁడి।
చ్చటవసియింపఁ గావలసె సాంద్రవిధూపలసౌధవీథికా।
నటదళినీకచావితతి నానఁ జెలంగుల తాంగియక్కటా॥ ౭౦.
శా॥ శాల్యన్నంబు భుజించి నెచ్చెలులతోఁ జంద్రాశ్మవేద్యావళిన్।
బాల్యావస్థ గడించి యౌవనమహాప్రాదుర్భవస్వీకృతిన్।
గుల్యారామసరఃప్రదేశసుఖముల్ గొల్లాడి తద్భర్తతోఁ।
బల్లావర్తితతాపసాశ్రమములన్ బద్మాక్షి వర్తించునే!॥ ౭౧.
ఆ॥ అనిమునీంద్రుఁ డంతరాత్మ వాపోవఁగ । నతని వదనచిహ్నమాశ్రయించి।
తెలిసికొనియెఁ బొలఁతి తెలసి యిట్లను దివ్య । వాక్కుతోడ భక్తి నెక్కొనంగ॥ ౭౨.

చ॥ లవణమహాసముద్రమిదిలంఘ్యము రెండవదిక్షువందునై।
దవదెనలేనిదధ్యుదధియందులద్వీపము లెందుఁగల్గునె।
ద్ధవితతియప్సరోబలలదర్పకకేళిమెలంగుచుండున।
య్యవిరమణీయముల్మిగులనందొకదానివచింతుయుక్తనాన్॥ ౯౧

ఉ॥ అందుయమాదియోగనిరతాత్ముఁడుమానినమస్కృతుండుమ।
ధ్యందినసూర్యతేజుఁడులయప్రతిపాదితగానశాస్త్రని।
ష్యందసుధాసుధానిధితపోధికుఁడుండులయేశసంజ్ఞనై।
ష్టందపమాచరించునొకపుష్పవనంబునఁగట్టినిష్ఠతోన్॥ ౯౨

వ॥ అట్లుండ నొక్కనాఁడు. ౯౩

చ॥ సకలకలాకలాపుఁడగుసంయముఁడట్లుతపోవిభూతిఁజం।
పకకుసుమాకరోపవనిఁబద్మదళాక్షునిఁజిత్తవీథిలోఁ।
బ్రకటముసేసిస్ఫాటికసరంబుకరంబునఁబూనినిర్మలో।
దకరుచులీఁగమండలువుతాలిమినుండనభోంతరంబునన్॥ ౯౪.

చ॥ కలకలరావముల్వొడమెఁగంకణనిక్వణశీకరంబుమి।
న్నులమెవిపంచికారవసుధాపగగెంటసమాడెస్వర్ణదిన్।
సెలకొనెవాఙ్మనాదనవనీతముదధ్యుదధిన్బదాగ్రసం।
గళదురునూపురస్వనముగ్రమ్మెమునీశుతపోవనంబునన్॥ ౯౫.

చ॥ ఇరువురుడిగ్గభూమికిసురేశసుధర్మనటీమతల్లికల్।
తరుణి! తిలోత్తమాంగనయులంబుషయున్బహుశైకవాసనా।
సురభులఖండపార్శ్వములసొక్కుదలిర్పవనీవిహంగముల్।
తరువులనూఁగులాడవనితల్మునిఁజూచిప్రహృష్టచిత్తలై॥ ౯౬.

మ॥ సతతధ్యానతపోగ్నిహోత్రక్రతులన్సంధించిసంగీతసా।
హితులన్దేలెడునీమునీశ్వరునిఁగంటేనాట్యరేఖాసమం।
చితగీర్వాణఘణాధరీముఖయుతశ్రీపుండరీకాక్షుఁడీ।
యతిదర్శించినటీవినోదములనత్యానందునిన్జేసినన్॥ ౯౭.

చ॥ మనకుపహారమిచ్చిసురమానవతీతతిలోనగొప్పఁగా।
మనలఁదలంచునంచుఁబలుమాఱుఁగుఱుంగటఁజేరియొట్టులీ।
మునివిమలోద్యమంబుకుదియుట్టుగఁజేయుదమంచుదప్పులన్।
జనినికటోర్వికిన్మగిడిచయ్యనసేగుచువచ్చుచుండఁగన్॥ ౯౮.

తే॥ తమినలంబుష యోగాతిలోత్తమవిపంచి । మనమువాయించినట్లైనఁగనులఁదెఱచి। [గ॥
చూచుమునిమనోరథమబ్బెఁజూవెయనుఁడు । నొప్పెనామెయుఁగూర్చుండిరొప్పిదము
మ॥ ఉదయాహార్యము నెక్కిదప్పిగొనసూర్యుండొక్కచక్రంబునన్।
జదురుండైవడి నేగియేగిచరమాశాబాధపాథోనిధిన్।
గదిరెన్ గ్రీష్మఋతుప్రచారములునాకంబంటితీక్ష్ణాంశుస।
త్పదవిన్ బట్టెఁగదా! సుపర్వవనితల్ పద్మాననాసీనలై॥ ౧౦౦.
క॥ శ్రుతిగలిపి మేళవించిరి । చతురిమవీణాద్వయంబుజతగా సుదతుల్।
కృతిమాళవరాగంబున । జతురాస్యప్రియవధూటిచారిణులనఁగన్॥ ౧౦౧.
ఆ॥ ముద్దరాండ్రగీతిమూర్తిభవించిన । రాగలక్ష్మిమధురరవముఁబోలి।
ఘనసమాధినిష్ఠుకర్ణరంధ్రమ్ముల । నమృతధారవోలెనభినయించె॥ ౧౦౨.
మ॥ సురగంధర్వఫణాధరీసతులకున్ జోత్తేరఁగాఁగష్టమె।
వ్వరోవిద్యాధరులో తిలోత్తమయొయూర్వశ్యుక్తరేఖాదులో।
నరలోకాంగనలో తపఃఫలరమానందోజ్జ్వలాకారలె।
వ్వరోయేతెంచిరిగాకమత్తపములన్ వారించురక్షస్సులో॥ ౧౦౩.
ఆ॥ అనుచుసందియంబుపెనగొనజడదారి । గనులఁదెఱచిచూచికాంతలార।
యొక్కగీతమిందెచక్కవాయింపుఁడ । నంగసలిపిరట్లునాతులప్డు॥ ౧౦౪.
సీ॥ సహకారపల్లవశయ్యపైఁజెరలాడుపలుకుకోకిలరాగఫణితినిక్క।
వనలక్ష్మిగూడియౌవనలక్ష్మిఁడౌమరుద్రాజపుత్రుండుపేరణముసూపెఁ।
బరిణతకుసుమాళిపారవశ్యంబుననానందమకరందమట్టెచిందెఁ।
బద్మాననోల్లసద్భృమరపఙ్క్తులపాటకెయిదిగాఁదమతమయెలుఁగులిచ్చె।
రక్తిఁజవ్వనులబొంపంబురాగచిహ్న । మాశ్రయించెసురీమంజుహస్తఘటిత।
వల్లకీమృదుమధురగానంబునెఱసి । మానియవికల్పమనముతోలీనమయ్యె॥ ౧౦౫.
మ॥ వినవింపైరసవంతమైనసుదతీవీణానినాదంబునె।
మ్మనమున్ భ్రామయతీంద్రుఁడానతియిడెన్ మందారకచ్ఛాయలన్।
జనితానందకరంబుగాఁగఁజచులాస్యక్రీడవర్తింపుఁడీ।
యనదివ్యాంగనలాడిరట్లభినయవ్యాపారపారీణలై॥ ౧౦౬.
తే॥ అంతమునిప్రీతచేతస్కుఁడైవధూటు । లారయేమిగోరెదరనలలవలప్ప।
డెడపకపఠించువీణయుసెన్నఁడేని । వాడనిలతాంతహారంబువలయుమాకు॥ ౧౦౭.
చ॥ అననొకనాగవల్లిలతయంచితఘోషరటద్విపంచినా।
తననుమహారమిచ్చెమునితావకభావుకదివ్యచిత్తమా।

వనితలఁ బ్రోచుఁగాతయని వ్రాలిరిపాదతలంబులందునం
గనలనిశాంతథాస్తనిరోగారుణికాత్మలయేనుఁడత్తతిన్॥ ౧౦౮.

వ॥ వారలిద్దఱు లేచి కొంతసేపటికి. ౧౦౯.

చ॥ అనపయలంబుపొప్పరసహారమునొక్కసమీపవాఖతోఁ
బెనఁచికచాళినూనెముడిపీడఁగఁ గ్రొమ్ముడి వైచుచుండఁగా
వ్వనవొకకాకిదానిపాదునన్ మునివైఁబడెనంతనీసు పెం
పునగికురించినీకువలపుం బ్రకటించెదువాఁడుమీ ప్పెడిన్ ॥ ౧౧౦

చ॥ అనిశపియించెసంయమిమయూదినిరంతరయోగవేద్యులి
ట్లనకపశాపకర్తలువిలాసినియంతఁబదాంబుజంబులన్
బెనఁగఁగృపామరందమునబేర్చుమదాళియమూంగ్రుఁడీవుఘు
మినిజనియించిజన్మగతిమృత్యువుసెందినశాపముక్తిఁగా॥ ౧౧౧.

ఆ॥ అనుడువారుసెలవుకొనివిమానంబుల । స్వస్థలంబుసేరిసౌఖ్యసార
మహితభోగభాగ్యమండనంబులమండి । రచటనెఱనఖిత్త్వమంతరింప॥ ౧౧౨.

చ॥ వెనుకవిధాతగోష్ఠినరవిందశరాసనుఁడంపకోలలన్
ఘనతపవిఘ్నముఁడన్ పసువుగాత్రముచిల్లులుసేయనింద్రుఁడున్
గినుకవహించెబమ్మపరికించియలంబుసనావిఘూమునిన్
గనలిశపించెఁగాదటెమ్మృగావతిపూర్వకథాప్రపంచికన్॥ ౧౧౩.

తే॥ అపుడలంబుసవీణాయునలరుదండ । నఖిలలోకమకోనఁగిశక్తిస్వపుఁగు
వెదకిదయసేయుమనిచెప్పివెడలిపోయె । నటఁదిలోత్తమున్ద్రపగాలయుంబుసేరె॥ ౧౧౪.

ఉ॥ ఒక్కదినంబునందుఁబురుహూతుఁడుదివ్యసభాంతరంబునన్
దక్కటినిర్జరేశ్వరులదండడిఁబిల్చియధోజగంబునన్
నిక్కవిలాసభద్రుఁడనునీలగళప్రియుఁడొక్కవానివి
ట్టుక్కుమెయిన్ దపఃక్రియలనోలలనాడెడినేమిచెప్పుదున్॥ ౧౧౫.

చ॥ విమలతపోధికత్వమునవ్రేల్మిడివిశ్వచతుర్దశంబులో
క్కమొగినవ్రస్సిపోయెడినిగావువిపద్విముఖుండునవ్వఃపురీ
రమవరియింపఁగోరెడినొగ్రకుక్కనవొక్కయుపాయమెంచుఁడ
న్నమగువలెట్టులైనయమిసైష్ఠికమంబువుపాలుసేయుదుర్॥ ౧౧౬.

ఉ॥ తొల్లిఋషీంద్రులెందరువధూటులతియ్యనితేటమాటలన్
వెల్లనకంటకస్థలులవీడొక్కనిరమ్యనికుంజవాటులన్

జల్లనిగాడ్పులంగనలసన్ననియూర్పులెకాఁగఁగ్రొవ్విదన్।
మల్లెలపెల్లుదేనియలమాటునవేఁడెదు ! దివ్యకేళికిన్॥ ..౧౭.

చ॥ అనవముల్దివస్పతిప్రహర్షమనస్కుఁడుకాఁగనప్సరో।
వనితలనెల్లఁబిల్చివనవాపివనంబునముంగఁబద్మమా।
ర్గణములనెన్నికల్గలపిరమ్యసరఃపృథులాలయంబులన్।
మునుకొనుఁడన్ననెవ్వతెయుముందిడదయ్యెఁబదంబునెంతయున్॥ ౧౧౮.

వ॥ అంతనతండు తిలోత్తమఁ జేరబిలిచి. ౧౧౯.

శా॥విశ్వామిత్రునిజెర్చె మేనకతపోవీరాసనాసీనుఁడై।
శశ్వత్సంభవదుగ్రకోపుఁడయికాంతున్మౌనియింకొక్కమార్।
నిశ్వాసాగ్నిఁదపింపఁజేయదివినొంటింరంభఁబుత్తెంచితిన్।
విశ్వస్తుత్యతిలోత్తమామదనసేవన్జేయుమీసంయమిన్॥ ౧౨౦.

ఉ॥ నావుడునామెయొప్పికొనినవ్యవిభూషణపట్టవస్త్రముల్।
మైవిరచించియెన్నఁడునుమాయనివాఁడనినాగవల్లియున్।
బూవులదండవీణియయుఁబొందొనరించివిశేషచాతురి।
భావముదోఁపవీడ్కొనియెఁబాకరిపున్జనియెన్బిలక్షితిన్॥ ౧౨౧.

ఉ॥ ఆమెరసాతలంబుచనియచ్చటనొక్కవివిక్తసీమలో।
నీమముతోజపించుమునినిర్మలుఁగాంచివిలాసభద్రుఁడే।
యీమహితాత్ముఁడచ్చటిలయేశుఁడుగాఁడెభ్రమించిరాఁగనే।
లామదినియ్యకొంటిదివిజాధిపుమాటనెమిత్రుఁగూల్పనే॥ ౧౨౨.

ఉ॥ ఈతఁడుదివ్యదృష్టిఁబరమేశునిచేఁతలుసైతమొక్కమా।
యీతలపోయునన్నిపుడెతింగిశపించినఁదోడివారినం।
గాతముతప్పనంచుఁగనుగందుచునొక్కలతాంతమార్గణ।
ద్యోతతకైతవేషువునొప్పిడివశ్యముఖిన్భజించుచోన్॥ ౧౨౩.

సీ॥ వసునేమియనుభోగివశ్యముఖీదేవతానివేశంబునదాఁగియుండి।
యచ్చరఁజూడమోహంబుపెల్లుబ్బికౌఁగిలిగోరిగ్రక్కునగేశబంధ।
మానిపాణిమలంచియధరంబుగ్రోలఁగంపితసంభ్రమాంగియైపెలుచనఱచె।
జడిముడినఱవనాజడదారిఘక్కునగనువిచ్చిచూచెనల్కుఁడలగడఁగి।
యనమృగావతియిట్లనయలికులేశ । యేలవసునేమిదేవతాగృహమునందు।
డాఁగియుండితిలోత్తమడగ్గరించె । నెఱుఁగఁజెప్పుప్రారబ్ధకంబెవనివిడుచు॥ ౧౨౪.

చ॥ అనవుడుదివ్యచిత్తముననన్నియుఁదెలింగిమునీంద్రుఁడంగనా।
వినుముఫణీంద్రకన్యకలువేడుకమైఁగనుమూసిగంతెనల్।
మునుకొనియాడుచోనతఁడుమూలగృహంబునడాఁగియుండెఁగ।
న్గొనుచలకన్నియల్మఱుఁగఁగొబ్బునఁగాంచెనమర్త్యభామినిన్॥ ౧౨౫.

చ॥ యమికనువిచ్చివల్కెఁడలనారసియేదియుఁగానకయ్యెడన్।
శమమదిదివ్యదృష్టిమెయిసర్వమెఱింగిబలారిద్రోహకా।
ర్యములునుమిత్రురాలిదుప్రయత్నముతద్గతిశిక్షణంబువే।
గమెశపియించెవీణవిడికందువెలుంగకయేగఁగాతనన్॥ ౧౨౬.

తే॥ అంతసామాన్యదేవతాయతనమందు । విడిచివీణాదివెట్టెత్తివీటికేగ।
నతఁడుపాతాళవాసినియండసేరి । యలరినుతియింపఁబ్రత్యక్షమయ్యెదేవి॥ ౧౨౭.

వ॥ అయి ౧౨౮.

ఆ॥ నీయభీష్టసిద్ధినెఱవేఱునొకనాఁడు । మత్సమీపమునకుమఱలరమ్ము।
పొమ్మనంగనతఁడుపూవుదండయువీణ । లతయునెత్తుకొనిస్థలంబుసేరె॥ ౧౨౯.

చ॥ వడివడివేల్పుటెంకిచనివాసవుఁగాంచిసమస్తసంగతుల్।
విడకరయెఱుంగఁజెప్పెనరవిందదళాక్షి.సురుండుదేవరా।
పడఁతికిశాపమిచ్చెబుషిపైదలికైవను నేమిప్రాగ్భవం।
బెఱపకనిష్ఠతోడజపియించెనువశ్యముఖీశ్వరీక్షితిన్॥ ౧౩౦.

చ॥ అనిసుఖముండెనచ్చరప్రియావచనంబులదీర్ఘచింతనం।
బొనరిభవత్పురంబునకునూర్వశిఁదోకొనివచ్చెఁద్రోవలోఁ।
గనియెజయంతుఁడన్నృపునిగాంచనభూధరధీరునత్తఱిన్।
గనుఁగొనునూర్వశీరమణికామశరాహతిఁగుండెనంతయున్॥ ౧౩౧.

తే॥ అచటనూర్వశివిడియయోధ్యాపురంబు । దఱిసినినుఁజూచినీవృత్తంబుసెప్ప।
నప్సరోమణియాకాశయానమందు । నడచుచుండెనుసాకేతనగరికపుడు॥ ౧౩౨.

క॥ అనిజమదగ్నివచింపఁగ । వినియుత్కలియుట్టులడిగెవివరింపుఁడుచే।
రొక్కనినజయంతుండెవఁడన । మునినాథుఁడువల్కెనిట్లుముదముదలిర్పన్॥ ౧౩౩.

క॥ అనికాణభూతిచెప్పిన । గుణాఢ్యుఁడిట్లనుభగుండుగ్రుంకెడినపరాం।
బునిధికదంబారుణమ । య్యెనుబడమటినర్ఘవేళయిదియనివెడలెన్॥ ౧౩౪.

గద్యము॥ ఇది శ్రీరామకృష్ణకవిప్రణీతంబైన వృగ్గావతియందుఁ దృతీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# మృ గా వ తి.

## చతుర్థాశ్వాసము.

---

గీ॥ అతులవేదవేదాంగవిద్యావివేక । భూతిఁదనరారునాకాణభూతిసుగుణ।
నిధిగుణాఢ్యునకిట్లనునిర్మలుండు । మునిమృగావతితోఁగథమొదలువెట్టె॥ ౧.

సీ॥ ఏపీటిమగలుపుంభావగీర్దేవులైవాగ్వరికాపురివన్నెకొండ్రు।
ఏపీటిసతులుభార్గవీందిరాభలుమహాకాళీపదార్చనాకలనగరిమ।
నేపురీమానినికేళీటమలయజంబిచ్చికోపంబుమాయించుహేళి।
ఏప్రోలివనలక్ష్మియెదిగిమాధవుఁగూడిమకరందఘర్మాంబుమయతనెసఁగు।
నట్టియుజ్జయినీపురినలరునొక్క । బమ్మఁడమలాగ్నిహోత్రతత్పరుఁడుపరుల।
సిరులనాసింపఁడతివలచెలువములను । గొల్లలాడఁడుపరమేశుఁగొలుచునెపుడు॥ ౨.

సీ॥ శాంబరీమహిమచేఁజదలేటనీరాడుఁబ్రతిదినంబిరుసంజబాడబుండు।
పెనునిష్ఠనొకనాఁడుకనుమూసిజపియించుచుండనలంబుషయొంటివచ్చి।
సాష్టాంగదండంబుసలుపఁగనివ్వచ్చియాశీర్వచఃఫక్కియోచెలువనీకుఁ।
జక్రవర్తిసుతుండుజనియించునననామెనాకేలభువియేలునందనుండు।
కొలుపుసర్వాంగసుందరిఁగూతునొసగు । మనినబాలుఁడమర్షతనతివసాదు।
పల్కమోఘంబుమాప్వచ్చఁబాటుగామి । నీకునిట్లాడఁదగునెతృణీకరించి॥ 3.

క॥ మల్లకుఁడుధాతనీకృతి । కొల్లకమున్నిచ్చుశాపముర్ద్విజనింపన్।
మల్లామడియగుశపనము । సెల్లుతటిన్ జక్రవర్తిచిన్నఁడుపుట్టున్॥ ౪.

క॥ అనివిప్రుఁడునిబ్బరికిం । చినకార్యముతప్పపెటిఁగిచెచ్చెరఁద్రోవం।
జనెవేల్పువేశ్యతనత్రో । కున్ననేగెమహీసురుండుకొన్నాళ్లరుగన్॥ ౫.

క॥ పరమేష్ఠితిట్టుకతమున । సురవేశ్యజనించెభూమిసాంపేపతిపాం।
పిరిస్రావనాథరాసుర । వరుఁడుకలనుదోచితొంటివైనముచెప్పెన్॥ ౬.

సీ॥ అంతనాతఁడుతీర్థయాత్రాభిలాషియైదేశదేశంబులుతిరిగితిరిగి।
కాశికాపురిసేరికాలభైరవువిశ్వనాథుపర్యించిగంగాతరంగి।
ణీతరంగంబులనీరాడియావలఁబ్రయాగఁబోయివిధిక్రియలనొనర్చి।
స్థలపురాణంబునుజదివియచ్చటిగంగశాంతనీవడువునబాసఁగఁబల్కి।

మధ్యవాంతరమునమంబాకినీతటి । భూమిభుండఁగాఁగఁబుట్టి యప్పుడు।
జవ్వనంబువాల్చిశత్రుభీకరుఁడనై । మనఁగఁజేయుమనుచుమునిమునింగ॥ ౭.

ఉ॥ అంతటఁ బాటలీపురమునందుపయించెజయంతుసంజ్ఞచే।
త్వంతరమైయతండుపుడయౌవనముంగరియించెనన్నఁబెల్।
వంతఁద్రిలోకత్తమారమణిపందురియొచ్చుటికేగ నెట్లునా।
చెంతకుఁజేరెనిప్పుడుపచింపుఁడుశేషకథానుభోరణిల్॥ ౮.

గీ॥ అనిమృగావతిపల్కసంయమిమృగాక్షి । వినుమునీపాంతిఁజేసిన వెలవెలంది।
నీదుకామప్రసంగముల్నిలిచివినుచు । సమయమిదికాదటంచుమస్వర్గమునకేగె॥ ౯.

చ॥ అనఁగ్మృతవర్మపుత్రిసమయంబెఱుఁగకాదయనానలిందుసు।
న్మనిజనవర్యయన్నఋషిమోదముజాల్కనవైశ్యకోత్తని।
ట్లనిరెయొసఖీజనంబునినునత్యతిశీతలపుష్పగుచ్ఛని।
జనములఁదేష్చుచుండనొకశారికభర్తృకథల్వచింపఁగన్॥ ౧౦.

చ॥ ఇవికలయోయటన్నఁజెలులెక్కడిదిగ్రహమనిప్పడుపత్నులి।
య్యనితలపోయుమన్నఁదమిహస్తతలాగ్రనిష్కకీరముల్।
దవులమిముద్దువెట్టనదిపట్టునవింబమనాఁగనాతలల్।
జవిగననీవుస్వప్నగతిసంగతికాదనినమ్మునత్తఱిన్॥ ౧౧.

గీ॥ వినుమువెనుకఁదిలోత్తమవేల్పుప్రోలి । కేగుచుండంగపత్నరాజేంద్రుఁగాంచి।
వీణావృత్తాంతమతనితోవిన్నవింప । నపుడుగొండొకరితివిలువమనియెనప్పుడని॥ ౧౨.

చ॥ అనినమృగావతీరమణియయ్యతిదివ్యపదారవిందముల్।
వినుతియొనర్చియాతనినివీడ్కొనితాపసబాలికామణుల్।
క్రనుకనివచ్చుచున్నపుడుకన్గొనివారలతోసమస్తముల్।
జనవునఁజెప్పియచ్చటనెసమ్మతినుండెనుగొన్నినాళ్లకున్॥ ౧౩.

సీ॥ తలతెలవేగువేళలవేల్పుటెలనాగలలరులఁజిదుమఁదాఁగలసితానును।
శిఖివేల్చుతడవులఁజెలులతోఁబావనాగ్నినిగొల్చుచుండునునెమ్మనమున।
నాగిరంబులుమెక్కిరొయికిమపైగౌరవంకసకియలనవ్వించిసరసమాడుఁ।
జరమసంధ్యలసరస్వతుల్కాలములనులివేడిరెయెండలఁగూడియాడుచుండు।
వలఁతనొక్కొకవేళయాటాడఁబోదు । నికటకల్లోలినీఝరీనిర్మలాంబు।
కేళికామోదమకరందమోలలాడ । గర్భితాగ్భకచలనంబుకలుగకుండ॥ ౧౪.

సీ॥ జడదారికన్నియల్సఖ్యంబుపెంపుననులిపూచుముల్లియల్వలచితెచ్చి।
జడగుచ్చరాదటఁబడతికిఁనొకనాఁడుచిరుపచ్చసంపెఁగల్పేరివిసరుల।

గోష్ఠి వెట్టుదురోలిఁ గొండొకతడవు నసుదగొన్న గేహఁగుల్చుట్టుజడల।
పఱలింతు రొకతఱిఁ బరిమళించెడుగులాబీవిరుల్ రాకిడిబిళ్ల వ్రాలెఁ।
గోసరికై సేతురొకతతి గుసుగుసకొనిన । తావిసేమంతివిరులఁ గాంతలొకచాఁగ।
సీమనిల్పుదురొకవేళఁ జెలువమలర । సూరకుంద్రుసహజపురూపాలయునటుల॥ ౧౫.

క॥ సహకారతరులనీడల । మహిళాతతి చరమసంధ్య మంపిలికేళీ।
స్పృహఁ గందుకంబులాడఁగ । విహరించుమనోనురాగవిభ్రమమెసరన్॥ ౧౬.

శా॥ మల్లీచంపకమాధవీమధురసామందారభూమీజముల్।
పిల్లల్వెట్టఁగ నీరువోయుతఱిఁ గర్భిణ్యానసాబ్జస్థలిన్।
గొల్లాడన్ దరఘర్మజామృతకణాంకూరంబు దివ్యాంగనల్।
తల్లీ మానుమటంచుఁ బైవెఱఁగుచేతన్ ద్రోతురీవాపలన్॥ ౧౭.

చ॥ కరతలమందుఁ జెందిరపుఁ గావినిరోపకుఁ బద్మకర్ణికల్।
విరచనసేయుచుం ద్రుప్రభవించెడిపుత్రునిపాణిసూంటకై।
పరిమళవాసనాదిపరిపాకకలాపసుఖానుభూతిలో।
గరఁగఁగఁ జేసిరా చెలులు గర్భిణి నెవ్వగలోసరిల్లఁగన్॥ ౧౮.

చ॥ ఎనిమిదిమాసముల్ గడవ నేడ్తెఱమామిడిమ్రానిక్రిందఁ గ్రొ।
స్ననలతుఱంగలిన్ జగిలెనాతులు గర్భిణిభవ్యకోకిల।
స్వనములఁ దేల్చుచుండిరి రసాలకిసంబులమానసంబు పెం।
దనిపిరికొంతకాలమిటు దాటఁగ నొక్కనిదాఘువేళలోన్॥ ౧౯.

చ॥ రవివృషభంబునన్ మిథునరాశిబుధుండు మృగేంద్రరాశిలోఁ।
గవిగురుచంద్రులోజఁగటకంబుననుండఁగఁ గర్కిలగ్నమం।
దువిదకుఁ బుత్రుడుద్భవిలెయుక్తవిలక్షణపద్మచామరా।
దివివిధరేఖులంఘ్రికరదివ్యతలంబులముద్దువారఁగన్॥ ౨౦.

వ॥ అట్లొండు రెండుదినంబులు గడచి యొకనాఁడు మృగావతి పరిబోధపరిచితవిహీనుం డగు సూనుం గాంచి. ౨౧.

గీ॥ పేరుం చెలికత్తియలు నిన్ను వెలసిచుట్టు । రత్నభూషణజాలంబు రహిఁజనింప।
నెత్తిశిరోగృహసాలభంజికలు గొలువ । పేడ్క విడనాడి యిట్లుంటివిధివశంబె॥ ౨౨.

సీ॥ రతనంపుఁ బఱిమలవితతి కానుకఁబూని దైవకన్యకలు నిన్ దారసింప।
ముదలింపఁ బడకయ ముదమున రంభాదినలిననేత్రలు గూడి నాట్యమాడ।
మధురగీతములతో మణిఁబోలె నజకేళభూమీశసతులు నిన్ ముద్దులాడ।
మాతల్లి సంద్రుఁడు మనములు పొంగిని చిఱునవ్వు మొఱపులో మఱఁగియుండ।

జగములకు నెల్ల నొక్కయుత్సవము వోలెఁ । దనరు నీదివ్యపుణ్యాహదినము లకట।
యిట్లుగా దైవములు సేయు నే కుమార । యేమునోచిననోములింతింత లేమొ॥ ౨౩.

వ॥ అని దుఃఖావేశంబున బొందియుండెనంత. ౨౪.

గీ॥ జాతకర్మాదిసంస్క్రియల్ సలిపి మునియ । పదునొకొండవదినమున నుదయనుఁడను।
నామమర్భకునకిడె నామ్నాయమంత్ర । విధులనుదయాద్రి నావిర్భవించు కతన॥ ౨౫.

గీ॥ అప్పుడశరీరవాణి యీయర్భకునకుఁ । గలుగు పుత్త్రుండు విద్యాధరులకు సార్వ।
భౌముఁడై యుండుననియెఁ గల్పప్రసూన । వృష్టి గురిసిరి సురలు సంతుష్టి నొంది॥ ౨౬.

చ॥ ఉదయను హస్తభాగముల నొప్పెసలారె సరోజకర్ణికల్।
మదను పునర్భవంబొ వరమంజులరాశి నికేతనంబొ పూ।
ర్వదురితచేష్టలన్ నలుపువన్నెయుఁ ద్రోచి జనించు కృష్ణుఁడో।
కొదకొను నైషధుండొ నలకూబరుఁడో యనన్ నొప్పె నత్తఱిన్॥ ౨౭.

మ॥ లలితామ్రద్రుమశాఖఁ గట్టిడిన తొట్లం బెట్టి యాలింపురో।
కిలనాదంబులు మాతపల్లవమిదో కేల్చిల్కలీ తొట్లనిన్।
గలయం జూచు సుపర్వనాగమహిభృత్కన్యాళి యీయాశ్రమం।
బులకే తెంతురు రూపమన్మథసితాంభోజాక్షులాలూగుమీ॥ ౨౮.

క॥ అనుచున్ జిలిబిలిపాటల । ననుఁగుంగుమారునకుఁ బాడుచర్థిన్ దేవుల్।
మనమున బెనఁగొను హర్షం । బునగడు నలయించి రిద్రపుత్త్రుని బిడ్డన్॥ ౨౯.

శా॥ సైరంధ్రుల్ వదినెల్ శ్వసల్ గురువధూసంఘంబు మేనత్తలున్।
ధీరోదాత్తలు మానియోషలెతదంతేవాసులున్ మానియున్।
జేరం జుట్టలుఁ దండ్రి బావమఱఁదుల్ సేదోడులన్నల్గదా।
గారా మొప్పఁగఁ బెంచుచుండ రచటం గావున్న పుణ్యాంగనల్॥ ౩౦.

మ॥ జిలుపై యుబ్బిన బుగ్గలున్నిగనిగన్ జిన్నారి మైవన్నె రా।
సులుఁ జొప్పార ఘృతంపు జొల్లు వొడువన్ జోగాడ మొల్నాలిగ।
జ్జెలుఘల్ ఘల్లనఁ దల్లి క్రేవలశిశుశ్రీల్ వల్కరాచిల్కము।
ద్దులపల్కుల్వలె నమ్మయత్తయని చేతుల్ తట్టురా పట్టివో॥ ౩౧.

చ॥ జిలిబిలిమాటలే నగవు చిన్నరిపొన్నరి ముద్దుచైదముల్।
నులినులిసిగ్గులున్ దలిరునున్నని మేనును లేఁత మోవియున్।
జిలుఁగుగులాబివోలు నైజి చెక్కులు పిక్కటిలంగఁ దల్లి చెం।
తలఁదియ గాడు బిడ్డఁ గని దండడిఁడాయఁ డెవండు ముద్దిడన్॥ ౩౨.

సీ॥ పురివిచ్చి నెమ్మి నెమ్మునవు మైఁదలయెత్తి క్రొవ్విరియాడంగ గ్రక్కున నెయెక్క।
సాకూతమైయున వష్టంభత నెగ్గెత్తి కూయవ బ్రమున గ్రక్కున నెనవ్వ।
నొయ్యరనలు దిక్కులోలగించి యురజ్జు పెనఁచి పైచూడ గ్రక్కున నెతాఁకుఁ।
గనులక్షరత్న సంఘటిత మైదోఁచు నో మేచకంబులలీక మేళనంబు।
సేయు జగదేక మోహన శ్రీదలిర్ప । నక్కుమారుండు మున్నాశ్రమాంతరముల।
శిఖికుమారు నిరీతి నాశిశువుఁదలఁచు । నిట్టి సేఁతలు కరఁగింప దెట్టి వాని॥ ౩౩.
చ॥ మొగిళులు వేగ మైపఁబవఁ బూర్ణనిశాకరుఁ జూచి తల్లితోఁ।
నిగనిగ వెండిపండు దివి నిర్మలకాంతులదోఁగి పాఱెడిన్।
బిగి నగఁగంఠహారమును బిడ్డగళస్థలి వైచుఁదల్లి యున్।
దొగరుచినున్న నీలమణిఁదోఁచిన చంద్రుని గాంచు బ్రీతితోన్॥ ౩౪.
శా॥ ఈచైవంబులు గాంచి తల్లి మదిలో నేజన్మపాపంబొ రా।
జేచిన్నారియనుంగుఁబల్కులకు నై యెన్నాళ్లు మూర్ఛిల్లు నో।
యేచందంబున జూతు మేమి సుపురీ హేలావిశేషంబులన్।
వైచెన్ బో విధిమమ్ము వొంపొరుల గ్రావప్రాంతదూరంబులన్॥ ౩౫.
శా॥ కౌశాంబీపురి కేళికావనమునన్ గంభీరలీలాసర।
స్సాకాశుంజగృహాంతరస్ఫటికకాంతారచ్య వేవ్యాళిను।
ర్వ్యపుఁగూడి సమీపభూమిసుతుఁడర్చిష్మంతుఁడాత్తవ్యథా।
శాఖాఖండనమండలుండు విహరింపన్ గాంతుమో గాంచమో॥ ౩౬.
ఉ॥ దారుణశైలసానుపరితాపవిభుగ్నమనస్కుఁడై నహ్రా।
ఘోరవనాంతరశ్రమవికుంఠితపాదసరోజుఁడైనసం।
ద్యారమణీయతాండవకళాధిగతప్రమదాత్ముఁడైనసం।
సారవియోగియైనసుతుజల్పవచంబులఁ బాసి గానఁడే॥ ౩౭.
ఉ॥ ఇట్టివియోగవేదనలకెన్నిభవంబుల నోఁచికొంటి నో।
పట్టపురాణినై పరనృపప్రమదామణులోలగింపనె।
ప్పట్టున నృత్తగీతపరిపాకముదావహనైన నన్నుని।
క్కట్టున బెట్టె దైవగతి గ్రాఁచఁగనెవ్వతె నేర్చునక్కటా॥ ౩౮.
ఆ॥ కన్నకూతుఁబోలె గారాము మైజమ । దగ్ని పెంచు నాయతనము విడువ।
నీయఁడైన భర్త యెదుట లేకుండిన । బ్రతుక దేల మొనరు వ్రతము లేల॥ ౩౯.
క॥ పతియే దైవాగ్రణియని । సతులకు నియమింపవిన మొసర్వజ్ఞులఁ గ।
ష్టతరసమయముల నెవ్వా । నితావుగొందురు వియోగనిగళితధీరల్॥ ౪౦.

క॥ అనివంయుచవరవర్ణిని । యనిశముఁబతిఁబలఁచిఁయుట్టలనుదినముమహీ।
ఫునిపుత్రుఁడుచూపఱకోద । వినహర్షమునూపుమధురవిస్మయనేష్టక్॥ ౪౨.

ఉ॥ ఆదరమొప్పనమ్మునికులాగ్రణిపావనమంత్రయుక్తిమై।
గ్గైదవయేడురానిసువుకక్షరవ్రస్కులనేర్పెసర్వగా।
స్త్రాదితనీతులంగఱపుచొండొకకాలముపుచ్చిబాలునిక్।
వేదచతుష్టయంబులఁబ్రవీణునిజేసెజగద్ధితంబుగక్॥ ౪౩.

వ॥ ఇట్లు కొంతకాలంబున కనన్యసామాన్యప్రతిభావిశేషంబులం [illegible]సి యచ్చక్కుమారుండు.

చ॥ అఱువదినాల్గువిద్యలమహత్త్వములెల్లఱెఱింగిలోకనుం।
దరతధనుష్కళాపటిమదారుణసింహమృగాదిలోకభీ।
కరుఁడయిఖేచరుల్ వొగడఁగ్రాలెభువాంతరమందుఖేగలక్ ।
బోరిగొనులెక్కుడేయనుచుఁబుట్టినవీనుఁడుమానుఁడోయనన్॥ ౪౪.

సీ॥ అలఁతివిల్వూనివర్షలకేగుజవదారిదిఱుతపాయుదువారఁజేసెపెగ।
మునితనూజలతోడమొగడలఁజిదిమిపెక్ లీలమైయంచువెంప్లొనిప్లాసేయు।
సర్వశాస్త్రాభ్యాససౌభాగ్యమహిమచేశారదాపతికర్పనలువెట్టు।
పులినసీమలగంతెనలునైచిగిర్లాడిపడవలమున్నిటిఁగిడబిడాపు।
జలధిరింఖణాభంగసంజన్యమాన । ఫేనముక్తాపుటంబులఁబెడఁగుఁజూపు।
వీణియలనాదుకెనదైనవెలఁదిగీత । ఘణితినొక్కొకనేళనాబాలుఁడెపుడు॥ ౪౫.

ఉ॥ కొండొకనాఁడుమానికడకుంజనిభక్తిదలిర్ప «నయ్యయా।
ఖండమునేలుభూపతిశిఖామణిమేఁడతఁడెందునుండుఁగు।
ద్దండుఁడె? సాత్త్వికుండె? "యనఁదాపసపుర్యుఁడువిస్మయాస్యుఁడై।
«చండకరాభ! త్వత్ప్రసువుచక్కనెఱుంగుమ్ముబాస్ము" నాపుడున్॥ ౪౬.

మ॥ ధనురస్త్రంబులుకేలఁబూనిమునిపుత్రవ్రాతముల్ తోడరా।
జననింగాంచి «యెఱుంగఁజేస్వామిపుడీపప్రాగ్వాటవద్రిని।
శ్వానవద్వీపముతేలునెవ్వఁడ" నవాశ్చర్యంబుఖేదంబునై।
మ్మనముంబ్రామవచించునిట్లనతిరమ్యస్నిగ్ధవాక్పాటవక్॥ ౪౭.

క॥ ఈయూర్మికఁగొనుమిందే । నాయకతిలకంబుభద్రనామముఖ్యచితం।
శైయొప్పనతఁడఖండ । క్ష్మాయుతుఁడఖిలారివర్గసంహారుఁడిలక్॥ ౪౮.

చ॥ అనితనయుంగరంబిడఁగనయ్యలిలోకపరాక్రమక్రమా।
గ్జనవినిబద్ధనూనసుఁడుసంగరరంగవినోదమోదమోహసం।

జనితకళాభిరాముఁడగుపుత్రకుమారుఁడుదారబుద్ధియై।
జననికిమ్రొక్కియిట్లనువిచారముమోమునదోఁగలింపఁగన్॥ ౪౯.

క॥ దీనఁపగుపేరిటిసహా । స్థానీకుండెవ్వఁడుంగరమునీకెవఁడె।
ట్లీనోఁ జెపుమకడునవ । ధానముతోనున్నవాఁడఁదమిమెయిఁదల్లీ॥ ౫౦.

ఉ॥ నాపుడుఁజెల్వదుఃఖవదనంబున ‹‹ నెవ్వనినామపత్త్రికనీ।
భావముచెందెనో యెవనిబాహుబలంబునకగ్గలించియా।
దైవవిభుండునుంగొలుచుఁదత్పతియేనినుఁగన్నతండ్రిసం।
భావనసేయుమీపరమపావననామమునైనపుత్రికా। ౫౧.

వ॥ అని తనపడిన యెల్లయిడుమలం గొడుకునకుం దేటతెల్లంబుగా నుడివిన నక్కుమారుం డును బాల్యలౌల్యంబునుజేసిన యయ్యాదికథయుంబోలె గ్రహించియుండెనంతఁ బెద్ద కాలంబుచనిన. ౫౨.

సీ॥ ఉదయపర్వతవిహారోల్లాససముచితజ్యోతిస్ఫురద్బాలసూర్యుఁడనఁగ।
నసమాస్త్రకలనయశోంగనాసీమంతలలితసింధూరవల్లికమనఁగ।
త్రైలోక్యజైత్రయాత్రాపేంఖదస్త్రాధిదేవతాహాసచంద్రికయనంగ।
కుసుమనారాచయుక్కోదండధారిణీవశ్యముఖీపురోధ్వజమనంగ।
నొప్పునాబాలుఁడొక్కనాఁడుదయశిఖరి । పరిసరారణ్యభూములభవ్యమృగయ।
కతనవిహరింపఁబోడఁగినెక్కుడుసొచ్చి । యరుగుచుండఁగనొకటఁదామరలువజల॥

గీ। కొలనుపొడగాంచియందలిజలముగ్రోలి । యవులఁబోవుదమనిడప్పియారనీరు।
ద్రావియచ్చోటనొక్కచట్రాతిపైని । విల్లునమ్ములపొదివెట్టివిశ్రమించి॥ ౫౪.

ఆ॥ బ్రహ్మసృష్టియెల్లబ్రాకృతరూపంబు । పొలుపునెఱపుఁగమలఁజెలువునింపు।
నగుటజటిలులిట్టియాహ్లాదమునజేసి । యమలహృదయులగుచునడవినుంద్రు॥ ౫౫.

గీ॥ రమ్యమగుదూరనారికేరప్రకాండ । వితతిచెలికత్తెలొండొరువేడ్కఁజేర్చి।
మంతనములాడెఁబయ్యెదల్మలపినట్లు । పచ్చకీతులనల్లార్చుబంధురముగ॥ ౫౬.

గీ॥ దూరముననుండుకొండలబారుచూడఁ । దివిరియొండొంటవెనుబడుదిగ్గజముల।
భంగిఁబోచునహో! చిత్రపటమునందు । నన్నిచిత్రించినట్లున్నదరసిచూడ॥ ౫౭.

వ॥ అని తలంచుచు శ్రమాపనోదనార్థంబు కించిత్కాలంబటు విశ్రమించి. ౫౮.

ఆ॥ తడవుసెల్లెనిల్లువిడిచిమాతల్లియే । దిగులువడునొయనుచుమగుడిజలము।
గ్రోలఁబోయిమొక్కఁగుక్కఁదావఁగఁజేదు । గాఁగనుండనొమ్మెఁగలుఁగుచవ్వడు॥ ౫౯.

ఉ॥ ఉమ్మకముస్నెప్రేలితెలియుంగరపుంగులిశంబువచ్చనై।
కమ్మనికేతకీదళముకైవడిఁబోఁచెసవిస్మయాత్ముఁడై।

యమ్మహిపాత్మజుండుపసపాదుదురిచ్చటసాగ్యులెవ్వరో।
యిమ్మగనాఁదలంచిపథమెక్కికెలంకులఁజూచియిట్లనున్॥ ౬౦.

సీ॥ నలుగడల్పరికింపనరుఁడుమారఁగరానికంటకారణ్యమీకటకమెల్ల।
విరియుపెబ్బులులైనఘోరరానిదట్టపుటంఘ్రిపంబులుగా వెయల్ల వెల్ల।
భల్లూకవేదండబహుకురంగాదిమృచ్చరశరక్కరాతలసంకులంబు।
నైనయీపథములనడుగులుకన్పట్టుచున్నలెవ్వారలీయుదకముగొన।
వత్తురోయీకెలంకులవలనుండ । తెరలిగేదంగితావియేతెంచెడినిటఁ।
బసపుపొడిరాల్చియున్నదీపట్టులందు । సతమునీరాడిపోదురిందతిపలెవరో॥ ౬౧.

చ॥ అనుమహాకింతదవ్వరిగియచ్చటఁగౌశికుఁడొక్కఁడొక్కభో।
గినిగరమూనిపట్టివిషకీలితదంతములెత్తుచుండనె।
మ్మనముక్పపారసంబుననిమగ్నముగానకటాఘణీంద్రదళం।
సనమొనరింపనేలయనిసంభ్రమమొప్పఁగడాసియాతనిన్॥ ౬౨.

ఉ॥ ఎవ్వరికేమియుంజెడుగులెంచకయిష్టవిహారలీలలన్।
మవ్వపుఁదెల్లరిక్కలకుమాఁటలైనఫణాగ్రరత్నపుం।
దివ్వెలతోసుఖాంబునిధిఁదెప్పలఁదేలెడుచిల్వపిండుతోఁ।
జివ్వలుసేసెదేలయహిసేసినదేమికిరాతనందనా॥ ౬౩.

క॥ నావుడుఁగౌశికుఁడిట్లను । భూవల్లభవైజయన్తిపాలివుత్తురెయీ।
జీవనముదక్కనాకిఁక । నేవన్నెయువాసిలేదహీనవిచారా॥ ౬౪.

క॥ అనవుడునాయహితుండిక । మనమునసంతాపమెడలిమనుమీయుంగ్రం॥
బునుఁగైకొనిఫణిరత్నం । బునువిడిచియుఘోద్భుఁజనుముపూఁచునిపల్కన్॥ ౬౫.

తే॥ అక్కుమారకునకుమ్రొక్కివేల్పులునిద్ర । నేఁడదెలిసిరనుచుఁబాడుకొనుచు।
నేగెనంతనాఫణీంద్రంబురాజపు । త్రునకునిట్లుచెప్పఁవొడఁగెనపుడు॥ ౬౬.

ఉ॥ రాజకులాగ్రగణ్యరతిరాజసమానవిమానచారిణీ।
పూజితదివ్యరూపమునిముఖ్యవివర్ధితయుత్రిశస్త్రవి।
ద్యాజయగాండివిప్రవరధైర్యరమాధికమత్తరాజితే।
జోజయశీలిశీలితవిశుద్ధనయార్జనసత్యవర్ధనా॥ ౬౭.

సీ॥ అవధారువసునేమియనునాగుఁడొక్కఁడుపాతాళముననిలాభద్రుఁడనఁగ।
బరఁగువానికుమారిభద్రావతినిగోరివశ్యముఖీశ్వరివసుధలోన।
దపమొనర్చెఁగడిందిధార్మికురాలుప్రత్యక్షమైయగ్ని నాళ్ళాగుమనియె।
నంతటనొకనాఁటనటఁదిలోత్తమవచ్చివాఁడనిపూఁదండవల్లకియును।

మఱచె దేవి యతని మాటు ననుంచెవి । పంచికాదుల తేఁడు పడఁతి గోరి।
మన్మథోగ్రనిశితమార్గణములగుంది । వెఱపు విడిచి యామె వెంటనంటు॥ ౬౮.

సీ॥ బలిసద్మమున నొక్కపారికాంక్షివిలాసభద్రాఖ్య వెలయుఁ గృపామయుండు।
వసునేమి యతని క్రేవలనుండు సచ్ఛాత్రుఁడై యొక్కనాఁడు హేత్వంతరమున।
మలినుఁ జేసితి నన్ను మదనుదర్పము చేతఁ గాన భద్రావతి గలుగకుండు।
ననిశపింపఁగ భోగియడుగుల వ్రాలె వ్రాలదయాపరుండయి లలితఫణితి।
నుదయ మొర్వీపుఁదల చూడ నొడసి పోవు । శాపమని పల్కి విధిమాఱి సంయమీంద్రు।
వీడుకొని వసునేమియ వ్వేలఁదికతన । బెలుచ నుత్తముఁడై యుండు బీలువాసి॥ ౬౯.

మ॥ చరణాగ్రంబుల నిక్కి మాడు మదిగోచత్రూతి చెంతన్ మనో।
హారమన్ పేరసరోవరంబొకటి యుంహాశ్చాన్యమై యొప్పు భూ।
భరభద్రావతి యందు సాయమున నంభఃకేళి సల్పన్ మనో।
హరశుద్ధాంతనితంబినీమణుల కేలా వేఱయాహ్లాదముల్॥ ౭౦

ఉ॥ ఆవసునేమి క్రొవ్విరుల హారము లేర్చి యొసంగు చిచ్చు భ।
ద్రావతితోడ నాకొలఁకు దగ్గఱు నిచ్చలు నా నెలంతయున్।
బ్రావిరులొచ్చియచ్చటన పాఱఁగ వైచుటఁ జేసి యా స్థలిన్।
దావులె సంగితుమ్మెదలఁ దార్చుఁ దిరస్కరిణీమహత్త్వమై॥ ౭౧.

ఉ॥ నేఁడును వచ్చి యక్కరణి నీరదకల్పవిశుద్ధదేవతా।
రాడుపలావనద్ధరుచిరాజితయష్టి ఫణీంద్రకన్య నీ।
రాడి ధరించు కోమఱచి యాత్మగృహంబున కేగెనంతగో।
వాఁడు ధరించి దానిఁ జొఱవన్ బిలమార్గము దూఱుచుండఁగన్॥ ౭౨.

ఉ॥ శాశకు చేతఁ జిక్కినఱుకంబడు వేళ మహాత్ముఁడార్తివా।
రాశిపరిస్ఫురత్తరణి రాజసుతుండు కరాంగుళీయకం।
బాశ నొసంగి పోవిడిచె నా వసునేమియు నేను శాపమున్।
నీశరణార్తిఁ బోయెఁ గద నిల్వు మొకించుక సేపు వచ్చెదన్॥ ౭౩.

క॥ అని వీడ్కొని బిలమార్గం । బున బాతాళంబు చొఱాయి మును చెప్పినవి।
తొను బూవుదండలోనుగ । గొనివచ్చి యొసంగి వీడుకొని మగుడిచనెన్॥ ౭౪.

చ॥ ఉదయనుఁడప్వనాంతరమహాగ్రముఖంబుల నెల్లఁ జొచ్చి దు।
ర్మదకరిభల్లుకద్వీపివరాహములాదిగ బెట్టలంచి దా।
సదనము సేరి సర్వమును సాంతముగా వినిపించెఁ దల్లియున్।
ముదమును ఖేదమున్ బొరసి పుత్రుఁడు దెచ్చినవి గాఁజూచుచున్॥ ౭౫.

చ॥ మనుజులెంజడంబుగను మాఱుపుఁగట్టి విలాసభద్రుఁడున్।
మునిచరణాబ్జముల్ గొలిచి ముగ్ధలఁ జేర్చి రసాతలంబునన్।
దినములు వాపి భూమికరుదెంచెన సాహావిధి యీవిపంచినా।
జననము సైతమీలతల దంపములయ్యెఁ దలంప నేటికిన్॥ ౭౬.

వ॥ అని చెప్పి శోకసంకులరై శాపావసానంబున కెదురు చూచుచు నాయాశ్రమంబున దిన దిన ప్రవర్ధమానుండగు సూనుండు పల్కు నుపశమన వాక్యంబులచేతను బ్రాణంబు కంటెం బ్రాణంబుగాఁ జూచు మునీంద్రుని యుచితాదరంబునను సుఖంబుండ నదియట్లుండె నిందు. ౭౭.

శా॥ వ్యాళగ్రాహికళిందజాపరిసరోద్యానంబునం దొక్కనాఁ।
డ్వ్యాళంబొక్కటిఁ బట్టె నుక్కువపు గేయంబూఁది సంగీతరా।
గాలాపంబున నిద్రవోవ శిశువుల్ హాసింప వేగోపులున్।
లీలావిభ్రమమానసంబుల యిహాళింమేఁ దవర్జింపుచున్॥ ౭౮.

గీ॥ చిలువనాడించి బ్రదుకనంగళుల కేగి । తిరుప మెత్తుచుఁ గోశాంబిపురముననుఁ।
దొరువు తెరువున కేగు చు తురువు మాపి । ఫణిసటీతాంచపముననరిస్య యనలము॥ ౭౯.

ఉ॥ అంతట నొక్కకంసలి గృహంబున నాగము నాడ్వసంతసం।
బెంతయు గ్రందు వారఁ దనహారపుటుంగరమెత్తి చూపిరో।
యొంతయొ సంగు దీవని తని ప్పుగఁగంసలి దానిఁ గాంచి భూ।
కాంతుని పేరనున్నదని గన్గొని రాజభటాళికీయఁగన్॥ ౮౦.

గీ॥ ప్రోలితలవస్త్రచచ్చినపురవునీవు । చీమలును బోలె వానిని జేరి గొట్టి।
నెమ్మినిచ్చె నేనీదు పాండిత్యమునకు । జనపరుండని చెలు సాలను నిచిరస్త్రము॥ ౮౧.

ఉ॥ ఆమఱునాఁడు వాని వసుధాధిపుచెంతకుఁ దెచ్చి పేఁడుగో।
మీమహతాంగుళీయకము మిన్నక గొంగిలె నన్న రాజునో।
పాములవాఁడ నీకిది కృపామతి నిచ్చినవాఁ డెవండు గా।
కేమహనబ్బె నీకు లభియించిన చొప్పెఱిఁగింపు నావుడున్॥ ౮౨.

గీ॥ వాయిదడబడ లెంకలు వట్టి చఱువ । బెగడు గుడుచు చు మనోడలు కంపింపవాఁడు।
గల తెఱంగెల్ల నెఱిఁగింపఁ గాశ్యపీంద్రుఁ । డమితధనమిచ్చి పుత్తెంచుఁ డని యెనంత॥ ౮౩.

వ॥ జననాథుండు తనయభ్యంతర మందిరంబు సొచ్చి యొక్కవివిక్తస్థలంబున నాయంగుళీయకముం జూచుచు. ౮౪.

ఆ॥ ఉంగరంబ యెట్టులున్న దినీకూర్మి । చెలియ యేమి నీకుఁ జెప్పి పుచ్చె।
మున్ను మమ్ముఁ గూర్చి పుణ్యంబు వొందితి । విప్రుడు నూతకైతవిడు మఁబాప॥ ౮౫.

ఆ॥ నిన్నుఁ బంపినట్టి నెపముఁ జూడంగనా । కటికెమనసువ్రజకఠినమనుచుఁ।
దెల్పఁబూనినట్లుదివ్యరత్నంబనా । కెలుఁగవలసెనోరుదెఱచినుడువు॥ ౮౬.

గీ॥ నీవుతలపించు నాపేరు నిలిపియెడఁద । నిలువునీరుగఁబత్తులుఁగలఁగ నేడ్చు।
దానికన్నీళ్లు నెన్నాళ్లుదడిసితీవు । నీదురూపంబుమాఱెమన్నించిచెపుమ॥ ౮౭.

ఆ॥ తెగినగాలిపడగ తెఱఁగునవింద్రోవ । నేగియెచటనెట్టియెడలఁబడెనొ।
యొడలెఱుఁగకకటపడరానిపాటుల । వడెనొలేకసురలుపట్టుకొనిరొ॥ ౮౮.

క॥ ఏవనలక్ష్మియొయేజల । దేవతయోయేపురీసతీమణియోయే।
గ్రావరమాధన్యయొమా । ర్చావిలయగునీదుచెలికినమృతంబిడెనో॥ ౮౯.

క॥ అనిపలుపరుసులవందురు । జననాథుఁడువనటకోల్మంసంగఁగశశ్వ।
జ్జనిదుఃఖముచూపోపక । మునుకొనియశరీరవాణిమొగినిట్లనియెన్॥ ౯౦.

గీ॥ పొదుపుగుబ్బలిపొంతఁబ్రాకడలిచెంత । మగువజమదగ్నిజడదారిమనికివజలుఁ;
బదియునాల్గేండ్లుసెల్లెనీపట్టిధర్మ । పత్నిఁదోడ్తెమ్ముచెచ్చెఱఁబార్థివేంద్ర॥ ౯౧.

చ॥ అనుడుధరామహేంద్రుఁడురయంబుననద్దెసలోలిఁజూచిని।
స్వనమునకేటిహేతువనిసందియమూఁదఁగదివ్యవాణియి।
ట్లనియెఁగృపామనస్క్రియనటంచుఁదలంచికపోతపాళిఁబ।
ర్వనపురిగల్గునెమ్మిఁగని వెంగలిచూడ్కులతోడనిట్లనున్॥ ౯౨.

గీ॥ నెమ్మి! తహతహపడెదేలనిలువవొక్క । కెలనవేలుపుటెలనాగలాలయువేడ్క।
మేఘురంజనివీణెలమేళవింప । జతనమొనరించుచున్నారుచాగుచాగు॥ ౯౩.

మ॥ పొదుపుంగుబ్బలిపొంతఁబ్రాకడలివాఃపూరంబుడిండీరముల్।
పదవన్ద్రోపుడువెట్టఁదుంపురలుపైపైగ్రమ్మఁబాటీరపుం।
జదపుంగాడుపుఁగొయ్యనొయ్యనపయిన్జల్లాడఁబల్మాఱుఁబెం।
పదవోలాడెడుభాగ్యమెన్నఁడొయయోధ్యాపాలకాపత్యమా॥ ౯౪.

వ॥ అనుచు నాదినంబుగడిపి మఱునాఁడు శుభముహూర్తంబున దానును సంగతకుఁడను చెలికానితోడం హయంబులెక్కిపురంబు వెడలి యనేకకాననంబులుగడచి చనుచుండె రంత. ౯౫.

ఆ॥ రాజురాగలక్ష్మిప్రాచిమూర్తిభవిం । చెనొయసంగరక్తచిత్రభాను।
ఘృణులునింగిఁబొరలిగిలకొట్టుచుండెను । జరమపూర్వదిశలబొరసిబొరసి॥ ౯౬.

క॥ భూవరుసమ్మోహనవి । ద్యావల్లిహరింపదేవిఁదలఁచుచుఁగాల।
శ్రీవిద్యోపాసకుఁడిడు । పావనతిలకంబనంగభానుఁడుదోఁచెన్॥ ౯౭.

వ॥ అపుడిరువురు. ౯౮.

క॥ నలు దెసలినిట్టలపుటిరు । లలమునొకోయ నెడిభీలిహయముల బెలుపం।
బలువిడివిడి చిరిపమటి । మలవిడితటి సెరనితరగమాలికలొయ్యన్॥ ౯౯.

క॥ అలలని మొతుమలచిలువలఁ । జెలువయొక తెవాయి దెఱచి జీర్ణిం చెరవిన్।
జలమున్నను బలమున్నను । బొలుచు నె పెనుబల్లి చెంతఁబొడిచీమయిలన్॥ ౧౦౦.

చ॥ దెసలను గ్రమ్మఁజీకటులు ధేనులగొంతుకలందుఘంటికల్।
పసయతిమ్రోసెఁబుల్లుగమిపాఱెమహీజకులాయపాళికిన్।
బ్రసనశయందు కామినులరాయిడిబంచమబాణమెత్తెను।
ల్లసనములాడెభృంగమహిళాజనముల్ పికకీరసంతతిన్॥ ౧౦౧.

ఆ॥ అపరవార్ధిమునుగ నాలోకబాంధవుం । డపరిలేపములోకమాక్రమించు।
టుప దెయయ్యెరుపురహయములనప్పళిం । పుచుజవంబుమీఱఁబోయివైరాయి॥ ౧౦౨.

వ॥ ఒక శివాలయసమీపంబుసేరి యచ్చోట నొక పటకుటీరంబు నిర్మించుకొని. ౧౦౩.

చ॥ ఎలసిపథశ్రమంబపనయించుచుఁగొండొకసేపులోనను।
జ్జ్వలిడుచునిద్రవోయిరియొఱుంగంగొకోయుదయాచలాటవి।
స్థలములటంచుఁగానియెడఁదాల్చునెయిట్టివిరామమాప్రియా।
జలజముఖావలోకనవిచారమహీధవచిత్తమెంతయున్॥ ౧౦౪.

గీ॥ గడియలిర్వదికాఁగనాకాశ్యపీంద్రుఁ । డల్లనల్లనశయ్యావమతల్లి విడిచి।
పటకుటీరబహిర్భూమిభాగమంది । నింగివీక్షించినల్లడల్ నెఱయఁజూచి॥ ౧౦౫.

గీ॥ విష్ణునక్షత్రముచ్చంబువిడెఘనిష్టఁ । జేరెఁజంద్రుండుద్వ్యోమమధ్యసీమభములు।
మంచిముత్తెపురాసులమాడ్కి వెలయు । నచ్చటచ్చటదొదొలనాకసమున॥ ౧౦౬.

ఉ॥ వెన్నెలనల్దెసల్విరిసె వేకువయోయనికాకికోకిలల్।
కన్నులువిచ్చికూసియఱకంటఁబరుండెడిగుంటనక్కలు।
ద్ధిన్నరుఁడేఁప్పుచందమునఁజేరెలుఁగెత్తిసరీతభూమిఁగూ।
సెన్నలువంకలం దెలుగుచీరఁగ భేకగణంబుమ్రోసెడున్॥ ౧౦౭.

గీ॥ వింటిపూవోటరిక్కలవిరులువఱల । నడుమ నెలవెండియంత్రపుగడసుధాంబు।
కణములాశాప్రకంబులఁగలయఁజల్లు । నెవనిభోగైకశిలతాసృష్టియొక్కొ॥ ౧౦౮.

క॥ ఈయరుణమృత్స్యపేతం । బైయొప్పెడివాలుఁద్రోవయరొక్కదయుక్తి।
లేయుమునిడుబైయున్నది । భూయువతీశోణరత్నభూషణమనఁగన్॥ ౧౦౯.

వ॥ అని కొండొకసేపుచింతించి వాసఃకుటీరంబు సొత్తెంచి. ౧౧౦.

క॥ ఒడలెఱుఁగకనట్టడవిని । దొడిబడినిద్రించుప్రియవిదూషకుమొగముం।
బొడగని లెమ్మాభాస్కరు । కడఁదిమరీచులకుము న్నెగడవంగఁదగున్॥ ౧౧౧.

శ్రీ

# భామినీవిలాసము

ఇది

పండితరాజ బిరుదాంకితుఁడగు జగన్నాథకవిచే

విరచితమయిన సంస్కృతకావ్యము నుండి

రాజమహేంద్రవరము నందలి దొరతనము వారి

మొదటి తరగతి బోధనాభ్యసన కళాశాలయందుఁ

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడగు

వడ్లాది సుబ్బారాయుఁడు.

తెలిఁగించినది.

ఇందుఁ గరుణావిలాసమున నొక యనుబంధముకూడఁ జేరియున్నది.

మొదటికూర్పు 1000

సత్తిరాజు సీతారామయ్యగారిచే

దేశోపకారి ముద్రాక్షరశాలయందు ముద్రించబడినది

ఏలూరు.

1902



వెల రు0-10-0

# పీఠిక.

---

సంస్కృతకవులచరిత్రమును సరిగాఁ దెలియఁబఱుచుగ్రంథము లేవియు లేనియీ కాలమున భామినీవిలాసకృతికర్తయగు జగన్నాథపండితునికాలనిర్ణయాదుల నించుమించుగాఁ దెలిసికొని, యాయనజీవచారిత్రమునుగూర్చి యసంపూర్ణముగా నయిన విశ్వాసపాత్రమగు చరిత్రమును వ్రాయుట చదువరుల కొక్కింత సంతోషము గలుగఁజేయకపోదు. హిందూదేశమున బహువిషయములయందుఁ గల్పనాకథలెన్నియో యుత్పన్నములయి కాలక్రమమున దట్టముగా నల్లుకొని విజృంభించి, యొకానొకప్పు డెవ్వరేని నిజమయిన చారిత్రమును జెప్పినను దానియందు జనులకు నమ్మకము గుదురనీయనంత దృఢముగా వేళ్లుపాతియున్నవి. ఇటీవల కాలములో బ్రసిద్ధినొందినజగన్నాథపండితునిచరిత్రముగూడ నట్టియసంగతపుఁగట్టుకథలకు బుట్టి నిల్లయినందున యథార్థమురూపుమాసినది. అయినను తత్పండితవర్యునిచే వ్రాయఁబడినగ్రంథము లామూలాగ్రముగాఁ జదివిచూచితిమేని నిజమైన తచ్చారిత్రము గొంత సంపాదించుట దుర్లభము కాదు. జగన్నాథకవి గ్రంథరచనయందు విద్వద్బృందములో నెంతవన్నె కెక్కినను బాపమీయన విరచించినకబ్బములుమాత్ర మంతగాఁ బ్రఖ్యాతినొందినవి కావు. అవి చదివినవారు కొందఱుమాత్రమే కలరు.

ఈపండితుని గుఱించి యనేకు లనేకవిధములుగాఁ గట్టుకథలను లోకమంతట వ్యాపింపఁ జేసిరి. సత్యాసత్యము లెట్లున్నను వినుటకు మాత్ర మవి మిక్కిలి మనోహరములు కాఁబట్టి యీయన జీవితమును గూర్చి చర్చింపక పూర్వ మాకథలయం దనేకులు చెప్పుకొను వాని నిట నుదాహరించుచున్నాఁడ.

(౧) జగన్నాథపండితుఁడు మిక్కిలి ప్రఖ్యాతికెక్కినవాఁడయి తనకుఁ గర్ణాటరాజ్యాధిపతులవలనఁ దగినంతసన్మానము కాని కతమున, విత్తార్జనమున కుత్తరహిందూస్థానమునకు వెళ్లి జయపురపుసంస్థానమున ననేకపండితుల నోడించి యచ్చో శాస్త్రిపరిశ్రమముకొఱకొక్క క్రొత్తయేర్పాటు కావించెను. ఆకాలమందు ఢిల్లీసంస్థానమునుండి విస్తార శాస్త్రి పరిచయము గలఖాజీ యొకఁడు హిందూదేశ మంతటను సంచరించి తాను వెళ్లినప్రదేశములందెల్ల మతవిషయికవాదములు జరిపి విద్వాంసుల నోడించుచుఁ బ్రపంచమునందు మహమ్మదీయమతమే సర్వోత్తమమని స్థాపించుచుండెను. ఈమత వివా-

దములను గూర్చియుఁ దత్కారణమున ననేకులను హిందూపండితులు మత భ్రష్టులగు చుండుటను గూర్చియు, నిగుల నాలోచించి జగన్నాథపండితుని గట్టి పట్టుదలతోఁ దానొకసంవత్సరములోపలఁ బారసీభాష స్వనగ్గళముగా నేర్చుకొని మహమ్మదీయమతగ్రంథములను జదివి యామౌల్వీలతోఁ బ్రసంగము చేసి యుద్భటమగు తనప్రౌఢవాదముచేత నోడించి మహమ్మదీయులయుఁ బుట్టినవారి కెట్టిదైన నుండెఁగాక యితరమతములవారి నాకర్షించుటకుఁ దగినవిశేషమేమియు నీమతమందు లేదని చెప్పి యప్పటి తురుష్కచక్రవర్తిని మెప్పించెను. తన్మూలమున జగన్నాథపండితునియందు మహానుగ్రహము గలిగి చక్రవర్తి యీయనను దనయాస్థానవిద్వాంసునిఁగాఁ జేసికొనియె.

(౨) ఆకాలమున నక్బరుచక్రవర్తికి రాజపుత్రస్త్రీయందుఁ గలిగిన యధిక సౌందర్యవతియగు లవంగిక యను నొక కూఁతురు గలదు. ఆమె పరిపూర్ణతారుణ్యమనోహరాలయి తనకు సహజమన్మథవికారము లంకురింపనప్పుడొక్కనాఁడు, తన తండ్రియాస్థానమందు నిరంకుశపాండిత్యప్రకర్షము గల మనోజ్ఞరూపయౌవనసంపన్నుండగు జగన్నాథుఁడను మహాకవి యొక్కఁడున్నాఁడని యాలించి వాని దర్శనంబున నేత్రసాఫల్యంబు గావించుకొన వేచియుండెఁ గొండొకనాఁడు దైవయోగంబున దనకోరిక నెఱవేఱుడు నుప్పొంగి లవంగిక పెండ్లియాడిన జగన్నాథకవినే పెండ్లియాడవలెను. లేదా యవివాహితగా నుండవలెనని తనమనంబున నిశ్చయించుకొనెను. అట్టిచో నొక్క దినంబున నక్బరుచక్రవర్తియు జగన్నాథకవియుఁ జదరంగము నాడుచుండఁ జక్రవర్తి దప్పిగొన్నవాఁడయి పానీయము గొనితెమ్మని యానతియ న స్త్రీయుఁబోఁడి జలపూర్ణ మయిన బంగారుభృంగారువును శిరంబునందుంచుకొని మురిపంబునఁ దండ్రిచెంతకుఁ నేతెంచెను. అప్పుడా చక్రవర్తి తనకూఁతు పక్కఁసనమున నుప్పొంగి లవంగికను భృంగారుసహితముగా వర్ణింపు మనికోరిన జగన్నాథపండితుఁడు లోపల నీక్రింది శ్లోకమును జదివినాఁడు.

శ్లో॥ ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా
కుసుంభారుణం చారుచేలం వసానా
సమస్తస్యలోకస్య చేతఃప్రవృత్తిమ్
గృహీత్వా ఘటేన్యస్య యాతీవ భాతి ॥

పం॥ బలే! పెడంగుఁ జంద్రకాంతిసానిదం ధరించి యుఁ
దలం గళంతికన్ వహించి డాయునిబ్బరంబుగ
బ్బలాడి యీమె దోఁచుమానవప్రపంచచిత్తవృ
త్తులన్ హరించి దీననుంచి పోనఁ గాంచుఁబోవు నాకు ॥

అట్లు చదువఁగానే రసవంత మయిన యాయాశుకవనమునకు నానందపరవశుండయి చక్రవర్తి కవిం జూచి నీయిచ్ఛ వచ్చిన దద్ది యేనిఁ గోరు మిచ్చెద ననియె. జగన్నాథకవి యంతమీఁద నాశుగతిని మరల నీక్రింది శ్లోకములఁ జదివినాఁడు.

శ్లో॥ నయాచే గజాళిం నవా వాజిరాజిం
నవిత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు ॥

శ్లో॥ యవనీ నవనీతకోమలాంగీ । శయనీయే యది లభ్యతే కదాచిత్
అవనీతల మేవ సాధు మన్యే । నవనీ మాఘవనీ వినోదహేతుః ॥

భుజంగ॥ తురంగంబులం గోరఁ; దుంగేభసంఘం
దరం బొంద; యాచింప ద్రవ్యంబు; నేత
త్కురంగీదృశం, దోయకుంభోత్తమాంగన్
వరింతున్ లవంగిన్ నవప్రాయభంగిన్ ॥

కం॥ నవనీతమృదులతను వీ । యవనీమణి యున్న శయనమం దలనాఁ
డవనీతలమే మేల్ ; మా । ఘవని వని వినోదహేతుకం బని తలఁపన్ ॥

అని పలుకఁగాఁ దాను స్వప్నమందయినఁ దలంచుకొనియిట్టివిపరీతపుఁ గోరిక కాచక్రవర్తి యత్యద్భుతవిషాదగోచరుండయి తనవాగ్దానము దప్పలేక యప్పండితునితో నీవు మాతోఁ బొత్తున భుజించితివేని గన్యనిత్తునని యుత్తరం బిచ్చెను. జగన్నాథకవి లవంగికయందలి మోహంపుఁబారవశ్యంబున జాతిబహిష్కారణమున కయిన వెనుకఁ దీయక చక్రవర్తితో సహపంక్తిని విందారగించెను.

(3) ఈపండితుఁడు డిల్లీచక్రవర్తియాస్థానమున నున్నకాలములో వేఱొకమహారాజు తనసభయందు పండితుఁడుగా నుండుమని యీయన కొకజాబు వ్రాయఁగాఁ గవి దానికిఁ బ్రత్యుత్తరముగా నీక్రింది శ్లోకము లిఖియించి పంపెను.

శ్లో॥ ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయవా స్యాల్లవణాయవా స్యాత్ ॥

క॥ కోరికలను బూరించెడు । వారొక ఢిల్లీశ్వరుండుఁ బరమేశ్వరుఁడే
భూరమణు లితరు లిడునది । కూరాకునకౌనొ యుప్పు కొసరఁగానో ॥

(౪) జగన్నాథపండితుఁ డొకనాఁడు తారాదేవి నారాధింపఁగా నాదేవి ప్రత్యక్షంబయి యీక్రింది శ్లోకముచే నాయనను నాశీర్వదించినది.

శ్లో॥ ఆసురుదేశం విజయేః మానురు పరవాదినిర్జయే శంకామ్
స్వీకురు వరమేకం మే వ్యాకురుష్వోపవత్స ! శాస్త్రాణి ॥

కం॥ ఆసురుదేశము దిరుగుము; । తేఁకున పరవాదినిర్జితిం బొరయకు; నా
యేకవరంబును జేకొను; । వ్యాకృతి గావింపు శాస్త్రగణితికి వత్సా ॥

(౫) ఆధునిక ప్రసిద్ధవైయాకరణుఁడైన నాగేశభట్టునకు నుపాధ్యాయుఁడగు హరదీక్షితుఁడు చక్రవర్తి కప నేసేని బహుమానము పడయఁ గోరి యొకప్పుడు డిల్లీ పట్టణమునకుఁ బోయి పాదుషాను సందర్శింపక మున్న పండితరాజును గలసికొని వ్యాకరణశాస్త్రమున నీతోఁ బ్రభుసన్నిధిని బ్రసంగింపఁ గోరుచున్నాన నెను. అందుకు జగన్నాథకవి యంగీకరించి శేషదర్బారునకు విచ్చేయుమని చెప్పెను గాని వ్యాకరణశాస్త్రమందు హరదీక్షితుఁడు తనకంటె నధికుఁడని తెలిసినవాఁడు గాన మఱునటిదినమునఁ దానొక మంత్రపుఁగడియమును ధరించి సభకుఁబోయి యాశ్రోత్రి పండితుఁడు రాఁగానే యాయనను బ్రేమగలవానివలె గాఢముగాఁ గౌఁగలించుకొనెను. అందువలన వెంటనే యతనికొకవిధమయిన బుద్ధిమాంద్యముసంభవించి ప్రసంగారంభముననే హరదీక్షితుఁడు పరిహాసాస్పదములయిన ప్రశ్నోత్తరములకు దిగినవాఁడయి తుదకు నలువురలో నవమానపడి యింటికిఁ బోయెను. ఆయన యంతటి పరాభవము రావలసినవాఁడు కాఁడు గావున నాతేయెల్లఁ గన్నువారయక విచారించి ప్రతివాదిజయమునకుఁ దగినసాధనము తనకు సమకూడనియెడల నాఁటి రాత్రి ప్రాణత్యాగముఁ జేయువాఁడుగాఁ బ్రతిజ్ఞచేసికొని భక్తిపూర్వకముగా నిష్టదేవత నారాధింపఁగా నాదేవత యాతనిం దత్కాలకము దెలిపియూహించి ప్రతిక్రియను బ్రసాదించెను. మఱునాఁడు మరల నుభయపండితులు సభకుఁ విచ్చేసినప్పుడు మాయోపాయము పనిచేయనందున హరిదీక్షితునకే గెలుపుగలిగెను. అయినను దొలునాఁడు గెలిచినాఁడు గావునఁ బండితరాజు హరదీక్షితునిచేఁ బరాజితుఁడు గాఁడని సభ్యులెల్లనుద్ఘోషించిరి.

(౬) పండితరాజు తనపరువపుఁ బ్రాయమంతయు హాయిగా డిల్లీశ్వరుని సంస్థానమందు యవనవనితతో వెళ్ళఁబుచ్చి తుట్టతుదకుఁ దనచరిత్రనుగూర్చి పశ్చాత్తప్తుఁడయి తనయాయుశ్శేషము నక్కడఁ గడపవలయునని వారణాసికింబోయెను. అప్పుడు శ్రోత్రియశ్రేష్ఠుండగు నప్పయదీక్షితుఁడు తత్పుణ్యక్షేత్రమునకు యాత్రవచ్చి యొక్కనాఁటిమధ్యాహ్నమందు జగన్నాథకవిని జూడఁబోఁగా నతఁ డాకాలమున యవన

యువతితో నేకశయ్యనుబన్వళించు కానఁబడియె. అప్పయదీక్షితుఁడందునకతివిస్మితుఁడయి తానాతని నెఱుఁగ నట్లుగా నభినయించుచు నీక్రిందియర్థశ్లోకమును జదివెను.

శ్లో॥ కిం నిశ్శంకం శేషే. శేషే వయసః సమాగమతో మృత్యుః॥

తే॥గీ॥ ముగిసెఁ బ్రాయము మృత్యువు మెగిసె నకట!
 పూట లేకెప్పుడా నిద్ర యోరిజీవ! ॥

అదివిని పండితరాజు శయ్యదిగి యప్పయ్యదీక్షితున కెదురువోయి తోడితెచ్చుచు శ్లోకార్థమునీక్రింది విధమునఁ బూరించెను.

శ్లో॥ అథవా సుఖం శయీథా నికటేజాగర్తి జాహ్నవీ జననీ॥

తే॥గీ॥ అయినఁ గొదవేమి నిదురింపు మాద మఱచి
 కడనె యున్నది తల్లి గంగాభవాని॥

(౭) కాశీపట్టణములోని విద్వాంసు లందఱును జగన్నాథుని వ్యాసక్రమములను మన్నించి యాయనను కులములోఁ గలుపుకొనుటకు నిష్టపడిరి గాని తనకుఁ బ్రాణపదమయిన లవంగిని దొలఁగుట కంగీకారము లేనందునఁ బండితులు చెప్పిన పద్ధతుల యందెద్దానికిని బండితరాజు సమ్మతించినాఁడు కాఁడు. యవనీసంపర్కము గలిగి యుండఁగా నీతనిఁ బునీతునిఁజేయుట యనుకూలపడనందునఁ బండితరాజు చెప్పినపద్ధతులలో నెద్దానికిని బండితులును సమ్మతించినవారు కారు. అనంతర మొకనాఁడు జగన్నాథపండితుఁడు లవంగియుం దానుఁ గొండొక గంగాఘట్టమునందుఁ బయి మెట్టునఁ గూరుచుండి యా పవిత్రవాహినిని ధ్యానించి శ్లోకరూపముగా స్తోత్రము చేసెను. ఆఘట్టమున నేఁబది రెండు మెట్లు కట్టఁబడి యున్నవి. ఆశుధారను బండితరాజు చదివిన ప్రతి శ్లోకమునకును గంగాదేవి యుప్పొంగుచు శ్లోకమున కొక్కసోపానముగా నేఁబదిరెండు శ్లోకములకేఁబదిరెండు సోపానములును దాఁటి వచ్చి వారల నిరువురను దాఁకి పునీతులను గావించెను. వారిరువురు గంగలో మునింగి యదృశ్యులయిరనియుఁ జెప్పుట గలదు. పండితరాజు రచియించిన యాయేఁబదిరెండుశ్లోకముల స్తోత్రము ఆగంగాలహరి యను పేరితో హిందూదేశమందంతట సాధారణముగాఁ బాఠముచేయఁబడుచున్నది.

జగన్నాథపండితునిఁగూర్చి పూర్వోక్తప్రకారమున ననేక కథలు లోకమంతట వ్యాపించియున్నవి. అయినను వాని నున్నవిధమున నమ్ముటకుఁ గొన్నిచోట్ల నవకాశము లేదు; కావున నం దెంతవఱకు సత్యమున్నదో విచారింతము. ముందుముందు వెల్లడి కాఁగల యీయనతండ్రిగారి పేరినిబట్టియు, నాడీభేదమును బట్టియు మఱికొన్ని యితరాంశములనుబట్టియుం జూడఁగా నీపండితుఁడు మనగోదావరిమండలమువాఁడనియుఁ జిరకా

ముత్తరహిందూస్థానమున వసించినాఁడనియు రూఢమగుచున్నది. పారసీ భాషయందీ యనకు విశేషప్రవేశము గలదన్నమాట నమ్మవచ్చును. సగము సంస్కృతముతోను సగము పారసితోను నీయనరచియించిన శ్లోకము లనేకము లున్నవనియు విశేషించి పారసి భాషయందలి యొకానొక జ్యోతిశ్శాస్త్రగ్రంథమును సంస్కృతములోని కీయన మార్చినాఁడనియుఁ జెప్పుచున్నారు. ఈ భామినీవిలాసము కడపట, నీయనపూర్వవయస్సంతయు ఢిల్లీచక్రవర్తియాస్థానమునఁ గడపినట్లు తెలియ వచ్చుచున్నది గాన, సంస్కృత భాషాపోషకు లని ప్రసిద్ధిగాంచిన పాదుషాలలో నెవరో యీయనయందు విశేషాభిమానము వహించియుండవచ్చును.

రెండవప్రవాద మక్బరుచక్రవర్తితో సంబంధము కలిగి యున్నది. ఆచక్రవర్తిని గూర్చి యేస్వల్పాంశమును గూడ విడువకుండ వ్రాసిన "ఐనెయక్బరీ" యనుచరిత్రములో నీపండితుని ప్రశంసగాని లవంగికసంగతిగాని గానరాదు. మహమ్మదీయుఁడయిన యక్బరుచక్రవర్తి తనకొమార్తె నొకవైదికబ్రాహ్మణునకిచ్చి పెండ్లి చేసినమాటయే నిజమైనపక్షమునకుఁ దచ్చరిత్రములో గ్రుచ్చవలసినయంశములయందింతకు మించిన విలువగలవి చరిత్రకారునకు వేఱొక్కఁ డుండఁడని నిశ్చయముగా నక్కాణింపవచ్చును. మఱియు మితిమీఱిన రాణివాసముగల మొగలాయిచక్రవర్తి కూతురు జల కలశమును దలమీఁదఁ బెట్టుకొని కొలువుకూటములోనికి వచ్చినదని చెప్పుమాటయందు వివేకముగలవారి కెవ్వరికి విశ్వాసము పుట్టును? మహమ్మదీయ ప్రభువులలో హిందువులకు మిగుల ననుకూలుఁడయినవాఁడును వారిచే నెచ్చుగ మెచ్చఁబడినవాఁడును నక్బరు చక్రవర్తి గావునఁ దమకుఁ బరిచితమయినపేరు, పండితరాజు నాదరించిన చక్రవర్తికి మనవారారోపించి యుందురు. ఇంతియ కాని యీపండితునకును నక్బరు చక్రవర్తికిని లేశమును సంబంధము లేదు. యీకథలో నతికి యున్న శ్లోకములు పండితరాజు రచియించిన యే గ్రంథమునందును గానరావని తత్కృతిమీమాంసయందు ననుచుట నొకానొక రనుమానించుచున్నారు; కాని వారి కట్టియనుమానము పుట్టవలసినపని లేదు. చాటుధారా శ్లోకములు లోకమందే పాఱికెక్కియుండును గాని గ్రంథములయం దెప్పుడు నిమిడియుండవు.

విమర్శించి చూడఁగా నీకథ యంతయుఁ గేవల కల్పితమని చెప్పుటకంటెఁ గాసంత లేనిదే గంపంత కాదనులోకోక్తిని బట్టి జగన్నాథ పండితునకు యవనీసహవాసమున్నదనియే తలంచుట మంచిది గాఁ దోఁచుచున్నది. ఈ భామినీవిలాసమందలి కరుణావిలాసము సర్వము నీకవికిఁ దటస్థించిన జాయావియోగదుఃఖమునే ప్రకటించుచున్నది గదా! మహమ్మదీయ చక్రవర్తిగారి దివాణము నాశ్రయించి యున్న యీ

మూఁడవకథ జగన్నాథ పండితుని ప్రభుభక్తిని సూచించుచున్నది. కనుక న ద్దానిని విశ్వసించుటకుఁ బ్రమాణాంతర మనావశ్యకము.

నాలుగయిదు కథలు హేతువాదమున కందక కేవల విశ్వాసముమీఁద వ్రేలాడుచున్నవి. దేవతాసాక్షాత్కారాదులయందు నమ్మకము గలవారే కాని లేనివారు వానినంతగాఁ బాటి సేయరు. ఈ రెంటిలోఁ గడపటి దానియందు నాగేశభట్టునొక నామము వినఁబడుచున్నది. నాగేశభట్టునతఁడు జగన్నాథపండితవిరచిత మయినరస గంగాధర మనునలంకారశాస్త్రమునకు గురుమర్మప్రకాశ మను వ్యాఖ్యానము చేసి యున్నాఁడు. ఆవ్యాఖ్యానము పేరిఁబట్టి యాలోచింపఁగా నాగేశభట్టునతఁడు హరదీక్షితునకుఁ గాక జగన్నాథపండితునకే శిష్యుఁడేమోయని తోఁచుచున్నదిగాని తద్వ్యాఖ్యానముఖశ్లోకమున "నత్వాగంగాధరం మర్మప్రకాశం తనుతే గురు," మ్మనియున్నందున నందులకు మరల సందేహము గలుగుచున్నది హరదీక్షితాదుల కాలనిర్ణయమును గురించి ముంబాపుర ప్రకటిత సంస్కృత భామినీ విలాసమునందలి యాంగ్లభాషాలిఖిత పీఠికయందు నధికముగా విస్తరింపఁబడి యున్నది. వలయువా రందుఁ జూచుకొనునది.

ఆఱవకథవిషయమున—

శా. జల్పించెం గడవెళ్ళ శాస్త్రములు; నిష్ఠల్ సల్పె నిత్యక్రియల్ ;
ఢిల్లీవల్లభుపాణిపల్లవమునన్ లేఁబ్రాయముం దెన్; గడున్
డుల్లన్ వాసన లిబ్బ్యోడన్ మధురయందుం గొల్చు గోవిందు; హా
యుల్లోకంబుగఁ జేసెఁ బండితసమాజోత్తంసుఁ డన్నింటినిన్ ॥

అను భామినీచతుర్థవిలాసపద్యమునందుఁ బండితరాజు తనయంత్యదినములను మధురయందుఁ గడపినట్లు కనఁబడుచున్నను వారణాసియందు వసియించినాఁడని చెప్పుటకుఁగూడఁ గారణమున్నది. క్రీ. శ. 1637సం॥ ప్రాంతమున సుప్రసిద్ధుఁడైయున్నట్లు ఎంచఁబడిన ద్రవిడపండితుఁ డప్పయ్యదీక్షితుఁడు పండితరాజున కన్యాలమునఁ బ్రతిపక్షిగ నున్నవాఁడు "నేవం రూపకం, రూపకేచ బింబప్రతిబింబభావో నాస్తీతి కేనాప్యాలంకారికంమన్యేనప్రతారితస్య దీక్షితస్యోక్తి రశ్రద్ధేయైవ,,. అని రసగంగాధరరూపక ప్రకరణము. దీర్ఘశ్రవోలంబకర్ణస్య ద్రావిడ స్యాప్పదీక్షితస్య అని పయినావాక్యములోనిమాటకు నాగేశభట్టువ్యాఖ్యానము. పండితరాజున కప్పయ్యదీక్షితుఁడు ప్ర

తిపక్షీయనుటకుఁ బూర్వోక్తసంస్కృత వాక్యమే సాక్షి. ఇట్టిస్థితిలో నీపండితు లిరువురును గథలోఁ జెప్పఁబడిన చొప్పున నెప్పుడయినఁ గలసికొనిరాయను విషయమే పరమసందిగ్ధము. ఇంక శ్లో॥ కింనిశ్శంకం శేషే (ముగిసెఁబ్రియము ఇత్యాదిదానితెలుఁగు) అను నార్యను వారిద్దఱును గలిసి చెఱిసగము రచియించిరను విషయము చెప్పవలసినదే మీఁ ఇంతియగాక యీశ్లోకము రసగంగాధరమున నాక్షేపప్రకరణమునందును గానవచ్చుచున్నది. దీనంజేసి తదార్యయం దప్పయ్యదీక్షితునకు భాగమీయ బొత్తిగ నేవలను పడదు. ఏమనఁగా జగన్నాథపండితుఁడు తనరసగంగాధరమునందు.

శ్లో॥ నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యంమయాత్ర నిహితం నపరస్య కించిత్ ;
అఘ్రాయతే సుమనసాం మనసాపి గంధః
కస్తూరికాజననశక్తిమతా మృగేణ ॥

దీనికిఁ దెలుఁగు.

చ॥ కొననిటఁ గొంచె మేనియు నొకొండు రచించిన దాని; నే నె నూ
తనముగఁ జేసి యుంచితి నుదాహరణాను గుణంబుఁ గావ్యముల్ ;
మనమున నైన మూరుకొను నా సుమనస్సులతావిఁ గస్తురిం
జననము నొందఁ జేయఁగను జాలుమృగంబు జగంబులోపలన్ ॥

అని గొప్పప్రతిజ్ఞ చేసికొన్నాఁడు. కంఠోక్తిగాఁ దెలియవచ్చుచున్నయీప్రతినకు విరుద్ధముగాఁ బుక్కిటిపురాణమును విశ్వసించుట వివేకపక్షము గాదు.

కడపటికథయందుఁ బర్యవసానము రెండంశములుగాఁ దేలుచున్నది. మొదటిది జగన్నాథపండితుఁడు జాతిబహిష్కృతుఁడయ్యె ననుట. రెండవది గంగాస్తవము గావించి యావెంటనే లవంగికతోడ నాతఁడు గంగలో మునింగి యదృశ్యుఁ డయ్యె ననుట. ప్రథమాంశమును గుఱించి కొందఱయభిప్రాయ మేమనఁగా గంగాలహరియందలి కొన్నిశ్లోకములు ముఖ్యముగా ౬, ౨౭, ౩౦, ౩౬, ౩౪, ౩౯, ౪౬, ౪౭ సంఖ్యలు గలవి, తత్కథను మెఱుఁగుపెట్టునట్లు కనఁబడుచున్నవిగాని యవియొక ప్రమాణముకానేరవు. అంతేకన్నను దీనముగా ననేకకవులు స్తవములను జేసియున్నారు. అనునదిగా నున్నది. అయినను.

చ॥ భవ మనుపాడునూతఁబడి బాముల నొందెడు నన్ను నీగతిం

దవుసె యుపేక్షసేయఁ గరుణావరుణాలయ ! శౌరి ! తొల్లినీ
పవన మొనర్ప నెట్టు లకటా ! ప్రకటాఘును బింగళాఖ్యవా
రవనిత, దుష్టవర్తనుని భ్రష్టు నజామిళభూసురుబ్రివుక్ ॥

భామి. శాంత. ౧౬.

అను నర్థముగల మూలశ్లోకమును జదువునప్పుడు తత్కవి తిన్నను దనలవంగికి నుబాంవులం జేయు మని భగవంతుని గూర్చి మొఱ్ఱవెట్టుకొనినట్లు లెవరు తలంపకుందురు? ఇట్టిసార్థనము వేఱొకరిది మనము వినము. ద్వితీయాంశము కేవలము విశ్వాసానర్హముగానున్నది. కొందఱు చెప్పెదులాగునఁ బండితరాజు నిజముగా గంగాలహరి రచియించిన తోడనే గంగాప్రవేశ మయిన పక్షమునఁ దదనంతర మాయన వేఱొకగ్రంథము విరచించుట కవకాశము గలుగదు గదా! ఈక్రింది యాంశమును బట్టి విచారింపఁగా గంగాలహరికిఁ దరువాత నాయన తనకృతుల నన్నిట నుత్కృష్టతమ మనఁదగిన రసగంగాధర మను నలంకారశాస్త్రమును విరచించి నట్లు కనుపట్టుచున్నది. అగ్రంథమునం దన్వయప్రకరణమున.

" ఉదాహరణ మమృతలహర్యాఖ్యే మదీయే గంగాస్తవే—

శ్లో॥కృతక్షుద్రాఘౌఘా నథ సపది సంతప్తమనసః
సముద్ధర్తుం సంతి త్రిభువనతలే తీర్థనివహాః
అపిప్రాయశ్చిత్త ప్రసరణపథాతీతచరితాన్
నరా నూరీకర్తుం. త్వమివ జనని త్వం విజయసే॥

పైసంస్కృతమునకుఁ దెలుఁగు

మదీయ మగునమృతలహర్యాఖ్య గంగాస్తవమునం దుదాహరణ మని

చ॥ పొనరిచి ఘోరపాతక సమూహము లుమ్మలికించు వారలన్
మనుపఁగ నున్న వెన్నొ భువనత్రితయంబునఁ దీర్థసార్థముల్;
జననిరో! నీవ నీవెసుమి సాటివి నిష్కృతిమార్గదూరవ
ర్తనములు గల్గుమర్త్యసముదాయము నైనను నుద్ధరింపఁగన్॥

అనునర్థమిచ్చుపయిశ్లోకమును జేర్చియున్నాఁడు. గంగాస్తవముగాంగుఁ గడపటిదయిన

శ్లో॥ఇమాం పీయూషలహరీం జగన్నాథేన నిర్మితాం

యాః పకే ప్రస్యాస్వస్య జాయంతే సుధాసంపదః॥

అనుశ్లోకమునందుఁ జెప్పఁబడినచొప్పునఁ దద్గ్రంథము పీయూషలహరియనవలసియుండఁగా నీయన్వయప్రకరణమున (అమృతలహర్యాఖ్యే) యని యుండుట లేఖకాదిప్రమాదముగాఁ దలంప నగునని. పండితరాజు రచియించినది యమృతలహరియని వేఱొకటి యున్నది. అదియమునాస్తవముగాని గంగాస్తవముగాదు. ఉదాహృతశ్లోకము గంగాస్తవమునందుఁ గానఁబడుచున్నది. పీయూషలహరిలోని ప్రథమశ్లోకమునందును గంగ యుపాస్యంగుచు వచ్చెనను మాట తల్లజాతమాధుర్యశాలియ వ్యాలికమగు నట్టుక్తినిగాఁ విచక్షణులు భావించుకొందురుగాక.

కథలవిషయ మిట్లు ముగిసినది గనుక నిటుమీఁదటఁ గాలనిర్ణయము చేయవలసియున్నది. అందును గుఱించి నిర్వివాదముగా నిశ్చితాభిప్రాయము నిచ్చునవి జగన్నాథపండితుఁడు రచియించిన గద్యపద్యములే ముఖ్యములగును. కొన్నిట్టి వానిని క్రిందవ్రాయుచున్నాను.

౧ శ్లో॥ సుగంధాశ్చ మారామాదిహాయేషు శిశిరఝంఝానిలహతాః
వసంతేయః కాశ్చిత్ యాతి తదపిలోకే కంపతి జనః
కిమేభిర్గ్యాకార్యం శివశివ వివేకోనవికలైః
శ్చాండీవన్నాస్తా మధుమధని దిల్లీనరపతేః॥
రసగంగాధరము. ఆక్షేపప్రకరణము.

౨ శ్లో॥ సృష్టస్సృష్టిక్రమాత్ ప్రురాల పవిత్రాతుం జగన్మండలం
త్వం చింతాప నిర్దయం దహసి యజ్జ్వాలాభిరారాద్రిపూన్
సంరంభారుణలోచనో రణభువి ప్రస్థాతుకామోయదా
జానీమో భవతా నహాంత విదితో దిల్లీధరావల్లభ॥ ర.గం. ప్రతీప ప్రకరణము.

౩ శ్లో॥ మాహాత్మ్యస్య పరోవధిర్నిజగృహం గంభీరతాయాః పితా
రత్నానా మహమేక ఏవ భువనే కోవాపరో మాదృశః
ఇత్యేవం పరిచింత్య మాస్మ సహసా గర్వాంధకారం గమో
దుగ్ధాబ్ధే భవతా సమో విజయతే దిల్లీధరావల్లభః॥ ర.గం. ప్రతీపప్రకరణము

౪ శ్లో॥ అనుకూలభావ మధవా పరాఙ్ముఖత్వం సమాశ్రయన్నరలోకే
అన్యోన్యావిహితమంత్రా విదధతి దిల్లీవల్లభా విహారాంతః॥ ర.గం. పహారోక్తి ప్రకరణము

ర్తిల్లుమ సుముఖత విముఖత । యిల్లోపలఁ గొడ నహింతు రిద్దఱఁ గూడన్

౫ గ॥ మూర్తిమంతంబగు నవాభాసపు భావమునఁ బ్రసాదంబు నాఁ జనువాఁడు, ద్విజనులసేవాహేవాకి వాఙ్మోహకారాయుండు, మాధురకులసముద్భవుండు, రాయముకుందుం డానతీయ, సార్వభౌమశ్రీశహాజహాంప్రసాదాధిగతపండితరాజపదవీవిరాజితుండు త్రైలింగకులావతంసుండగు పండితజగన్నాథునచే నాసఫవిలాసాఖ్యాయిక నిర్మింపంబడియెను.

౬ ఉ॥ జన్నది మేల నల్లనడెఁ జాలఁ? వషీయుతి; నేడఁ గల్గెఁ? జెం
తన్నులకన్నతోయమునఁ; దజ్జలమందె టెుకజ్జలాప్తిఁ దు
ష్యన్నుతనూరసేనరసాలరిపుక్షితిపాంగనాళివా
ల్గన్నులఁ గాఱునీరు పెనుగాలువలై ప్రవహించి కూడుటన్॥

౭ శా॥ ఖ్యాతోత్ప్రేక్ష! శహా జహీన! గుణసంఘాతంబునన్ బోల ని
న్నే నమ్మాశరథప్రపంచమున లేఁ డెంచందు వాక్ప్రౌఢనే
లాఁ దా నూతనకారణంబుల ననంతౌత్పత్తి భావించినన్
ధాత్రిం దప్పఁడు సైతమందఁడు సుమీ త్వత్తుల్యుఁ డెవ్వం డెటన్॥

«నూరుద్దీన్ మహమ్మదు జహాంగీర్», «శహాబుద్దీన్ మహమ్మదు షా జహాన్», అనునవి వరుసగా జహాంగీరునకును షాజహానునకును బూర్ణనామములు. ప్రస్తుతము దావారింపుటకు దొరకలేదుగాని పండితరాజు షాజహానునకుం బెద్దకుమారుఁడగు దారాశికోవును బొగడుచు జగదాభరణమను చిన్నకావ్యమొకటి రచియించియున్నాఁడు. ఈగ్రంథమును గూడఁ గలిపిచూచి పూర్వోదాహృతసంస్కృతగద్యపద్యములలోనియంశములు పాలోచించినపక్షమునఁ బండితరాజు జంహాంగీరుషాజహానుదారా లనుముత్తరముల వారిపొత్తుగలిగి వారిమెప్పులకుఁ బాత్రుఁడయినట్టు కనుపట్టునుగదా!

షాజహాను తనతండ్రి చనిపోయినతరువాత ననఁగాఁ గ్రీ-శ- ౧౬౨౮ సం॥ సింహాసనమునకు వచ్చినవాఁడగుటచే, జహాంగీరును గూడ మెచ్చియున్నట్లు కనఁబడు నీ పండితుఁ డంతకు మును పేఁడెనిమిదియేండ్లక్రిందట నయిన నక్కొలువుఁ జేరియున్నట్లు మనము దలంపవలెను. తదాస్థానమునఁ బండితుఁడుగాఁ జేరునప్పటికిఁ బండితరాజునకుఁ గనీసము ౩౦ ది యేండ్లప్రాయమయిన నుండకపోదుగాన షాజహాను సింహాసనమునకు వచ్చునప్పటికే యీకవికించుమించుగ ౪౦ ది సంవత్సరములు వయస్సుండవచ్చును. షాజ

హాను రాజ్యము చేసినది ౩౦ ది సంవత్సరములు. ఆకాలమంతయు నీయన తదాస్థానమం దుండి, యౌరంగజేబు (షాజహానుని తృతీయపుత్రుఁడు) తనతండ్రిని చెఱపెట్టిన కాలముననో యన్నయగుదారాను సంహరించిన కాలముననో తన్నాదరించుమంచిప్రభువు లేక పోవుటచేత వార్ధకమున మథురయందు గోవింద సన్నిధానమున దినములు వెళ్ళఁబుచ్చి యుండును. రసగంగాధరము చేసిన కాలము షాజహానుని ప్రభుత్వమధ్యమునందలిదే కావచ్చును. గావునఁ దద్గ్రంథముకంటెఁ బూర్వపుదియగు గంగాలహరి రచియించునప్పటికిఁ బండితరాజు ముసలి యయి యుండఁడుగాని "ముగిసెఁ బ్రాయము మృత్యువు మొగిసె" నిత్యార్థమిచ్చు శ్లోకమునుబట్టి చూడఁగాఁ "గాశ్యాంతు మరణాన్ముక్తిః" యను వచనము ననుసరించి యవసానమునకు నతఁడు వారణాసిఁ బ్రవేశించి యుండునేమో యనియుఁ దోఁచుచున్నది. పండితరాజు జహంగీరునికడపటి కాలమునఁ దదాస్థానమునఁ జేరియుండుననుకొన్నను దత్పుత్రుఁడగు షాజహాను రాజ్యాంతమునప్పటి కాయన కనిమిద వపది సమీపించి యుండవలసివచ్చును. ఇట్టిస్థితిలో షాజహాను పితామహుఁడగు నక్బరు చక్రవర్తికడ నీయన పండితుఁడుగా నుండెననుమాట యెట్లుపొసఁగును? భామి.శాం. ౪౪ శ్లోకమునందు "దిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" యని తన యౌవనప్రాయమును దిల్లీశ్వరుని కిచ్చినట్లు కంఠోక్తిని జెప్పుచున్నాఁడు. ఈదిల్లీశ్వరుఁడక్బరుచక్రవర్తియేయైన యతనిపాణియందే పరిపూర్ణసకలశాస్త్రపాండిత్యాతిశయ సంపాదనాంతర స్వీయనవీనప్రాయం బీయనచేత నీతమయిన పక్షమునందు నక్బరుమీఁదఁ బండితరాజు చెప్పిన శ్లోక మొక్కటియేని లేక పోవుటయు షాజహాను మీఁదఁ జెప్పిన వనేకము లుండుటయుఁ గైగా నీకడపటిచక్రవర్తిచేతనే యతనికిఁ బండితరాజబిరుద మీయఁబడుటయు నెట్లు సంభవించును? పూర్వోక్తప్రకారమున ముత్తరములచక్రవర్తి సంఖ్యలమీఁదనే కాక షాజహానున కేలాగుననో సంబంధముగలసినవాఁడగు నాసఫఖానుమీఁదఁగూడ నొకయాఖ్యాయిక పండితరాజు రచియించినట్లు చదివియుంటిమిగదా! అక్బరుకాలమున నీపండితుఁడున్నయెడల నాయన వర్ణన మీయన చేయకుండుట సర్వథా యసంభవము. కాఁబట్టి రసగంగాధరమునందుండి పైనుదాహరించిన ౧,౨ ౩,౪, శ్లోకములలోఁ జెప్పఁబడిన దిల్లీవల్లభుఁడు నిశ్చయముగా షాజహానే కాని వేఱొకరు కారు. తత్కారణమునఁ బండిత జగన్నాథునిమహోచ్ఛదశ క్రీ.శ ౧౬౨౦ మొదలుకొని ౧౬౬౦ సం॥ వఱకు నైయుండవచ్చును.

జగన్నాథపండితుని తండ్రిగారిపేరు పేరుభట్టనియుఁ దల్లిపేరు లక్ష్మియనియు నీయన తెలుఁగునాఁటివాఁడనియు సకలశాస్త్రపారంగతుఁడగు జనకుని యొద్దనే విద్దెల న్నియు నభ్యసించెననియు నీ క్రిందిశ్లోకముల వలనఁ దెలియవచ్చెడును.

౧ శ్లో॥ త్రైలింగాన్వయమంగళాలయమహాలక్ష్మీదయాలాలితః
శ్రీమత్పేరమభట్టసూనురనిశం విద్వల్లలాటంతపః
సంతుష్టః కమఠాధిపస్య కవితామాకర్ణ్య తద్వర్ణనం
శ్రీమత్పండితరాజపండితజగన్నాథో వ్యధాసీదిదమ్ ॥ ప్రాణాభరణము ౫౨

౨ శ్లో॥ పాషాణాదపి పీయూషం స్యందతే యస్యలీలయా
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుమ్॥ ర. గం. పీఠిక.

3 శ్లో॥ శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీ రాక్షపాదీ రపి గహనగిరో యో మహేంద్రాదవేదీత్
దేవాదేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్తశేషామలభణితి రభూత్సర్వవిద్యాధరో యః॥ ర గం. పీఠిక

వీనికిఁ దెలుఁగు.

౧మ॥ స్థిరలక్ష్మీకరుణాపరిపాలితుఁడుఁ బేరంభట్టసూనుండుఁ బం
డితరాజాంకుఁడుఁ ద్రిలింగకులుఁడా విద్వల్లలాటంతపుం
డతితుష్టిన్ విని కామరూపవిభు దివ్యంబౌ కవిత్వంబుఁ, ద
త్కృతి వర్ణింపుమఁ జేసెఁ బండితజగన్నాథుండు దానీకృతిన్ ॥

౨క॥ పాషాణమునుండియుఁ బీ । యూషము స్రవియించు నేమహోగ్రగిరులన్,
భూషించుము నా లక్ష్మీ । యోషావిభుఁ బేరుభట్టు నొజ్జను దలుతున్ ॥

3మ॥ గ్రహియించెన్ సద్బ్రహ్మవిద్య విమలజ్ఞానేంద్రయోగీంద్రుచే,
గహనంబైన కణాదగౌతములవాక్యంబుల్ మహేంద్రాఖ్యుచే,
మహి కాశీపురి ఖండదేవునలనన్ మీమాంస, శేషాంకుచే
ఫణిరాడ్భాష్యముఁ; బేరుభట్టఖిలవిద్యాశాలి సామాన్యుఁడే ॥

మఱియు జగన్నాథపండితుఁడు రాజమహేంద్రవరమండల నివాసి యని తద్వంశ్యుఁడగు నొకకాశీపండితుఁడు వ్రాసియున్నాఁడు. పండితరాజుతండ్రి పేరుభట్టు గదా! అన్యదేశీయుల కట్టిపేరు సాధారణముగా నుండ నేరదు. కాఁబట్టి యాకాశీపండితుఁడు వ్రాసినమాట నిజమే కావచ్చును. జగన్నాథపండిత విరచితములయిన గ్రంథములనుగుఱించి కొంచెము వివరించి యీపీఠిక ముగించుచున్నాను.

ఈయన గంగను, యమునను, లక్ష్మిని, విష్ణువును, సూర్యునిస్తోత్రము చేయుచు వరుసగా, ౫౨, ౧౦, ౪౧, ౬౦, ౩౦ శ్లోకములుగల పీయూషలహరి, యమృతలహరి, లక్ష్మీలహరి, కరుణాలహరి, సుధాలహరియని పంచలహరులను రచియించినాఁడు. వీని లోఁబీయూషలహరిని గంగాలహరియని సాధారణముగా వ్యవహరింతురు. సుధాలహరి యనునది మయూరకవిరచిత సూర్యశతకమువలె స్రగ్ధరావృత్తములు గలిగి యున్నది.

రసగంగాధరము. ఇదియొకయలంకారశాస్త్రము. జగన్నాథపండితుఁడు రచియించినగ్రంథములం దన్నిట నిది యుత్తమము. సరస సాహిత్యసంపాదనాభిలాషులకి ది యవశ్యపఠనీయము. మనీషులు దీనిని గవి కల్పకమని సన్నుతింతురు.

మనోరమాకుచమర్దన. ఇది భట్టోజీదీక్షితుఁడు సిద్ధాంతకౌముదికిఁ జేసిన మనోరమ యనువ్యాఖ్యమీఁద ఖండనగ్రంథము.

అశ్వధాటి. ఇది తనమనుమని ప్రార్థనమునఁ గవి రచియించిన ట్లీక్రిందిశ్లోకమువలనఁ దెలియవచ్చు మన్నది. శ్లో॥ రామసామ్నః స్వపౌత్రస్య కామనాపూరణోత్సుకః అశ్వధాటీం జగన్నాథో విశ్వహృద్యా మకీరచత్ ॥ ఇది యమకప్రధానము లగు ౨౫ శ్లోకములు గల బహుదేవతాస్తవగ్రంథము. అశ్వధాటీవృత్తములనుబట్టి దీనికా పేరుపెట్టఁబడినది.

ప్రాణాభరణము. ఇదికామరూపదేశాధీశ్వరుఁ డైన ప్రాణనారాయణుని పరాక్రమాదులను వర్ణించుచు రచియించిన చిన్నగ్రంథము. ఇందలిశ్లోకమొకటి యీవఱలోఁదెలుఁగుపద్యముతోఁగూడ నీపీఠికలోనే వ్రాయఁబడియున్నది. అది చదివిచూడఁగా నీగ్రంథముఁ గామరూపాధిపునికవిత్వమున కలరి పండితరాజు రచియించినట్లు గోచరించెడును. ఈగ్రంథమందలి మొదలిశ్లోకము భారవిలాసమందలి ౪౨ శ్లోకము నొక్కటిగానున్నవి.

జగదాభరణము. ఇది షాజహానుజ్యేష్ఠపుత్త్రుఁ డగుదారాసుకోను వర్ణించుచుఁ గవి రచియించినది. దారా సంస్కృతభాషాపోషకుఁ డగుట సుప్రసిద్ధము.

ఆసఫవిలాసము. ఇది కేవలగద్యకావ్యము. కవి దీని నాసఫఖానను నబాబునుగూర్చిరచియించినాఁడు. ఈసంగతి స్పష్టపఱుచునొక వాక్యము తద్గ్రంథపీఠికలోని దని యింతకుఁబూర్వ మీపీఠికలోనే యుదాహరింపఁబడియున్నది.

భామినీవిలాసము. ఇది భర్తృహరివిరచితమైన సుభాషితరత్నావళివంటిది. ఇందు నానారసప్రధానములయిన మనోజ్ఞశ్లోకములు గలవు. జగన్నాథపండితుఁడు తన రసగంగాధరములో లక్ష్యములుగా నుదాహరించుకొనుటకీగ్రంథము రచియించినాఁడనియు, గంగాలహరీప్రముఖనిజగ్రంథములలో దొరకనిలక్ష్యముల నిందుండి గ్రహించుచు వచ్చెననియుఁ జెప్పుదురు. రచనాకారణము నెవరేమి చెప్పినను గ్రంథముమాత్రము

సరసమైనది ఇందలి శ్లోకము లలంకారాదులకు లక్ష్యములుగానుండ వీనిని జదువుటవలనఁ దత్తద్విషయములు స్ఫురణకు వచ్చుచుండును.

ఇదిగాక చిత్రమీమాంసాఖండనము మొదలుగాఁగల బహుగ్రంథము లీపండితరాజు రచియించెనని చెప్పుదురు. వసుమతీపరిణయము రతిమన్మథము ననురెండు నాటకములు గలవు. వానినిరచియించిన కవి జగన్నాథుఁడని యందున్నదిగాని యాజగన్నాథుఁడీజగన్నాథుఁడు గాఁడని నిశ్చయముగాఁ దలంపవచ్చును. తన్నాటక ప్రస్తావనలయందుఁ గవి తండ్రిపేరు బాలకృష్ణుఁడని యుండుటయే కాక విశేషించి వసుమతీపరిణయమందుఁ దన్నాటకమప్పుడు రాజ్యముచేయుచున్న పేష్వాబాలాజీబాజీరాయనియాజ్ఞచొప్పున రచియించినట్లు చెప్పఁబడినది. ఇందువలన నీనాటకద్వయకర్తయగు జగన్నాథుఁడు బాలాజీ బాజీరాయని కాలమందనఁగా 18 వ శతాబ్దము నడుమ నున్నవాఁడని తేలుచున్నది. భామినీవిలాసకర్త 17 వ శతాబ్దము నడిమివాఁడనియు నతని తండ్రిపేరు పేరుభట్టనియుఁ బూర్వమే తెలుపఁబడెను గదా!

భామినీవిలాసమందలి కడపటిపద్యములవలన జగన్నాథ పండితుఁ డాత్మస్తుతిపరాయణుఁడని స్థూలదృష్టికి దోఁచునుగాని సూక్ష్మదృష్టి నాలోచించినచో సర్వశాస్త్రపారంగత ప్రజ్ఞగల యవ్విద్వాంసునకట్టి యుక్తులు మదయోక్తిగావని తోఁచనే స్ఫురింపకపోదు. పండితరాజు తనకవనమందుఁ బ్రసాదము సాధారణగుణమని యీక్రిందివాక్యములవలనఁ జెప్పియున్నాఁడు. "శ్రుతిమాత్రా వాక్యార్థం కరతలబదరమివ నివేదయంతీ ఘటనా ప్రసాదస్య. అయంచ సర్వసాధారణో గుణః, ఉదాహరణాన్యత్ర ప్రాయశో మదీయాని సర్వాణిపద్యాని." ర. గం – ఆననము ౧. ఇట్టికవనమును సరిగఁ దెలిఁగించుట యశక్యమే యయినను మనీషులు గుణగ్రాహులను నమ్మికతో నేనీ ప్రయత్నమును జేసినాఁడను. జగన్నాథపండితుని గురించి కొంతవివరముగా వ్రాయుటకై నాకు, ఎల్, ఆర్ వైద్యులనువారు ౧౮౮౭ సం॥ ప్రకటించిన సంస్కృత భామినీవిలాసములోని యాంగ్లపీఠిక విశేషసాహాయ్యము చేసినందునఁ దత్పండితులకు నేను మిగులఁ గృతజ్ఞుఁడనగుచున్నాను.

ఎన్నఁడో నాయొద్ద నేర్చుకొన్నదో కొంచెపాటి తెలుఁగునకై సదా నాయెడల గురుభావము వహించి యీగ్రంథము ముద్రాప్రవృత్తి గయికొనకయే యచ్చొత్తించిన దేశోపకారి పత్రికాధిపతి సత్తిరాజు సీతారామయ్య ప్రధానునిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యాది సంపన్నునిఁ జేయుఁగాక యని కోరుచున్నాఁడను.

రాజమహేంద్రవరము.
1902 సం॥ డిసెంబరు.

వడ్డాది సుబ్బారాయుఁడు.

## అవతారిక.

---

సతీస్మృతి యనఁగాఁ బతివ్రతను గూర్చిన స్మరణము. వేణీసంహారాద్యాంధ్ర గ్రంథకర్త యయిన వడ్డాది సుబ్బారాయకవి తనభార్య యగు సన్నపూర్ణాసతిచరమకాలమునఁ దజ్ఞాపకముగా దీనిని రచియించినాఁడు. పండితరాయఁడనుబిరుదునామముతోఁ బూర్వము షాజహా నను డిల్లీచక్రవర్తి యాస్థానమున విద్వాంసుఁడుగా నుండిన జగన్నాథకవి సంస్కృతమున రచియించినభామినీవిలాసమనుచతుర్విలాసగర్భిత మయిన గ్రంథముఁ దానాంధ్రీకరించినందునఁ దద్గ్రంథమందలి తృతీయముకరుణవిలాసము జగన్నాథపండితుని ధర్మపత్నియగుకామేశ్వరి మరణమును స్మరింపఁ జేయునది యగుటచేత విషయసాదృశ్యమును బట్టి కవిచే నీగ్రంథము భామినీవిలాసకరుణవిలాసమున కనుబంధము కావింపఁబడినది. ఇందు మొదటినుండి నలుబదియేడు పద్యములు కేవలము కవి విలాపమును దెలుపునవి యయినను దత్తదవస్థాభేదమును బట్టి యవి ప్రథమ ద్వితీయ తృతీయ తురీయ విలాసములని నాలుగు భాగములు చేయఁబడియున్నవి.

భార్య లంకణములు చేయుచున్న పిడుగు సమాచారము దెలుపు నొకయుత్తరము నరసాపురము సమీపమున వసిష్ఠాతీరమం దొకపల్లెయయిన కలగముపూడి పోలవర మనుతన యత్తవారియూరనుండి రాఁగాఁ దత్క్షణమే కవి యచ్చటికిఁబోయి, నాఁటి కేడులంకణములయితేన్నానవాలు పట్టుపాటి తెలివి యయినను లేక సంధిచే నేమేమో కలవరించుచున్న ప్రియురాలిని జూచి, యింక జీవింప దనునధైర్యముతో, నామె సప్రాణయయియుండఁగా శోకించుట ప్రథమభాగమును, మృతసతికి దహనసంస్కార మాదినముననే జరిగినను సంచయనకర్మనిమిత్తము తత్పోలవరగ్రామమునఁ గవి మఱినాలుగు దినము లాఁగవలసి వచ్చినందునఁ బ్రాణోత్క్రమణానంతర మాయూర దారను జరిగించినకర్మములను నామెవిలాసాదులను దలంచుకొని దుఃఖించుట ద్వితీయభాగమును దద్గ్రామము నుండి రాజమహేంద్రవరమువచ్చి నిజగృహమున మృతసతీప్రతిచ్ఛంద దర్శనాదులవలన మనోవైకల్యముగలిగి బహువిధముల విలపించుట తృతీయభాగమును, స్త్రీదక్షతలేమి మొదలుగాఁగల పలుకారణములవలన రాజమహేంద్రవరమున జరపవలను ప

డక, కవి తనకుమారుని (తృతీయకళత్రసంజాతుని) మాతామహస్థానమయి నలువదిరెండు మయిళ్ళదూరమున ఏలూరికాలువదరినున్న సుప్రసిద్ధమగు నుంగుటూరుగ్రామమునకు బోయి నిజజాయ కక్కడఁ బారలౌకికక్రియలు నిర్వర్తించుచు నార్తిఁబొందుట చతుర్థ భాగమును దెలియఁజేయుచున్నవి.

తురీయకళత్రవియోగము ప్రాప్తమయినప్పుడనఁగా నైదేండ్లక్రిందటి దుర్ముఖిసంవత్సర శ్రావణమాసమున సీయన్నపూర్ణాసతియక్కగారగు సుబ్బలక్ష్మియను కళత్రము కాలము చేసినప్పుడామెను స్మరించుచు నీకవిసతీస్మృతియను పేరితోఁ గొన్నిపద్యములువ్రాసి యందు ద్వితీయకళత్రములపద్యములుకూడఁ జేర్చి యచ్చొత్తించెను. కాని దీనింబోలెదానిని గరుణ విలాసానుబంధమని పేర్కొనలేదు. ఈకవి భామినీ విలాసము నప్పటికే కొంతవఱకుఁ దెలిగించియుండెను. అయినను గరుణవిలాసములోని విషయమిట్టిదని నాఁటికిఁ జూచియుండలేను. ఇటీవల నయ్యంశము దెలియ నయినందున బూర్వకాలమునఁగూడఁ గళత్రవియోగవిషయమునఁ గవులిట్లు గ్రంథరచన సేయు నాచారము గలదని సూచించుటకిది దానికనుబంధ మొనర్చినాఁడు. ఇయ్యనుబంధగ్రంథమునందలి పద్యములలోని భావములు గొన్నిచోట్లఁ గూఢముగానున్నవి. పవిత్రమయినచరిత్రము గలిగి బహిఃప్రాణమయినభార్య పరలోకమునకేగినప్పుడు కవియగుభర్త యామె పేరు శాశ్వతము గావించుటకుఁ జేయవలసిన దింతకన్న వేఱుకార్యము లేదు.

వసురాయకవి మున్నొకసారి తురీయఁకళత్ర వియోగ సాగరమం దీఁదులాడుతఱిఁ బరామర్శించుచు నొక మిత్త్రుఁడు వ్రాసి ప్రకటించుటకు నాయొద్దకుఁ బంపిన పద్యమొకటి యీక్రిందఁ బొందుపఱుచుచున్నాను

చం॥ వరకవితాలతాంగి ననపద్యములీల గవగూడి రేవగల్
చిరతరసౌఖ్యకీర్తులను జెందుచుఁ దన్మొక రీతిఁ జూడనీ।
సురుచిరగాత్రలందఱది చూచి సహింపఁగలేక గాదదు।
ర్భరతరచింతతోడ నెడఁబాసిరి మిమ్ములనిట్లు మిత్రమా॥

ఏలూరు.
ది 10 ఫిబ్రేవరు 1908.

} సత్తిరాజు సీతారామయ్య

శుభమస్తు.

# భామినీవిలాసము.

## ఇష్టదేవతాప్రశంసనాదికము.

---

క॥ శ్రీకళ్యాణగుణాకరు । లోకైకాధారు సకలలోకారాధ్యున్ ।
శోకహరుం గరుణామయుఁ । బ్రాకటకైవల్యదుం బరాత్పరుఁ గొలుతున్ ॥ ౧.

క॥ వినయవివేకాదుల భూ । జనులమది న్నాటుకావ్యసంతతి గలిగిం ।
పను నిర్మితంబు లగుచే । తనవిద్యాయంత్రములను దలఁతు సుకవులన్ ॥ ౨.

క॥ పండితరాజు జగన్నా । థుం డమరోక్తుల రచించె దొల్లిట డిల్లీ ।
శుం డైనషాజహానుని । నిండుసభం బొలిచి భామినీవిలసనమున్ ॥ ౩.

క॥ రాజమహేంద్రాఖ్యపురీ । భ్రాజితబోధాభ్యసనకళాశాలఁ దెలుం ।
గోజ వసురాయఁ డాకృతి । రాజము నాంధ్రీకరించు రసికుల కెక్కన్ ॥ ౪.

### భామినీవిలాసము—ప్రాస్తావికవిలాసము.

క॥ శ్రీమన్మాధుర్యపరమ । సీమను సారస్వతోరుసింధుమథనజన్ ।
మామకమృదుకవితాసుధ । నీమహిలోఁ గ్రోలువారి కెసఁగు సుఖంబుల్ ॥ ౧

చ॥ మదమలినార్ద్రగండగజమండలి యుండదు దిగంతమందు; లోఁ ।
గదె లేదు జాలి హస్తినులఁ గన్న; మృగంబు లతుల్యకష్టముల్ ।
గద; యిపు డీజగంబున నిఁకన్ స్వకఠోరనఖాగ్రపాండితిన్ ।
విదితముగా మృగాధిపుఁడు వేనిపయిం బ్రకటీకరించెడున్ ?॥ ౨.

ఉ. మానససారసాకరముమధ్యమునన్ జలజస్థలన్ సుధా ।
శీనుత సౌరభాంబువుల లీలఁగఁ గాలము వెళ్ళఁబుచ్చునీ ।
మానితపుష్కరాళి మిట మండుకమండలసంకులోదకం ।
బైనసపంకపల్వలమునం దెటు నిల్వఁగ నేర్చుఁ జెప్పుమా ॥ ౩.

ఉ॥ చూడఁ జకోరు లేఁకరినచూపులఁ దూరుపువైపు, గల్వలు ।
న్వీడుచు నుండ మానమును, విగ్గాను చుండ మరుండు, నూహనిం ।
బాడఁగఁ జూచుచుండ నభిమానవతీజనమాన మిట్టిదోఁ, ।
గూడునె భాతి చందురునకున్ ఘటియింప ఘనాపరోధమున్ ?॥ ౪

చ॥ తొరగెడునీమరందమును ద్రుప్పలు దుల్లఁగ నెప్పు డానుచున్ ,।

స్ఫురదరవిందమా ! దరిని సొంపుగఁ దుస్స్వాద తేమొ పాడెదుం ! ;।
బరమహితుం డనంగఁ బవమానుఁడె సుమ్మొకకోర్కె లేక నీ।
బరిమళముల్ నిరంతరముఁ బర్వఁగ జేసెడు సర్వదిక్కులన్॥ ౫.

క॥ ఏతెంచెను దైవికముగ । నీతుస్స్వాద యిటకు నస్వకే కుటజంబా?।
బాతిగ మకరందము గల । వాతామరపూలు దీని నొదలఁ బూనకే॥ ౬.

తే,గీ॥ లేఁటికూటువతో నొండు దీయమావి । మోక విలసిల్లునందాఁకఁ గోకిలంబ !।
వెడలఁ బుచ్చుము నీ వెటో, విరస మైన । వాసరము లివి, కానసాఖ్యంపరమున॥ ౭.

క॥ బకము లవివేకములు ; దలఁ । పకు నీ కవి నలంపుపరిభవము లిల జైవా।
తృకములు గావుతేఁ గమలిని !। మకరందసుధారసైకమూర్తికము లవల్॥ ౮.

తే,గీ॥అయ్యయో ! నేను గడునీచమైతి ననుమఁ। గూపమా! యెప్పుడును నీవు గుంపఁబోకు?।
సరసహృదయంబ వగుచును బమెలగుణము । లెల్లకాలము నీవు గ్రహింతు గాదె?॥ ౯.

క॥ విరివిగ మకరందము గల । విరివన్నిని వాసరములు వెడలించినం।
భ్రర మిప్పుడు కటకట ! యె। క్కరణిని గుటజంబునందుఁ గడపునొ దినముల్ ?॥ ౧౦.

క॥ హరిచందనమా ! యెవ్వని । గిరలను గోచరము తానకీనమహిమ? యీ।
గరళంబు గ్రాయుచిలునలఁ। బరిమళములు బుగులుకొలిపి భరియింతువుగా॥ ౧౧

క॥ పాటీరమ ! తానకపరి । పాటిని బాటింపఁ గలద పాటన మెటనం।
దోటిల్ల కొరయునరులకుఁ। బాటు వాటిచి పింకి పయ్యాఁ బరిమళ విమాపే?॥ ౧౨.

ఆ,వె॥పాలు నీరు నేఱుపఱుచుటలోన రా। యంచ ! నీవ యాలసించితేని।
లోకమందు నెవ్వఁడో కులవ్రత మింకఁ। బాలనంబు సేయువాఁడు నేఁడు?॥ ౧౩.

ఆ,వె॥ పైకి గత్తివాతిపగిది, జెనువ్రాయఁ। బాములట్ల కూర్పఁ బంగిఁ దోఁచి,।
లోన గోస్తనీసమానులై నటలెడు। వారుఁ గొంప ఋఁడుర్గ వసుధయందు॥ ౧౪.

ఉ॥ పానము సేయు చెప్పుడు భవన్మకరందరసంబు స్వేచ్ఛనై।
గానము సేయుఁగాక గమకంబుగఁ జెంగటఁ బడ్పదికములోఁ,
నీనిరవద్య సౌరభము నిచ్చలు సర్వదిగంతరంబులన్ ।
మానితిభంగి నింపఁ బవమానుఁడె సుమ్ము ప్రసూనమా !॥ ౧౫.

చ॥ కొలకొల మంచు నెల్ల ఫలుఁగుల్ దివి నేగును, దీయమావిమో
గ్గలగమి జుమ్ముజుమ్మనుచు గండుటళుల్ వెస మూఁగు, నీవు కో
పిలఁగఁ ; గొలంక ! యిం కెవరిఁ జేరు ని దింపెన తీఱుఁగా కయో!
కలుకు మునుం గదా మనసు, గాంచిన నీయలిదీనమీనముల్॥ ౧౭.

క॥ తుమ్మెదవలె సౌరభలో। భమ్మున నిన్నుఁ జేరె ననుచు భావింపకు మీ।
తెమ్మెరను; లోకహితముగఁ। దమ్మీ ! యిత్తఁ డెర్గియుగ నుదారుం డయ్యెన్॥ ౧౮.

క॥ మానముఁ బూనకు మాలతి ! । మానుగ గుంజరము సలుపుచున్నది తను నెదన్ ; ।
దానకళాగురువులు సం । తానపరువు లెల్ల దీనిఁ దమతలఁ దాల్చున్॥ ౧౯.

ఆ॥వె॥ సకలగుణము లున్న, సౌగంధ్యత లేక । పోరెను, సేవ్యత్వములకతమున,।
వానిని స్వహింతు, పాటీర ! తాపకా । స్వర్వ్య మహాహ ! యేమనంగ నచ్చు ?॥ ౨౦.

క॥ గహనము సకలము వెదకెను; । బహువిధముల భ్రమరకు లన్ని పరికించె; నోహో।
సహకార ! యెక్కడను మధు । లిహము ఘనత్వము గాంచ లే దీజగతిన్॥ ౨౧.

క॥ కలపూలతావి, దనకడఁ । దలపెట్టఁగ లాని దేవతరుకుసుమముపై ।
నిలిపి పద మొండు విరి పొం । తల పోఁ దలపోయ దేని, ధన్యుడవె యళీ॥ ౨౨.

క॥ పావనివి వింధ్యసంభవ । వోవాహిని ! యివురుచున్న నుచితమె యిది ? లో।
భావించి చూడు లెస్సగ; । నవీఘులకలుషబలము లీవు గ్రహింతే ?॥ ౨౩.

క॥ పండులుఁ బత్రంబులుఁ, బూ । లుండున దెన్నండు లే దయో ! బర్బురమా !।
ముండుల నెప్పుడు నిండుక । యుండెను; ని న్నెవరు గోరె యుపసర్పింతున్ ?॥ ౨౪

క॥ ఈకాననము, గోకిలమా ! । యేకాకివి; కంటి మెత్తి కట్టే మనుమా ;।
కాకు లివి నిర్దయంబులు । నీ కెగ్గొసరింప కుండు నిజమల మనుమాన్॥ ౨౫.

క॥ స్ఫురితతరువిసరసుషమా । పరిహారక మఖిలజంతుబాధాకర మీ।
యురుతుహినము, నేగొనమున । భరియించెద వెపుడు విడక పాంథ్యాత్ంజనకా॥ ౨౬.

క॥ నీమొద్దను నేతెంచిన । యీయళికి నవజ్ఞ సేయ కేనుఁగుగున్నా !।
నీయమ్మున దానస్తన । నియమ్ములు కరులు, దీని నెత్తిని బూనున్॥ ౨౭.

క॥ దేవతరుకుసుమసౌరభ । సేవం గోరికలు దీఱి చెలఁగెడునళిన్।
బూ వన్య మైనదానిని । సేవించుట కేవలంబుఁ జిట్టకము గదా॥ ౨౮.

క॥ గాలించె నెల్లభ్రమరకుల । నాలించెను గోకిలముల నడిగి రసాలా !।
పోలింప నీకుఁ జాలిన । దీలోకములోనఁ గాన విందిందిరముల్॥ ౨౯.

చ॥ వెనరున నోయిమాలకరి ! నీ వుడు కెండల మండు వేసఁగిం।
గనుఁగొని కొండెపాటి యుదకంబు నొసంగి యొనర్చుపత్రియా।

వనిచిన మొక్క కెల్ల భువనంబును జల్లుల ముంచుమేఘ్ఘనా।
ఘన మయినట్టి యథార్థముగఁ గల్గఁగఁ జేయ నశక్యమాఁ జూమీ॥ ౩౦.

ఉ॥ వెంగలి తోఁటవాఁడు? పృథివిం గలతేమ హరించిపోయె; వా।
త్యం గడు కావిరుల్ గవిసె నాశల; నెండలు మెండు లయ్యె; సం।
పంగియ కీమరుస్థలి నపాయకరంబులె యన్ని; యిట్టు ల।
య్యుం గమలాసనుం డెచట నుండియొ నిన్ననిచెం బయోముచా!॥ ౩౧.

ఉ॥ ఏకడ దానవార్భ్రిమ దనేకమిళిందము లేసికల్ భయో।
ద్రేకవిలోలలోచనత దేహబలం బఱు, మౌక్తికవ్రజం।
బేకడఁ బొర్లుచుండెడు, మృగేంద్రుఁడు దాఁ బరలోక మేగ,నా।
హ్వాకిట నిత్తఱిన్ శివ శివా! చెవి సోఁకు శివావిరావముల్॥ ౩౨.

ఉ॥ మాకరి ప్రామఁకు లన్నిటి సమానపుఁ బ్రేమునె పెంచెఁగాని, ప్ర।
త్యేకముఁ జూపఁ డీపొగడ కెక్కువయిక్కటికంబు; నైన ని।
మ్మోక క్రమప్రవృద్ధ మయి పూచి, నితాంతలతాంత సౌరభో।
త్సేకముచే దెస ల్పొనరిచెన్ మధుపారవపూరితంబుగన్॥ ౩౩.

చ॥ వలము మొదల్కుడుం; దిటము పోఁతు, పటిష్ఠము లెల్లకొమ్మలున్;।
నెల వొరు లెక్కరానిమల; నీ కిఁగ నేబెగ డోనగాధిపా!।
పెలుకుటఁ బుట్టునైన వెఱవేఁకి యొకం డెదనెంచ; నిఘ్ఘృణాం।
డోలసెదా భగ్నకీలల మహోగ్రదవానలఘస్మరుం డహో॥ ౩౪.

ఉ॥ వేసఁగి వేళ వేవెలుఁగు వేఁడి వెలుంగుల వేఁగి, దీర్ఘ్ఘతు।
ల్యాసరము ల్మినుక్ మదిఁ దలంచుచు నెట్టెటొ నెట్టి, నెట్టకేఁ।
జేసినలోఁటి పున్నెమునఁ జేసి కనంబడి నేఁడు? నీరదా!।
గాసిలు చాతకంబుఁ గరకంబుల మొత్తను జిత్తగింతువే?॥ ౩౫.

చ॥ దరికొని కారుచిచ్చు మిను దాఁకెడుమంటల నేర్చుటం, గటా।
పెరసినతీవియ ల్పడలి బిట్టుగ మాఁడుచుఁ జెట్టు లుండ, నీ।
సిరిగరువం బిదేటిది? వచింపుము నీలపయోద! సర్వదా।
గురిసెదు కొండకొమ్ములనె కుండల ముంచిన లాగు సోనలన్॥ ౩౬.

[illegible] తెరువరి! వెఱవకు! దారి నితని పరుషగర్జితము చెవి సోఁకన్;।
ఘో[illegible]ద్రిదారణ। కారణజలదాత యితఁడు ఘనుఁ డని వినవో?॥ ౩౭.

ఉ॥ సౌరభమా జగన్నుతము; శైత్య మింక న్భువనోత్తరంబె పో;।
కీరితి దిగ్వధూనిలయకేళన మైనను జందనద్రుమా! ।
ఘోరవిషానలార్చులను గోటరకోటిని గ్రాయుచుండు క్రూ।
రోరగముల్ త్వదీయసుగుణోత్కర మెల్లను ద్రింగెదుం గటా॥ ౩౮.

క. కోరిక, మోమోటమి, చెలి । కారము, గూరిమియు నేది గానము; మైనన్ ।
ఘోర మగుభువనతాపము । దూరము గావించు నున్నతుఁడు ఘనుఁ డౌరా॥ ౩౯.

ఉ॥ అచ్చపుఁగొల్నఁ బుట్టు; రవిహస్తమునన్ విడిమట్టు; లచ్చికిన్ ।
రచ్చవు; నాఁచు వేల్పులమనంబులఁ దావి; మ తేఁగొనంబులం।
దొచ్చెము లేదు; నచ్చిక ద్విజోత్తమహంసను నాదరించు మన్ ।
వచ్చిన, నింతకన్న నెఱవాసికి నెక్కుడు నీవు పద్మమా॥

ఉ॥ ప్రొద్దున కద్ది యకామణులు పొల్లెదు వేలను జాలతాలతో;।
నిద్దురవోపు లచ్చిదోర, నీరచరంబులతో జలంబులన్;।
బెద్దతనంపుసొంపు నవివేకము నీకడ రెండుఁ దోఁచు; నిం।
దద్ద పయోధి! భూషణ మొనర్తునో? దూషణముం బొనర్తునో?॥ ౪౧.

క॥ నీయీమణు లేమిటి క। ట్రాయిత మీకాయ మేల? రత్నాకరుఁడా!।
వా రెంజినవారలకున్ । నీయొద్దను బచ్చిమంచినీ ళ్ళొదవవు గా॥ ౪౨.

ఉ॥ నీరము లిన్ని యుండఁగనె నీవు తృషార్తులదప్పిదీర్పఁగా।
నేరవ యేని, యొల్లెడల నిప్పుకలం గురియించుకొంచుఁ గా।
సారమ! మందు వేసఁగి వెసం జనుదే, పఱుపట్లు పట్టునాఁ।
డేరిదగన్ హరింపఁ గల వించుక లోఁ బరికించి చూడుమా॥ ౪౩.

క॥ కోపం బెద రాదుగదా । కూపారమ! నిన్ను నే నొకొం డనియెద; నీ।
దాపునఁ గొని ఘనుఁ డోసఁగెడు । నా పోఘుము గూడఁ బట్టి హరియింతు పయో॥ ౪౪.

ఆ వె. వేల్పుటేటిలోఁ బ్రవేశించునిన్ను మే । మాఁగఁ బోము గాని వాఁగుకాన!।
యొక్కమాట విను మయుక్త మానది ద్రోవ । నీతరంగలీల నెగడఁ జేయ॥ ౪౫.

ఉ॥ వాసవుసందనంబునను వాసికి నెక్కినయీగిర్మాఁకులన్।
వాసనఁ జూచి తా విడుచు ప్రాపిరులన్ దెఱగంట్లు మూరుకో, ।
భాసిలుతేఁటి, నిన్ను విధివక్రతఁ గోరఁగ, లోభి వేచుఁ బు।
ష్పాసవ మీయ లేవహహ! యంబుజమా! నిను నేమనంగలన్?

క॥ బిసవిసరము మెసవితి సా; । రసముల సేవించి తసమరస మానితి; నీ।
వసమౌ కలహంస! మరుమే । లిసు మంతయూ సలిపికొనఁగ నీసరసునఁకన్॥ ౪౬.

ఉ॥ నాకముమౌళిమానికమ వచ్చ్యుతధామము కీగిచెట్లపున్,।
శాకవిరోధికిన్ శచికిఁ బండిన పున్నెపుఁ బంటపైనయో।
ప్రాకటనందనంబ! బుధవర్గము, ఖాండవరంగతాండవా।
స్తోకనటుండు నీకు శిఖి దూరము గా, విధి నెన్న వేఁడెదన్॥ ౫౭.

చ॥ తనతనవ్యాపృతిం జనము దారిన నాకడనుండి, చంచుకో।
టిని బగిలించి తల్పున్, బ్రజీన మొవచ్చెద గూఁటినుండి నే।
నని, శుకపోత మిట్టులు మనోమృతపానము సేయుచుండ, లో।
ననుగరితుండ సన్నిభఫలాధర ముద్ధతిఁ దూఱి దాయనన్॥ ౫౮.

చ॥ కడిఁది కరళ్ళు పెల్లెగయ, గట్టులు పొట్ట నడంగఁ, బొల్చని।
క్కడలిపడంతుకన్ వెడమెకంబులు డిగ్గఁ దలంతురేల? యి।
క్కడనె సముచ్ఛలచ్చటులకాండమునన్ సుడిగుండమందుఁ దాఁ।
బడి, గిఱు గిఱ్ఱనం దిరిగి, భద్రగజం బడు గంటె వెంటనే॥ ౫౯.

చ॥ శోచమ! శమించి పొల్గుడుచుకో; కఱకుంగడకంటిచూపులన్।
మదకరిబుద్ధి దిక్కులను మాటికి నేటికిఁ జిమ్మె దీవు? ప।
ల్లొదవెడుమూఁడులోకములయుంబరితాపము శాంతి వొంపఁగాఁ।
జపల నవాంబు వంబుదము శబ్దము సల్పెడు ధీరధీరతన్॥ ౬౦.

క॥ చాలింపుము నీగర్జిత। మాలించిమదీయగర్భమం దొకనెల పో।
చూలిది గదలెడు మదనుం। డాలం జనునప్పలంబునం జలధరమా॥ ౬౧.

క॥ వేదండగండకండూ। చ్ఛేదనపాండిత్యనుహితసింహము, దా నా।
వేదింమ నేమి శౌర్యము,। మేదిని క్షుద్రంబులైనమృగములతోడన్?। ౬౨.

చ॥ జల మమలంబు పుట్టినిలు; చామలమోములఁ గేరు సౌరు; గా।
ములవారకేలు గీము; క్రతుభుక్షిచోరము సౌరభంబు; పే।
శలకవివాగ్విభాఁడమవు; సర్వధనంబవు సూనధన్వికో।
జలజమ! నీ వయో మధుపజాతికిఁ గూర్చిన నేమనం గలన్?॥ ౬౩.

క॥ నయనములు మొగిచి లీలగ। శయనించెద వేమినిదుర? సాహసిక! నీ।
కయినది పగ హరితో; ని। శ్చయముగ నిది పెరిఁగి పెరిఁగి చావై యూఁదన్। ౬౪.

ఆ,వె, విబుధవనోపవనుండె పేపేగ నుడుపులు। నేపల పెట్టకేని పడతెసేని।
మాదలఁబడదనుమ్మి, మాతంగపోతంబు। నవనమున మనోజ్ఞరనము లక్ష్మి॥ ౬౫.

శా॥ ఔదార్యంబు జగత్ప్రతం బక్షిజనం బంభోనిధానంబు; నా।
నాదితాన్యయహారి సౌరభము; శ్రీరామ మావాస మో।

ఆ.వె॥ ధనికువలన ధనము తననిమిత్తము గొన్న, । మోము తెలివి దప్పు టేమి వింత? ।
యబ్ధినీరు లిన్ని యన్యార్థమే కాదు । ఘనుని మొదలె తాల్చుఁ గాళిమంబు;॥ ౧౦౧
తే.గీ॥ జనకుఁ డొకకొండ నైత్యంబు; జాతికట్టె; । చెలిమి చిలువలతో; నైన నులయజాత! ।
జగతిలోపల నీకు విస్తారమహిమ । గలుగుటకు, నీగుణంబులె కారణములు;॥ ౧౦౨
ఉ॥ ఏమిప్రయోజనంబునకు నీవు గడించెద వక్కటా! గుణ ।
స్తోమము? సజ్జనుండ! విను; శోభకు నన్ను హితంబుఁ జెప్పెదన్;।
భామిని రామణీయకమనోహరవస్తువు లేవి దానిచే ।
నోముకొనుం గళేబరము? నద్ధరఁ డీకలి ప్రత్యహంబునన్;॥ ౧౦౩
ఉ॥ కోమలపల్లవాగ్రమతరుగుంజదళిప్రకరాభిరామ! యో ।
యామని! నీవు లేనిసమయంబునఁ గోయిలకున్, వికాసవ ।
త్తామరసంబులై పొలుపు మదచ్చికదల్, పొగగ్రమ్మినట్టు లౌ; ।
వేమరు దేహదాహ మొదవించెడు గాలులుఁ, గీలులుం బలెన్;॥ ౧౦౪
క॥ గిరిగండశిలలు, నిజ్ఝర । తరవ ఖరశిఖరములన్, మహావశిబుద్ధిన్ ।
మరియాలుగఁ జేయుహరికెని, । దురదృష్టపువేళ, నెఱిచి దొరకద యెంగున్;॥ ౧౦౫
ఆ.వె॥ నడికిలేయి పుట్టెఁడి యయ్యు, సింగంపుఁ । గొదమ, దూలకించి కొంచె ముఖము, ।
తల్లియంకమున మొదల కుంభ నొడ లెల్లఁ । గుంచి యట్టె యొఱుతఁ బొంచియుండు;॥
క॥ గుణపక్షపాతే మే మని । ప్రణుతింతును నిది? ఖలుఁడ! పటుదివ్యమతీ! ।
గుణసేవధులను సాధులు, । గణియుం బ్రేమ మెఱచి పో వహర్నిశ మహహా;॥ ౧౦౬
క॥ వాకొనుదునురా ఖలుఁడా! । నీకథ వివరముగ బుధులనికటమునందున్?।
ఛీ! కాదటు పాపాత్మక! । నీకథ దగ్ధంబు గాను! నే నుడువను రా;॥ ౧౦౭
క॥ ఆనందరుచిరచనదా। వానల ముసుకిలినూయసహాస్యోపపము, ని ।
జ్ఞానవరనీపి కాపవ । మానము, ఖలజనసమాగమము, దలపోయన్;॥ ౧౦౮
క॥ సాధుహితకృత్యములకున్ । బాధకములఁ బన్ని, ఖలులె ప్రజ్ఞావంతుల్; ।
శ్రీధరమూతె నిపుణము లవ । రాధలనము లేనివారి ప్రాణము దీయన్;॥ ౧౧౦
ఉ॥ కాలభుజంగి నంచె ముఖగహ్వరము దాను గొండె గంప్రేసన్ ।
నాలుగు మోము లున్నదొర, నాలుక కేరిటఁ; గా డటన్న, నుం ।
ద్రాలతెఱం గెఱుంగ నిజనష్టు బవో! యని తిప్పు నాకఁగా, ।
నైళిమ ప్రాణవాయువులఁ బాయుట, యెుగతి సంభవించెడున్? ॥ ౧౧౧
క॥ పలిపితి ఘనకార్యము; ని । ర్మల నుగుణిరత్నయోగ సమూర్తిత పుంప్యోగ్యన్; ।
గలకాలము దీనలు [illegible] । [illegible]! [illegible] ॥ ౧౧౨

మ॥ గోడవర్త్యాఖ్యనియోగివంశజుఁడు నాకుక్ రామదాసుండు సం
గడికాఁడై యిట బోధనాభ్యసనపుంగాలేజి నీయేఁడు, నే
ర్పడర్ నీడను జూచి వ్రాసినతన్వీయాలేఖ్యముక్ నిల్పితిం
బడకింటం; గని మెచ్చవే మతినిశిల్పం బన్నపూర్ణాసతీ॥ ౩౪

శా॥ మాసా లన్నిట శుక్లకృష్ణము లనం బక్షద్వయం బుండు సం
ద్రోసాధ్వీ! యదినిక్కమంచు మది నే నూహింప లే నయ్యెడన్;
నీసాంగత్యము గల్గునాళ్ళ నెల లన్నిక్ శుక్లరాత్రంబు లి
ప్డో సర్వంబును కృష్ణరాత్రములు నా కోయన్నపూర్ణాసతీ॥

శా॥ అయ్యయ్యో! కొనినాళు లుండి వెస రా న ట్లేగఁ బుట్టింటికిన్,
దయ్యం బెత్తుక పోయెనే చెలియ! నిర్దాక్షిణ్యతన్ నిన్నటన్?
కుయ్యో! మొట్టా! యనంగ నాలుమగలన్ జోడుల్ విడం గొట్టిన
కొక్రయ్యం బాపము గొట్టదే? కుడుపదే గో డన్నపూర్ణాసతీ॥ ౩౬

మ॥ చదువన్ వ్రాయను నేర్చి మూన్నెలల దీక్షన్, ప్రేమ నీ వ్రాసిన
ట్టిది జాబేను సువర్ణపత్ర. మని పెట్టెం దాఁచితిం, గాన నేఁ
డది కన్నీటను దద్దయుం దడిపెదన్; హా! యేరి కంపింతు నీ
పెదమైజాక్షలతారుచీరలను? సాధ్వీ! యన్నపూర్ణాసతీ॥ ౩౭

శా॥ కానం గుత్తుక నల్పి పెంటిఁ గొని పోఁగా బోయ, నీడంబునం
దానుం బిల్లయు మేఁత మానుక కపోతం బున్నచందంబునన్,
నేనుం బిడ్డఁడు నింట నుంటి మలఁతన్, ని న్మృత్యి గొంపోవఁగా;
హా! నా కప్పటియున్వరేయే మరల దిక్కెం? యన్నపూర్ణాసతీ॥ ౩౮

మ॥ జడుప్రం. గొల్పుమహాసముద్ర మనుచున్ సంసారముం బల్కెనన్,
బెడఁ గొంఁ గంటికిఁ జాన్ను నీకతన మున్ ఫేనాకృతిన్ నాకు; ని
ప్పుడో విస్ఫూర్జిత ఘోరక్రియోగ్రఫణి రాడ్భోగంబునుం బోలె న
న్నడలం బెట్టును నన్న దయ్య నమరీడ్యా! యన్నపూర్ణాసతీ॥ ౩౯

శా॥ మీరున్ మల్లిక నూరుచుండఁ డనుచున్ చేరిసునన్ గేళికా
గారంబం దిడుపాద మొక్కనిసి వేగన్ వెన్కకుం దీయవే?
యూరే మల్లిక మాని యెంతుఁ గవ నిన్నే; చేర రా వే మరో!
స్వర్గస్త్రీనుతిభామవనస్తనవిలాసా! యన్నపూర్ణాసతీ॥ ౪౦

మ॥ పరమాత్మా! భవదీయశీతలకృపాపాఙ్గానిధానైకశీ
కరమే చాలును మామకోగ్రభవదుఃఖజ్వాల చల్లార్పఁ; జె
చ్చెర నేతెంచినచిన్నచీమకడుపుంజి చ్చార్చి రక్షింపఁ, దుం
పుర గా కేటికిఁ దేనె బానెఁడును శంభూ! భక్తచింతామణీ॥ ౬౦

మ॥ భవనైదాఘదురాపతాపము శమింపం ద్వత్కృపాపారసిం
ధువుతీరంబున భాగ్యవంతులు వసింతుర్! పేద నౌనాకుఁ ద
త్సవిధంబం దిసుమంత నిల్వ వసతిన్ స్వామీ! ప్రసాదింపవే?
భువనాధారుఁడ వేమి నీకుఁ గొదవ? శంభూ! భక్తచింతామణీ ॥ ౬౧

గద్యము.

ఇది యాత్రీయతురీయానంతర
ద్వితీయాకస్త్రిక సంస్థితటస్థ
మనస్వాన్వస్థ్యాంతిరాయ
వడ్డాది సుబ్బారాయ
ప్రణీతము
సతీస్తుతి.

భామినీవిలాస కరుణవిలాసానుబంధము.

సమాప్తము.

## శాం త వి లా స ము.

---

చ॥ గురువిషయాటవీవలయఘోరవిలగ్నదవానలప్రస
త్వరబహుళార్చులన్ వికలభావము నొందిననామనంబు, స
త్వరము చకోరమట్టు లగుతన్, మిళదిందిరమాధురీధురం
ధరకమలామనోహరకనన్ముఖచందిర మండలంబునన్ ॥ ౧

చ॥ జలనిధిసార్వభౌమతనుజానయనాంబురుహావలంబనా!
జ్వలనవిజిత్వరజ్వరజవత్వరభంగురుఁ డైననన్ను శీ
తలునిఁగఁ వేగ సేయఁగదె తండ్రి! జగత్ప్రియరోచనంబు లా
లలితవిభాతసారసదళస్మయహారివిలోచనంబులన్;॥ ౨

ఉ॥ పంచినజాలి నాతపముఁ బాపుమ లోకులకుం దలంచుమా
త్రంబున, విద్యుతుల్ బహుళతంబు లభంగరుచిన్ వెలుంగఁ, జి
త్రం బగునంబుజప్రియసుతాతటకల్పనగావలంబితా
వంబిని, మామకప్రణిపతన్నతి మంబిని గావుతన్ సదా;॥ ౩

చ॥ అలరఁ గళిందశైలతనయాఘునతీరవనాంతరంబు, ప్రా
ణుల కడుగన్ గతాగతతనుశ్రమ మధ్యమునన్, లతాశతం
బలముకొనంగఁ దన్, మధుర హూరుచిఁ గ్రాలుతమాలభూజ మ
గ్గల మగుమామకశ్రమముఁ గ్రిక్కనఁ దా హరియించుఁ గావుతన్॥ ౪

మ॥ భువనవ్రాతముఁ జంద్రికామయసుధాపూరంబునం దన్పుచున్,
త్రివిధం బౌపరితాపమున్ నరులకున్ శీఘ్రంబ చల్లార్చుచున్,
త్రివిషద్బృందసదాభినంద్య మగుచున్, బృందావనం బున్కి గ్గొ
తవుమాత్నాలబు ధరంబుమామకమనోధ్వాంతంబు మాయించుతన్॥ ౫

తే,గీ॥ గ్రీష్మచండాంశుమండలభీష్మకీల । మైనసంసారమున ననయంబు వేఁగు
నట్టినా వేదనను, ప్రావృడంబుదంబు । మాడ్కిఁ జల్లార్చు, వృష్ణికుమారవరుఁడు;॥ ౬

చ॥ విసుఁగు విరామమున్ గనక, వేమఱు దుస్తరసంసృతిన్, మలీ
మసవిషయాటవీవిషమ మార్గమునన్, గమియించుచున్, దగన్
వస మఱునన్నుఁ జేర్చుతను, వారిజబాంధవనందినీతటా
వసథము నందగోపకలపఃఫలబాలతమాల మూడటన్;॥ ౭

ఉ. కోరిక లూరి పొల్పడలికూరిమికూఁతురు, గ్రుచ్చి కౌఁగిటన్
జేరుపఁ, బ్రేంకణంపులతచేఁ బరివేష్టిత మాతమాలభూ
మీరుహముం బలెం, బొలుచు మేచకవర్ణుఁడు దోఁచుఁ గాత మిం
పార, నసుప్రయాణసమయంబున, నాహృదయంబులోపలన్;॥ ౮

క॥ తుందిల మగునానందము । గందోయికిఁ జేయువింతకాదంబిని, నా
డెందముఁ గడు నుడికించెడు । క్రందగు నారాట ముడుపుఁ గాతన్ వేగన్॥ ౯

మ॥ కరమున్ స్వచ్ఛమునై, సుధాఘుటికనై, కన్పట్టునీశాసనా
క్షరముల్, నేఁ గల నైనఁ బాటి సలుపన్; సర్వేశ! గర్వాంధుఁడన్;
శిరసుల్ నాయెడ వేనవే లిటులు నీ వీక్షించి, నన్ స్వీయుఁ గన్
ధరియిం తెందును నిన్నునంటి సదయుల్ నావంటిగొం డ్లుంగురే॥ ౧౦

మ॥ శరధుల్ దాఁటుము; ప్రాఁకు మేరుశిరముల్; స్వర్లోకపాతాళముల్
చొరు; మూర్ఖా! భవదాశ తగ్గ దది పోచ్చున్; వ్యాధు లాధుల్ నినున్
బరిపీడింపక యుండ, నిత్యసుఖమున్ వాంఛించితేఁ, గొమ్ము చె
చ్చెర శ్రీకృష్ణరసాయనం బితరసంసేవల్ వృథాయాసముల్;॥ ౧౧

చ॥ భవ మనుపాడునూతఁ బడి, బాముల నొందెడునన్ను నీగతిన్
దవునై యుపేక్ష సేయఁ? గరుణావరుణాలయ! శౌరి! తొల్లి నీ
వవల మొరల్ప వెట్టు లకటా! ప్రకటాఘుని బింగళాఖ్యనా
రవనితి, దుష్టవర్తుని భ్రష్టు నజామిళభూసురబ్రువున్॥ ౧౨

ఉ॥ దిక్కనిపాలు గ్రోలితి; భుజించితి మందినవాతుఁజక్కెరన్;
మెక్కితి పక్వగోస్తనుల; మింట సుధం జవిగొంటి; పంటిపో
నొక్కితి రంభకంపెదవి; శౌరి కొకండును. గృష్ణ యన్నగం
డక్కరముల్ బలెన్ మధురమా? పలుబాములఁ బడ్డజీవమా!॥ ౧౩

మ॥ భవదీర్ఘామయసిద్ధభేషజము, పాపగ్రావదంభోళి, సం
భవదజ్ఞానవిభావరీతిమిరభాస్వన్మండలం బుగ్రదం
చవిధక్లేశపలాశదావశిఖి, కృష్ణా యన్నవర్ణద్వయం
బవురా! యీనుడి ముక్త్యగారమునకున్ ద్వారంబు నా కండలున్;। ౧౪

ఉ॥ నే వినిపించెదన్, హితము నీ కిది; డెందమ! యేలమాంద్య
దావనిఁ గామకోందోకఘనాఘనకాయుని యాయు కొన్నదెంబు
బోవకు; చారుతామృతముపూరము జాలువడ్డిపింఛునన్,
తే వలపించి నిన్నతఁడు, నీప్రియుఁడుగమునున్ మొత్తింపడుమా॥ ౧౫

ఉ॥ నెమ్మది నాటి యెయ్యది యనిర్వచనీయసుఖం బొసంగుఁ, గం
ఠమ్మున లగ్నమై యెది యడంచును లోనితమస్సు, దేనిచే
పమ్మధుగోస్తనీక్షుపనసాదులు నొచ్చెడు, నట్టికృష్ణనా
మమ్ము భజింపుమా రసన! మాటికి, నీవు రసజ్ఞవైనచోన్॥ ౧౬

చ॥ ఇల నవ్యరూపపుంబులుఁగు లెన్నియొ యున్నవి గాని, వానిలో
యిలవలె వానిలోపల మదేదియుఁ గాదు ప్రియంబు నాకుఁ; గ
న్నులఁ బడునంతనే తనయనుంగుఁమనంబది తోఁపఁ జేయుటన్,
నిలఁబడుఁ గృష్ణనామక మనిర్వచనీయము బ్రహ్మ మాత్మలోన్॥ ౧౭

శా॥ క్రాలున్ విశ్వము సర్వ మెవ్వనినివిస్వగ్రీదియానాథచే,
నాలంబంబు నిగూఢ మేపరుఁ దమామ్నాన్ తెల్పి కవ్యస్తుతిన్
గాలింతుర్ పెక్కుకోటులన్, స్వహృదయధ్యానానువృత్తిన్; గడా!
వాశ్యాశాధిపుఁడు జాలఁ డీజనులయన్యాయంబు సైరింపఁగన్॥ ౧౮

చ॥ కొలువఁ దలంచితే మనస! కొల్వుము కోరిక దీఱ శ్రీపతిన్;
దలఁపఁ దలంచితే నెపుడుఁ జాలిమి మీఱఁ దలంపు మాధవున్;
బలుకఁ దలంచితేఁ దెలిసి పల్కుము పన్నగశాయిగాథలన్;
వలసిన నిద్ర, భద్రసుఖవాసమునన్ నిదురింపు హాయిగా॥ ౧౯

మ॥ భవనైదాఘదురాపతాపమున కోపన్ లేక యూపన్నులై
తవులం బొనవివేకశృంఖల బలాత్కారంబునం గ్రుంచి, సం
భవనైరాశ్యసుశీతలప్రవిమలాత్మధ్యానడిండీరదు
న్యవగాహం బొనరింత్రు కల్మషసమూహధ్వంసకుల్ సజ్జనుల్॥ ౨౦

చ॥ క్రతుముఖకష్టపాశములు గాఁ బొనరింతురు బంధముక్తికై;
స్మృతిశతచింతనంబు గడ చేయుదు రంతరశాంతి కిద్రదు
ష్కృతిజలరాశిపారమును జేరఁ గదా యది మున్గ చంద్రుఁ; సం
స్మృతిని బరిభ్రమించె మనశరీరుల కీయఖిలంబు మాయయే॥ ౨౧

తే॥గీ॥ చరణములు ముంచు ముగ్గాడి, జంఘికలును, । జాను లూరుల నాఁగ విశాలవక్ష
మవల నక్కునఁ జేర్చి, నాయంతరాత్మ । హరిముఖాంబోజరుచి నోలలాడుఁగాత॥

తే॥గీ॥ మలయపవమానమున హాలాహలమునందుఁ, । వరుణిబ్రీలాదుబుధ నల్లత్రాఁచునందు,
శ్వపచునందును గేసిజ్ఞానియందుఁ, । బోడిముదితో మభేదపరమాత్మబుద్ధి నాకు॥ ౨౩

క॥ జగమే సర్వము నశ్వర। మగు భంగుర మంతకంటె నంగము; కట్టా?
మిగుల శ్రమపడెద రవ్విధ। మగుదానికి జను లి దేమియవివేకంబో?॥ ౨౪

క॥ దినదినమును మృత్యుముఖం। బునఁ జొచ్చెడునెల్లమానవులఁ గనుఁగొనుచున్
మనము విరమింప దిప్పటి। కిని దా విషయములవలనఁ గించి త్తైరన్॥ ౨౫

తే.గీ॥ పాయనీ రాజ్యలక్ష్మి, కృపాణధార। లట్టె పయిపయిఁ బడనీ, భయంకరముగఁ
దల యముఁడు దీయనీ; సుంత ధర్మపథము। దప్ప కుండెడుఁగాత డెందంబు నాది॥

క॥ పగవాఁడు నెత్తిమీఁదను। బగబగ మండింపఁ గాక పావకు, నపిచేఁ
దెగఁ గోయుఁ గాక కాయము, । తగ వెడలిరపలుకు నేఁ బదర లేశంబున్॥ ౨౬

క॥ తరణోపాయము నాకుం। దొరకద యని యేల పొగిలెదుర? జీవుఁడ! నీ
స్మరణంబున నెన్నఁడు నుం। దరనందకుమారునాననము దగులదొకో?॥ ౨౭

ఉ॥మాకు నిమేషమున్ వలదు, మాద్యదనేకపదానమత్తభృం
గీకలఝంక్రియారుచిరఖేలనహృద్యము లైనసంపదల్;
కైకొనువారి నెల్ల నవి గన్నులు గప్పి, రమామనోహర
శ్రీకరపాదయుగ్మసరసీరుహసేవకు దవ్వ సేసెడున్;॥ ౨౮

తే.గీ.॥ముగిసెఁ బ్రాయము; మృత్యువు మొగిసె; నకట!।యూట లే కిప్పుడా నిద్ర?హా రిజీన!
గ్గెనఁ గొవ వేమి? నిమకింపు మాద మఱచి;। కడనె యున్నది తల్లిగంగాభవాని;॥

క॥ ధారుణి నిట్టటుఁ బఱచుచు। నారాటంపడుప నేఁటి కంతఃకరణం
బారూఢుఁ డెప్పుడు నందకు। మారకపరమప్రభుండు మచ్చితమందున్;॥ ౩౦

చ॥ మనస! నను, మనోభవవిమర్దనపాదసరోజయుగ్మపూ
జన మతిభక్తి సంతతము సల్పెడువానిని, నాజవంజవం
బను పెనుగర్తమందు నకటా! పడఁ ద్రోసెద వింతమాత్రచేఁ
దనయవియోగదుఃఖశిఖితాపము నీకును గాక పోదు సూ; ౩౨

క॥ మరకతమణిభూధరమో, । తరుణతరం బగుతమాలతరువో యనుచున్,
బొరసిరి శంకను మునివరు। జరు లనలోకించి రామచంద్రుని దొలన్;॥ ౩౩

చ॥ ఇది యమునాతరంగిణి యొ? యెట్లది తోయమయస్వరూప యౌఁ
గద; యిది పన్నగాతలుకొ? కా దది మాఘురిఁ గాంచు నెట్టు లం
చెదలను సంశయంబు జనియింపక యుండెడు నేరి కాదియం
దుదితకుతూహలంబున రఘూద్వహు నెమ్మెయిచాయఁ జూచుచో ?॥ ౩౪

ఆ॥ వె॥ మేఘములవలెఁ జాయ మెఱుఁగు దీఁగ నాయె, గాత్రినిఁ బాంసునకును బాయుఁ బుష్పలతయు
యని తలంచి, పిదప హాసమానుఁ డౌటఁగ నీ యోగినిగను నిడువ యూరుపులను॥

ఉ॥ సంపద నీచగేహములఁ; సద్ద్విజులిండుల లేమిగోల; పు
ణ్యాంపుజనుల్ గతాయులు; చిరాయులు పాపులు; నీయనీతి వీ
క్షింప మహోగ్రకోపశిఖికీలలు పర్వెడు; నైన నేను గా
వింపను నిన్ను? దీనుఁడను; విశ్వవిభుండవు నీవు; శంకరా!॥ ౩౬

## కృత్యంతమున జగన్నాథునిస్వోత్కర్షము.

మ॥ అమరాగారవనంబుఁ దొట్టి మలయాహార్యావృతాంభోధిభూ
లముదాఁకం గలకావ్యకల్పనచణుల్! శంకింప కీ రానటిం
డి; మదన్యుం డెవఁడు గోస్తనీరసధునీనిస్సీమమాధుర్యసా
ర్యమృదూక్తిప్రభుతాపదానుభవధన్యత్వంబు వాఁ డుండునే? ౩౭

ఉ॥ వీనులఁ దా సుధానుగము వేనవగోరస మాని వాణి, చేఁ
బూనినవీణతంత్రుచయముం బలికింపఁ దలంప మానుఁ, ద
ద్ధ్యానతిపండితేశుశ్రుతిభూషణభాషణ మాలకింప, నా
వ్యానిశిరంబు కంపిలదు, వాఁడు ద్విసాత్పశు పెద్దమొద్దగున్ ౩౮

ఉ॥ తేనెయుఁ ద్రాక్షపండు సుధ స్త్రీయధరామృతమో మొ[illegible], నా
ధైన ముఖంబుఁ దార్చనిది యైనను, బండితరాజువాణి యే
మానిని కీదు మోద మలమంధుఁడు ప్రాణము బొంది యుండెఁగా,
బీనుఁగు నిశ్చయంబుగను బీనుఁగు పీనుఁగు పీనుఁగే సుమీ॥ ౩౯

మ॥ కమియుం బండి స్రవించుద్రాక్షరసపుంగర్వంబు వాపన్ సమ
ర్థము లౌవాక్కులఁ, గావ్యకల్పన మొనర్పన్ నీవు నే దక్షప
క్షమునన్, జెప్పఁగ దాని మాప్పళసమత్కంబంకు; లేదున్న డెం
దమునందుండి వెలార్పఁ బోదు మది, మిత్రా! త్వత్కృతాధ్రుక్రియన్॥ ౪౦

ఉ॥ నాకవితాకుమారి! వదనమ్మును వాంచకువమ్మ, నిన్నుఁ బ
ట్టాకి నిరాకరించు నని; కాలును వాఁ డటు లోర్వ లేఁ; డీ
కాకథ యేల? కావ్యకమలాంతరసీధుఘునీమధుప్రపా
నీకము మాములం జెలఁగి నిత్యము కృత్యము నీ వొనర్పవే!॥ ౪౧

మ॥ పరవాక్యానునపత్తమం దనిశముల్ వాచంయముల్ పండితుల్;
ధరణీశుల్ కమలావిలాసమదిరాతాంద్రామదాఘూర్ణితుల్;
స్మరపీడాలసనౌరయోషిదధరస్వారస్యధిక్కారి మ
ద్వరవాణీపరిపాక మేరసికుజిహ్వల్ సల్పు లాస్యం బిలన్? ౪౨

క॥ ద్రాక్షేక్షుక్షీరసుధా । మాక్షికములనిరుపమానమధురిమలుకు, దా
మీక్షితిఁ బండితరాజవ । చోక్షురమాధురి కహా! జోహా రొనరించుక్, ౪౩

శా॥ జల్లించెం గడవెళ్ళ శాస్త్రిములు; నిష్ఠల్ సల్పె నిత్యక్రియల్;
డిల్లీవల్లభపాణిపల్లవమునన్ లేఁ బ్రాయ ముంచెన్; గడున్
దుల్లన్ వాసన లియ్యదన్ మధురయందుం గొల్చు గోవిందు; హా
యుల్లోకంబుగఁ జేసెఁ బండితసమూహోత్తంసుఁ డన్నింటినిన్ ;॥ ౪౪

క॥ లంజలకొడుకులు హరియిం । పం జూతురు మామకీనపద్యపుమణు లం
చుం జనియించిన శంకన్ । మంజూషను దీనిఁ జేసినాఁడంజాండీ॥ ౪౫

శా॥ కబ్బం బుల్లదు; నైన నాకురచనోగ్రవ్యాఘ్రదంష్ట్రాళి కే
నబ్బబ్బా! కవితాలతాంగి నెర సేయం జాల; నానాటికిం
జబ్బంజాలఁగ గోరసాదు విడుకొంచుం బెంచి, యబ్బాలచే
నుబ్బింతున్ రసికాంతరంగముల; బి ట్టూరింతు విద్వాంసులన్;
సుబ్బారాయఁడ; మేఘవేణిసుమనన్స్వాద్యాదు లస్మత్కృతుల్;॥

ఇది యాఱువేలపంశాభ్యుదితుండు

ఐ. సు. రాయంశాంధ్రమొన

రించినయట్టిది భామినీ

వి లా స నిగదితము

తుశాంతనామ

క వి లా స

ముగన్

శ్రీరస్తు.

# కిరాతార్జునీయము

ఇది

గోపాలుని-సింగయకవిచే

సంస్కృతమునుండి

యాంధ్రీకృతము.

చెన్నపురి:

శ్రీ వైజయంతీ ముద్రాశాలలో

ముద్రితంబును బ్రకటితంబును.

1908.

 [వెల 12 అణాలు.

శ్రీరస్తు.

# కిరాతార్జునీయము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీరామామణియంకమందలరఁగాఁ ♦ జెల్వొందు పక్షస్థలిన్
సారశ్రీకుచలిప్తకుంకుమవిరా ♦ జత్కౌస్తుభం బొప్పఁగాఁ
గారుణ్యామృతపానమత్తనిజభ ♦ క్తవ్రాతము ల్గొల్వఁగా
నారూఢింగరుడాద్రినుండు నరసిం ♦ హస్వామిఁ గీర్తించెదన్. ౧.

సీ. అఖిలలోకాలోక ♦ నానందకరములౌ, కరములు నాఁగటా ♦ క్షములు వెలయ
నంతరపరిదృశ్య ♦ మైనట్టికందు నాఁ, జెలువైన కస్తూరి ♦ తిలక మమర
నిర్నిద్రధవళిమో ♦ న్నిద్రచంద్రిక నాఁగ, దరహాసవిస్ఫూర్తి ♦ దనరుచుండ
వరసుధారసము ♦ త్కరవిస్ఫురద్ఘోష, ధళ్యంబు నాఁ జిగి ♦ దలఁకుచుండ
పలుకులం పూర్ణశశిమాడ్కి ♦ వదన మొప్ప, హరినిజకామినీవృక్ష ♦ కోరకప్తి
గొబ్బలఁ జేయు మనోభవ ♦ గిరి వసించి, చెలఁగు దేవుండు కృతిసాగఁ ♦ జేయుఁగాత.

ఉ. చల్లని పుట్టినిండ్లు గల ♦ చానలు రంబున మేనమామునం
దల్లపు పుష్పసించికడు ♦ నింపులు గుల్కఁగఁ బ్రేమమీఱను
త్ఫుల్లమనోజ్ఞతన్ బ్రకట ♦ మూర్తియునై సగమైవిలీనమై
తెల్లమినుండు మూర్తులను ♦ దీర్ఘసహోనుతి యింతు మువ్వురన్. ౨.

సీ. వ్యాసవాల్మీకిసం ♦ యమివరప్రోక్తమౌ, గ్రథితతాత్పర్యసం ♦ దీప్యమాన
సకలేతిహాసశా ♦ స్త్రపురాణసంగుపి, స్ఫూర్తితాన్వయనము ♦ ద్భూతరాజి
తాత్త్వికవిగ్రహ ♦ వ్యాప్తినిర్మలతార, గాంబుదహీరనీ ♦ హారభూధ్ర
గంగాజటాజూట ♦ కైలాసతారకా, నిశాధినాథస ♦ న్నిభయశంబు
కరణి నెమ్మేని నత్కాంతి ♦ నలరుచుండ, పద్మభూముఖాంభోజమాత్మని ♦ వాసముగను
వెలయు జగదంబ శారద ♦ వేడ్కతోన, భీష్టసంసిద్ధిమత్కృతి ♦ కిచ్చుఁగాత. ౩.

సీ. తాటంకమణిగణ ♦ ధగధగరోచులు, గండభాగములపైఁ ♦ గాండవింప
దరహాససంజాత ♦ ధళధళదీప్తులు, కౌముదీకాంతులఁ ♦ గ్రమ్ముచుండ

నిరుపమమధురోష్ఠ ♦ నిగనిగాయతరుచుల్, విద్రుమద్యుతులను ♦ నీఁగనొత్త
సలలితాలకసాంద్ర ♦ చకచకదీధితుల్, హరినీలయులఁ జిగిఁ ♦ బరిభవింప
విధుఁడుదనమీఁదఁగలమూర్తి ♦ వెలయుఁజేయు, కరణి నెప్పుడుసానియుం ♦ గనుచునిల్చి
సిరులు వెలయంగ భక్తుల ♦ నరయుచుండు, కలిమిచూపులసిరిభామఁ ♦ దలఁతుఁ బ్రేమ. ౫.

సీ. వెలుఁగొప్పు కైలాస ♦ శిఖరభాగంబున, నిర్మలమణిమయ ♦ ప్రాస్థ్యమునను
విలసితశశికాంత ♦ వేదిపై నొకలక్ష్యం, గారంబుమీఱఁగా ♦ గారవమున
సురసిద్ధసాధ్యకి ♦ న్నరయూనిగంధర్వ, పరులును బ్రమథులు ♦ పరఁగఁగొల్వ
మేఘంబుమీఁదిక్రొ ♦ మ్మించుతేజంబునా, భూమజాద్యుతి మీఱఁ ♦ బొల్పుమీఱ
నిండుగొల్వుండి కన్నుల ♦ పండువుగను, నచ్చరలయాటపాటల ♦ నలరుచుండు
మంచుమలపట్టిహరుఁడును ♦ న్నించు రాణి, పార్వతీదేవి కతిభక్తిఁ ♦ బ్రణతిసేతు.

చ. ఘలుఘలుమంచుఁ బాదకట ♦ కంబులు మ్రోయుచుఁ దాళమానముల్
దెలుపఁగ గండసాళికలఁ ♦ ద్రిమ్మరుచుండుమదాళిఝంకృతుల్
తెలియఁగ గానసౌష్ఠవము ♦ శ్రీకరమొప్పఁగఁ బాదపుష్టనల్
వెలయుమృదంగనాదముల ♦ పెక్కఁజెలంగఁగ మత్తబంధురం
దెలమినటించుచుండెడుగ ♦ ణేశుని భక్తిని మ్రొక్కి కొల్చెదన్. ౭.

క. వల్మీకజనితసుచరితుఁ, గల్మషవిరహితుని నాది ♦ కావ్యవిరచితున్
వాల్మీకి భక్తిఁ గొల్చెదఁ, గేల్మోడ్చుచు మ్రొక్కి వినయ ♦ శీలితమతినై. ౮.

క. భూసురకులసంజనితుని, భాసురనిగమార్థవేదిఁ ♦ బరతత్త్వజ్ఞున్
వాసిష్ఠపౌత్రు వేద, వ్యాసుని మదిఁగొల్చి భక్తి ♦ వర్ణన సేతున్. ౯.

క. ద్వాదశనామస్కంధో, త్పాదితభాగవతదివ్య ♦ తరుశాఖలపై
వేదార్థమె నిశ్చయమని, వాదించుశుకాఖ్యమౌని ♦ వలగొని కొల్తున్. ౧౦.

తే. అరయ గీర్వాణకవివర్య ♦ లైనవారిఁ, దాసభవభూతిమాఘుల ♦ భారవిమురారి
దండిబాణాదులైనట్టి ♦ దండికవులఁ, దలఁచికీర్తించి మఱియుసం ♦ తసము నొంది. ౧౧.

తే. శబ్దశాసనబిరుదుచే ♦ జగతిమీఁదఁ, బ్రౌఢిఁగాంచిన నన్నయ ♦ భట్టుఁగొల్చి
సోమయాజిని గీర్తించి ♦ సుస్థిరముగ, భాస్కరాహ్వయు మదిలోనఁ ♦ బ్రస్తుతించి.

ఆ. పరమభాగవతుని ♦ బమ్మెరపోతన, నాత్మలోపలఁ గొని ♦ యాదిమఱియు
నంధ్రకృతులకర్త ♦ లైనట్టిసుకవుల, మనసులోఁ దలఁచి న ♦ మస్కరించి. ౧౩.

క. భారవిభట్టు రచించిన, భారవియను కావ్యమవనిఁ ♦ బ్రఖ్యాతిగ నే
నారూఢిని దెనిఁగించెద, ధారుణి నాచంద్రనిత్య ♦ తారార్కముగాన్. ౧౪.

చ. లోఁడితెడుపాట్లకై యొరుల ♦ లుబ్ధత నెప్పుడుఁ గొల్చియున్న యా
జడమతి యంతయుం దొలఁగ ♦ జన్మమునన్ మఱి యన్యవాయమున్
బుడమిఁ బవిత్రమై వెలయ ♦ భూరిశుభంబుల నెల్లఁ బొందఁగా
గడఁగి యహేలాబలేశునకుఁ ♦ గట్టుదు నీకృతి నేను బట్టమున్. ౧౫.

క. పంచాంబకజనకునకును, బంచాయుధధారునకును ♦ బలిసుతకరటీ
పంచాననవిక్రమునకుఁ, బంచాననసన్నుతునకును ♦ బరమాత్మునకున్. ౧౬.

క. శరనిధినిమగ్ననిగమో, ద్ధరణునకును మందరాద్రి ♦ ధారునకును భూ
భరణునకుఁ గనకకశ్యప, హరణునకును నిఖిలస్థైర ♦ తారాగ్ర్యునకున్. ౧౭.

క. వటువేషధారునకుఁ బ్ర, స్ఫుటతరసత్క్షత్త్రియోఘ ♦ భూరుహహానో
ద్భటపరశుధారణునకును, బటుతరహలధారునకును ♦ బలధీరునకున్. ౧౮.

క. దశకంఠకంఠలుంఠన, దశరథవరనందనునకు ♦ దాశార్హునకున్
నిశితాసిదళితవరపా, రశికాద్యుతభావికల్కి ♦ రూపాత్మునకున్. ౧౯.

క. శ్రీస్తనకుంకుమచిహ్నిత, కౌస్తుభవక్షునకు వికచ ♦ కంజాక్షునకున్
దుస్తరఖలశిక్షునకును, బ్రస్తుతయోగీంద్రదక్ష ♦ పరిరక్షునకున్. ౨౦.

వ. సమర్పితంబుగా నారచియింపం బూనిన కిరాతార్జునీయం బను మహాకావ్యంబునకుం
గథాక్రమం బెట్టి దనిన. ౨౧.

శా. శ్రీరంజిల్లువిచిత్రభూరుహలతా ♦ శ్రేణీసమాకీర్ణమై
శారీకీరమయూరకోకిలకుల ♦ శ్రావ్యస్ఫుటారావమై
సారాబ్జాసవమత్తభృంగవిలస ♦ ఝ్ఝంకారకాసారమై
మీఱుం ద్వైతవనంబు మౌనినిస ♦ న్మిత్రోజ్జ్వలావాసమై. ౨౨.

క. అమ్మహితవనమునం దన, తమ్ములు సతి గొల్వ నుండు ♦ ధర్మతనూజుం
డమ్మహి దుర్యోధనునకు, నమ్మతి జూదమున నోడి ♦ సమయము కొలఁదిన్. ౨౩.

క. అతఁ డొక్కనాఁడు తమ్ములు, హితులును దను బలసి కొలువ ♦ నెలమి దలిర్పన్
జతురతరవచనరచనలఁ, గుతుకము మీఱంగ నిండు ♦ కొలువుండుతఱిన్. ౨౪.

ఉ. శ్రీయును రాజ్యపాలనముఁ ♦ జిత్తనివృత్తిజనానురాగముం
బాయనియాసుయోధనుని ♦ పాలికి మున్నరహస్యవృత్తిమైఁ
బోయి యెఱింగి రమ్మనుచుఁ ♦ బూనికఁ బంపవనేచరుండు దా
నాయెడ కేగి యాత్మ నది ♦ యంతయు నాగసివచ్చి గ్రమ్మఱన్. ౨౫.

క. ఈరీతినీతిపద్ధతి, వారకపాలించిభూమి ♦ వశముగఁజేయం
గోరుటభయపడుటయుఁగా, కారయఁబౌరుషమువిధమె ♦ యనియందేనిన్. 33.

మ. అరిషడ్వర్గముముందెగెల్చిజనమా ♦ ర్గాగమ్యమైనట్టియా
పరమన్యాదులపద్ధతిన్నడపఁగా ♦ వాంఛించితారేవగల్
వెరవున్ గార్యవిభాగపౌరుషములున్ ♦ విఖ్యాతమానట్లుగాఁ
బరఁగంజేయుదుజాగరూకుఁడగుచున్ ♦ బాలించెదున్ భూవరా. 3౪.

వ. అని మఱియును బ్రజాపాలనవిధంబును, ద్రివర్గోపాయవ్యాపారంబును, బలపరాక్రమ
సంపత్తియు నెఱింగించువాఁడై యిట్లనియె. 3౫.

చ. కొలిచినభృత్యకోటినను ♦ కూలతవొప్పెడుమిత్రులట్లుమి
త్రులమఱిబంధువర్గముల ♦ తోసరిగాఁగనుబంధుజాలమున్
విలయుఁగృతాధిపత్యమున ♦ నిగ్రహమైతినుఁబోలెసాదరం
బలరగత్నయుండగుదు ♦ నారయులెన్నగసంతతంబునున్. 3౬.

తే. అలరుధర్మార్థకామంబు ♦ లనుత్రివర్గ, మతఁడుసమశక్తివిభజించి ♦ యరయునట్టి
గుణవిశేషతసఖ్యంబుఁ ♦ గోరిచేసి, నట్టులనొక్కొన్యమునుగూడి ♦ యలగునధిప. 3౭.

ఉ. సామముదానవర్జముగ ♦ నల్పుటలేదలభూరిదానమున్
దామఱిసత్క్రియావిరహి ♦ తంబుగఁజేయఁడుసద్గుణాంచితం
బౌమహనీయసత్క్రియయు ♦ నర్థము మెఱుంగకసేయఁడెన్నఁడో
సామిసుయోధనుండతని ♦ జాగ్రతయేమునివిన్నవించెదన్. 3౮.

మ. ధనకాంక్షన్మఱికోపకారణమునన్ ♦ దండింపఁడెవ్వారినిన్
దనరాజోచితనీతిమార్గమునశా ♦ స్త్రజ్ఞుండుబోధించిన
ట్లనయంబున్మఱిసూనుఁడేనియుఁబరుం ♦ డైనేనియుందుర్నయం
బునవర్తించినదండనంబుసలుపున్ ♦ భూమీశనిర్లోభతన్. 3౯.

సీ. పరరాజులకుమది ♦ భయమందియొంటయుఁ, బరభేదనప్రౌఢిఁ ♦ బరఁగుగూఢ
చారులపకలచే ♦ శమలంగునియమించి, పరులకుఁదాభయ ♦ పడుటగాన
రాకుండునట్టిని ♦ రాకారమునునుండి, పరరాజులోపలి ♦ వారినెల్ల
వసులఁగాఁజేసియు ♦ వ్వారిలోవారెయొం, డొరువులభేదింప ♦ నొనరఁజేసి
చారులంపుసనులు ♦ పసలంబుగానెగించి, వచ్చినపుడేవలయు ♦ వస్తువిచ్చి
మెచ్చిజనులఁబతన్ను ♦ మేలుమేలుకృతజ్ఞుఁ, డనఁబొగడ్తమెలఁగు ♦ నతఁడుయోగ్యుఁడు.

తంబైనది గాదె! అదియునుంగాక సభాసదులైన జనులు కథాప్రసంగంబుల మిమ్ముం జేర్కొనిన విని యాఖండలసూనువిక్రమంబు మనంబునం దలంచుకొని విషవైద్య మంత్రిపసంబునం దోఁచు వైనతేయపాదవిక్షేపానుస్మృతం బగు దుష్టోరగంబుచందంబున నతసుఖుం డగుచు మనఃపరిపీడితుండై మీ మీఁదఁ గపటంబు సేయ నుద్యోగించుచుండు; నట్లుగావున మీరును నా దుర్యోధనునిమీఁదం జేయవలయు ప్రతిక్రియ శీఘ్రంబునం జేయం దగుం గాని యితరంబు గాదు. నా యెఱింగినయంతయును దేవరకెఱింగించితి. ఇటమీఁదటి కర్తవ్యంబు మీరె యెఱుంగుదురు. మా చేయు ప్రయోజనం బింతియకాదే యనిన విని ధర్మనందనుండు సముచితసత్కారంబున బహూకరించి నిజనివాసంబునకుం బొమ్మని యాజ్ఞాపించిన నవ్వనేచరుండును సాష్టాంగవినతుండై నిజనికేతనంబున కరుగ. ఆ ధర్మసూనుండును గొలువునీడ్కొని యనుజసమేతంబుగా ద్రౌపదిమందిరంబునకుం జని తద్వృత్తాంతం బంతయు వివరించిన. ౪౮.

క. ఆపల్కులువినియప్పుడు, ద్రౌపదితనపాట్లుదలఁచి ♦ తాఘూర్ణనంగా
సూపకకోపోద్యోగో, ద్దీపకముగఁబల్కె నాయు ♦ ధిష్ఠిరుతోడన్. ౪౯.

మ. అనఘా మీరునయజ్ఞులైననిపుడే ♦ నాత్మన్ విచారించి ప
ల్కినపల్కుల్ పరికించి చూడమిముసా ♦ క్షేపించినట్లుండున
ట్లనియున్నన్ సమయాపహాంబులగునా ♦ యాత్మవ్యథల్ పల్కఁగా
ననుఁబ్రేరేచెడిఁ జిత్తగింపుఁడుమదిన్ ♦ నామీఁదఁగోపింపకన్. ౫౦.

మ. చిరకాలంబుననుండితాపకముల ♦ శ్రేష్ఠుల్ మహేంద్రోపముల్
భరతాదుల్ తగ నేలుభూమిఁ గుడుపం ♦ బాలయ్యె నీచేత నేఁ
డరయం గామదగంధసింధురముచా ♦ నాస్త్రీయహస్తంబుచే
ధరియింపంగనలేకనీడుసుమనో ♦ దామంబు చందంబునన్. ౫౧.

వ. అది యెట్లంటేనిం జెప్పెద నాకర్ణింపుము. ౫౨.

శా. మాయోపాయులతోడ నెవ్వరలలో ♦ మాయల్ తగం జేయరో
యాయజ్ఞానులచేఁబరాభవము ప్రా ♦ ప్యంబౌన దెట్లున్న నా
మాయాశీలురు మాయవాదులునవ ♦ ర్మష్ఠంబులోనంగము
ల్దాయం గాల్చెడువాఁడిబాణములచే ♦ లంగూర్మునుర్వీశ్వరా. ౫౩.

క. కావునఁగపటాత్ములయెడ, నేవింతయుఁగపటబుద్ధి ♦ నరపనికితనన్
నీవలనమాని నిటునలెఁ, దాపల మైయామపష్ఠ ♦ పలకొనియున్నపా. ౫౪.

శా. కాకున్నన్ స్వకులాభిమానులనుర ♦ క్షస్థైర్యసాహాయ్యశా
భూకాంతుల్మఱినీవు నక్కునితఁగల్ ♦ బుద్ధిన్విచారించినన్
శ్రీకాంతన్ బెఱవారిచేతనుగుల ♦ స్త్రీఁబోలెఁగోల్పోవుదే
లోకంబందుఁగులాభిమానము యశో ♦ లోపంబునుం గాన్పవే. ౫౫.

వ. అని మఱియును గోపం బుత్కటంబు గాఁ జేయఁ దలంచి యిట్లనియె. ౫౬.

క. భూరమణ యిపుడు కోపము, ధీరులు నిందింపనట్టి ♦ తెఱువునఁ బూని
న్నేరీతిఁ గాల్పకున్నది, నీరము గుజ్జమ్ము చెట్టు ♦ నిప్పుం బోలెన్. ౫౭.

క. అంతశ్శత్రువు కోపము, చింతింపఁగ నిపరీత్య ♦ నుంచితి నన్నన్
గాంతేయాగ్రజ వినుమిపు, డెంతయు వివరించి చూడ ♦ నిష్ఠురలోకన్. ౫౮.

మ. ఫలితక్రోధియు నాపదాఘ్నుఁడు నవం ♦ బ్రఖ్యాతుఁడౌ వానికిన్
వలనొప్పం దమయంతఁ దా మెపనులై ♦ వర్తింతురీలోకులుం
దలపం గోపములేని వాఁడు హితుఁడై ♦ నన్ ద్వేషుఁడైనన్ ఫ్రశా
ఫలమున్ లేదు భయంబుఁ జెందదు గణిం ♦ పన్ మానవానీశ్వరా. ౫౯.

వ. అదియునుం గాక. ౬౦.

మ. క్రమమొప్పంగ మహారథుండు నులస ♦ ద్రథ్యాంగరాగోచితో
రుమహారథ్యుఁడు భీముఁ డిట్లు పదచా ♦ రుండై మహారణ్యదే
శములన్ రేణువికీర్ణదేహుఁడగుచున్ ♦ సంచారముల్సేయుఁ గా
నమరం జూచి తపింపదే మనసు స ♦ త్యవ్రతుండవో నీకిటన్. ౬౧.

చ. ఒనరఁగ వాసవప్రాపమితుఁ ♦ డుత్తరపున్ గుణభూమి లోన్నిఁ దిం
డనమున గెల్చి నీకలధ ♦ నంబులు దెచ్చిన యీ ధనంజయుం
డెనయఁగ వల్కలాంబరము ♦ లీగతిఁ దాల్చి చరింపఁ గాఁగనుం
గొని యిపుడెట్లు నీమదిని ♦ గోపము పుట్టదు పాండవాగ్రజా. ౬౨.

చ. అడవుల నేలపాల్పఁగతి ♦ నాకృతులై కుచులెల్ల చిందఁగాఁ
బొడవగు పర్వతంబులను ♦ బుట్టుగజంబుల లీలఁ జూపినన్
వ్పెడు సహదేవు నిన్నకులుఁ ♦ బ్రీతిఁ గనుంగొని యెట్లు నీమదిన్
బొడమదు ఖేదమానియము ♦ బుద్ధియు పీడ శోకింతయుంగట్టా. ౬౩.

వ. అని పల్కి వెండియు నా ద్రుపదరాజనందన యతినియమ్మున్ దుర్గశ్రుతాటింపఁ దలఁచి
యిట్లనియె. ౬౪.

క. ఎటువంటిదో నీమదియును, ఎట్టటువోయెనీయవస్థఁ ♦ గన్గొనమదిసం
కటపడెడు నాకుపహాస్యము, కటకటనుతిచిత్రగతులు ♦ కడుచిత్రములౌ. ౧౫.

సీ. వెండియునిను మున్ను ♦ విప్రభోజనవేళ, రాజితరాజాజ్ఞ ♦ భోజనమున
రమణీ సమాకారి ♦ రము నేఁడువన్యథ, లాహారములకుఁబో ♦ తౌ మనిపుడు
స్త్రీశోభనాడెమి ♦ కేళీకార్య మొందదు, రత్నపీఠస్థమై ♦ రాజమౌళి
సుమమాలికాపరా ♦ గమునఁదోఁగెడుపాద, యుగళంబునద్విజ ♦ మృగవిలాస
బహ్మాణాటవిఁజరియింపఁ ♦ బాలుపడియెఁ, గలితసుమశయ్యమాగధ ♦ గానములను
మేలుకొనునిద్ర నేఁడున్న ♦ గాలరవము, వలనఁగుశశయ్య మేల్కాన ♦ వలసెనకట.

ఆ. అఖిలపృథ్విను ♦ నాపదయొక్కటే, తలఁచిచూడనింత ♦ తప్ప మొంగు
నిపుడునంసులోన ♦ నేటికినీవిట్లు, పరితపించెదనుచుఁ ♦ బలికె దేని. ౧౬.

మ. వినురాజోత్తమయీయవస్థ మత్తివి ♦ దేవప్రభూతంబుగా
వునవాచిత్తము తెల్లగించినతుల ♦ నోవందించుచుఁజింతింపఁగా
ఘనులైమానధనాఢ్యులై పరభిదుల్ ♦ గానట్టిమీవంటివా
రినికాయంబులకెల్లనుత్సవసమా ♦ రంభంబె కాఁబోలుఁగా. ౧౭.

వ. అదియునుంగాక కర్తవ్యం బెద్దియని యంటివేని చెప్పెద నాకర్ణింపుము. ౧౮.

క. మనుకొనిశాంతి నివిడుపుము, మనమున ధైర్యంబునిలుపు ♦ మాస్తిలనాఁపఙ్
గొనకొనియుత్సాహింపుము, కనికనియిటులూరకుండ ♦ ఘనులకుఁదగునే. ౨౦.

ఆ. అరయఁగార్యసిద్ధి ♦ యుగుశాంతిచేత నె, యునుచుఁదలఁచెదేని ♦ యనఘవినుము
ధరణిసిస్వహాంఁడగు ♦ తపసికినగుఁగాని, మనుజపతికిఁగాదు ♦ మత్తియునువినుము.

శా. తేజోవంశులలోనవ్రగవగుదై ♦ ధీమంతుఁడైశూరుఁడై
రాజత్కీర్తిని రాజమానులగుచున్ ♦ దింటిల్లుమీ వంటిన
వ్రాజన్యావళియుట్టి నేఁగిశమునుం ♦ బ్రాపింపఁగా నెంచినన్
నేఁజెప్పంగలదేమిమానసమున్ ♦ నిష్ఠాలమోనక్కటా. ౨౨.

క. అటుగనుకశౌర్యముచితము, దిటముగనీవుత్సహించి ♦ తేజోనిధివై
చటులగతివిక్రమించిన, ఘటియించును గార్యసిద్ధి ♦ ఘనముగమనకున్. ౨౩.

శా. కాకుస్థంగతవిక్రమంబుపోలఁగన్ ♦ గాంతేయుశాంతిన్ సుఖ
ప్రీకింగారణభూతమంచు నెపుడుం ♦ జింతింపుదప్పనియూ
భూకాంతాంకిత మైనకాస్తికమున ♦ స్తోత్రంబుగావించినీ
వాకల్పంబుగనీవనాంతరమునన్ ♦ యాగంబులంజేయుమా. ౨౪.

మ. ఇదిగాకన్ సమయంబు భంగమగునం ♦ చెంతే భయంబందితే
నదిలేదింతయుశత్రురాజులపకా ♦ రాయత్తులైయుండఁగా
నుదయంబొందఁగఁగోరునీకరిపునా ♦ శోపాయమూహింపక
మదిలోనన్ సమయావరోధముదలం ♦ పంబాడియే భూవరా. ౨౫.

చ. సమయము చేతనున్ విధిప ♦ శంబుననీవిపదంబురాశిలో
భ్రమనుము నింగి తేజమును ♦ బాయుచు నావసువృత్తిహీనమై
తను సమువంటిశత్రుబల ♦ దర్పము గెల్చుచు వృద్ధిఁబొందుని
న్నమరదినాదిలక్ష్మియును ♦ యార్కుని బోలెను బొందుఁగా నృపతిన్. ౨౬.

వ. అని పల్కి యా ద్రుపదరాజనందన యుపసంహరించిన. ౨౭.

ఉ. అంతట భీముఁడిట్లనియె ♦ నా ద్రుపదాత్మజపల్కులన్నియు
త్యంతహితార్థబుద్ధికము ♦ లంచుమనంబున నిశ్చయించియదియు
క్త్యంతరబాధలేకమహి ♦ తార్థనిసంధనయుక్తిమీఱఁగా
నెంతయు నీతిపద్ధతిగ ♦ నిష్ఠయిసుంపఁగు ధర్మరాజుతోన్. ౨౮.

ఉ. ధర్మజవింటివా యిపుడు ♦ ద్రౌపదియంతయుఁ బ్రేమస్పష్టఁదా
నిర్మలబుద్ధి నెంచి సవి ♦ నీతిగఁబల్కినపల్కులెంతగున్
నర్మిలి నెంచి చూచినబృ ♦ హస్పతికైనను వాగతీతమై
మర్మమెఱుంగరాకయును ♦ మానుగ విస్మయమందఁజేసెనున్. ౨౯.

ఉ. నీతి గ్రహింపదుస్తరము ♦ నేను మనట్టియుపాయబోధ్యనా
నాతఁడు దెల్పఁగావినిజ ♦ లాశయముందగఁజొచ్చినట్టియా
నీతి గ్రహింపవచ్చుమతి ♦ నేర్చెడివారలు జ్ఞానబోధ్యయా
నాతఁడు గల్గుట బ్రమిది ♦ యాత్మనెఱుంగుము ధర్మనందనా. ౩౦.

ఉ. హీనబలాధ్యులౌనరుల ♦ కెల్లను సంగ్రహణావ్యధానుసం
ధానకమౌచు నంత్యఫల ♦ దాయకమై మఱిసూక్ష్మనానమౌ
యూనయయుక్తి యుందమది ♦ నెంచు మహోపగమంగు నుంబటిన్
గానఁగనయ్యెదున్ గుణావి ♦ కాసబహుత్వము గాఁగ ధర్మజా. ౩౧.

చ. అతిరుచిరార్థయుక్తియిది ♦ య్యాదరణీయము నిశ్చయంబుగా
నతులగుణాఢ్య నీకనిది ♦ యంగన పల్కెనియొప్పదంటివా
మతిగలపండితోత్తములు ♦ మాటలలోపలి యర్థమేవిని
శ్చితముగ నాదరింతురల ♦ చెప్పెడివారది శేషమెంతురే. ౩౨.

వానికి విధివశంబున నిర్హేతుకంబుగా నవరోగప్రాప్తియైన నదియును, నౌన్నత్య సమానంబగుంగాని యితరంబుగా దదియునుంగాక, యిపుడు విచారించి సేయు ప్రకారంబునుం జెప్పెద. విజిగీషుండై ప్రవర్తిల్లువాఁడు, విజితక్రోధుండై గరిష్ఠంబైన భావికార్యంబు ఫలవంతంబగునట్లుగా విచారించి తనపురుషకారం బనుకూలోపాయ విషయప్రవర్తకంబుగాఁ జేయునది. అది యట్లుండె. సమర్థుండైనవాఁడు విజితక్రోధుండు గావలయు నేయని యంటివేని. ౧౧౯.

చ. ఉదయముఁ బొందఁ గోరిననృ ♦ పోత్తముఁ డొప్పువివేకబుద్ధిచే
మొదలనె రోషజంబగుత ♦ మోగుణముం ద్యజియించు టుత్తమం
బది యెటులంటివేని యుద ♦ యంబగుభానుఁడు ముందుగా నెతా
సదమలకాంతిచేఁ దిమిర ♦ సంఘముఁ బాపు సమృద్ధి నొందుగా. ౧౨౦.

క. బలహీనుఁడైనవానికి, నలవడునీరీతిఁ జేయ ♦ నధికబలుండై
వెలసెడువానికిఁ గ్రోధము, వలన నెజయమౌనటంచుఁ ♦ బలికెద వేనిన్. ౧౨౧.

మ. బలవంతుండగు నేని యెవ్వఁడిలఁ గో ♦ పప్రాప్తమౌ తామసం
బులయం బొందఁగఁ జేయఁడో యతఁడె పో ♦ మూర్ఖైశశాంకాంశువుల్
పొలియం జేసెడుకృష్ణపక్షముక్రియం ♦ బోఁగొట్టుఁగా నెంతయున్
లలితంబైనత్రిశక్తిసంపదల నె ♦ ల్లం గార్యహీనంబుగన్. ౧౨౨.

వ. ఇట్లుంగాక విచారించి సేయుప్రకారంబునుం జెప్పెద. ౧౨౩.

క. సమయంబగుతఱి నెవ్వఁడు, సమముగ మృదుతీక్ష్ణవృత్తి ♦ సలుపునతఁడు దాఁ
గమలాప్తుపగిది లోకము, విమలంబగు తేజమునను ♦ వినుము వసింపన్. ౧౨౪.

సీ. ఈరీతి నెంతయు ♦ నెంచి సేయక యున్నఁ, జిరకాలమును వశీ ♦ కరములగుచుఁ
బోలఁగక సంపదల్ ♦ నిలుచుట యెక్కడ, కల్లరితేజీల ♦ కరణిఁ జంచ
లములైనపంచేంద్రి ♦ యములవశ్యంబేడ, రెండును నొకచోట ♦ నుండవగయు
నదియెట్టులన్నను ♦ నతిచంచలత బహు, వ్యాజప్రవర్తనం ♦ బగఁగుచుండు
సంపదలనిర్జితేంద్రియ ♦ సమితిచేత, నరసి లెస్సగ రక్షింప ♦ నలవిగావు
పురుషమి నొక వేళఁ బొందిన ♦ బొందుగాని, నిలిచియుండవు వినుమవి ♦ నీతునొప్ప.

ఆ. ఇట్లుగావున నను ♦ యేతరంబగు వేళ, నుదరిపడుచుఁ గ్రోధ ♦ ముత్కటముగఁ
జేయుచీవు ధైర్య ♦ జితపయోనిధివిస్ఫు, పెద్దజేసెదేల ♦ చెలపగుచు. ౧౨౫.

ఆ. తనకుఁ జిల్లియుంపఁ ♦ దానిట్టులేటికి, నింద్రియములనిగ్ర ♦ హింపనలయు
ననుచుఁ బల్కెదేని ♦ యనిలతనూభవ, వినుము తెలిపెదను ♦ విశదముగను. ౧౨౬.

తరణిచేతవిభాగ ♦ తనుబొందుకమలాక, రములుబోలెనుభేద ♦ గమితులగుచు
మనతోడనిలుతురు ♦ మఱియుందక్కినరాజు, లనుకూలమగుదురే ♦ యనెదవేని
కడఁగిదుర్యోధనునిమద ♦ గర్వముననుఁ, జులకగాఁజూచునటుగాన ♦ సులభముగను
భేదపఱుచుదరెట్లన్నఁ ♦ బృథివిలోనఁ, బ్రకృతిజనుఁడునునవమాన ♦ పడఁడుగాన.
ఆ. శౌర్యవంతులైన ♦ జననాథులైనచోఁ, జులుకదనముసూర్చి ♦ కొలిచియుండ
రనుచుఁజెప్ప వేల ♦ యటుగానవారల, భేదపుచ్చవచ్చు ♦ వేగిరంబె. ౧౩౭.
చ. కరముసుయోధనుండుమద ♦ గర్వముచేతనుగొల్చువారలన్
గురుతరవృత్తిఁజూడఁడని ♦ కొంకకపల్కితివిష్టమున్న నే
చరుఁడటుదెల్పఁడేతనదు ♦ సభ్యులనుంబలెఁజూచునంచున
ట్లరసెడువాఁడునేఁడుమద ♦ హంకరుఁడెట్లగునంటివేనియున్. ౧౩౯.
ఉ. ఆరసికృత్యవర్తనము ♦ సాంగతఁజేయనియట్టియాయహం
కారులసంపదల్వినుము ♦ కార్యవశంబుననాదరార్థమై
వారితవేగవాగమదము ♦ పర్థితమైకనుపట్టఁజేయఁగాఁ
గారణమానుసుమ్మదియుఁ ♦ గాకనువెండియునెంచిచూడఁగన్. ౧౪౦.
ఆ. చనమదాత్తమాన ♦ సమునవెంగలియగు, నృపతిమూఢుఁడగును ♦ నిజముగాను
నృపతిమూఢుఁడైన ♦ నీతిహీనుండగు, నీతిరహితుఁజులుకఁ ♦ జూతురవని. ౧౪౧.
వ. అట్లు గావున. ౧౪౨.
ఉ. ఓలిమదంబుచేవికల ♦ మొందితనంతపలాయమానమా
మూలబలంబుగల్గురిపు ♦ భూపతినిస్త్రతిమాదుతాహతిన్
మూలముతెల్లఁగూలఁగను ♦ బొందిచలించెడుభూరుహంబునుం
బోలెసహిష్ణుఁడైమెయినె ♦ ముట్టివధింపవలంతియోఁగడున్. ౧౪౩.
క. అంతర్భేదముఁబొందిన, యంతనెరిపులెట్లుసాధ్యు ♦ లౌదురటంచున్
జింతించిపల్కితేనది, యంతియువిపరింతుఁదలియు ♦ మనిలతెనూబా. ౧౪౪.
చ. అరయఁగనాస్తవర్గజని ♦ తాగ్రహమెంతయునల్పమైనన్
జెలఁచునుభూపతిన్నిజము ♦ శీఘ్రముగానదియొట్టులంటివా
తెరనికమప్రభూతశిఖి ♦ తప్తముగాఁగమహీధరంబుదా
నురువడిఁగాల్పదేవినుప్పు ♦ కోదరమంతియుమూలముట్టుగన్. ౧౪౫.
క. ఎనయఁగనిటువలెనైనను, మునుకొనిశాత్రవుఁడువృద్ధి ♦ పొందుచునుండం
గనుఁగొనుచునూరకుండఁగ, నొనరనెయ్యునియంటివేని ♦ యునువినుమనఘా. ౧౪౬.

క. మతిమంతుఁడనీతిరిపున్, మతియోర్చునునీతిహీన ♦ నరనాథునకు
న్నతిమతివిపదంతమగున్, అతనిజయింపంగసుకర ♦ మయ్యెడికతనన్. ౧౪౭.

వ. ఇట్లు దుర్నీతుండైన శాత్రవు నెట్లు సాధింపనచ్చునని యంటివేని. ౧౪౮.

చ. వెలయులఘుత్వవృత్తికడు ♦ భేదితులౌ సుహృదాదిబాహ్యులున్
అలసచివాదుతైనతన ♦ యాప్తులుగల్గనిపక్షభూపమం
డలముసమీపవైశ్రసర ♦ నాయకుఁడాఁగినదీరయంబునా
గులగులలై నెరల్విడుచు ♦ కూలమునంబలెఁదాహరించుఁగా. ౧౪౯.

క. ఈకరణిరిపులఁదునుమఁగ, నాకులపడుభీమునకున ♦ నాకులముగఁదా
సాకల్యంబుగనయబో, ధాకరణము సేయుచుండు ♦ ధర్మజుకడకున్. ౧౫౦.

సీ. అతులితకరుణార ♦ సార్ద్రవీక్షణముల, వివిధమృగపక్షి ♦ వితతి నెల్ల
వశముగాఁజేయుచుఁ ♦ బాపసంచయదాహ, కంబునుదర్పని ♦ యుంబునగుదు
దిక్కులవెలుఁగొందు ♦ దివ్యతేజంబును, ధరియించియాశ్చర్య ♦ కరముగాఁగఁ
బుణ్యసంచయమెల్ల ♦ మూర్తివహించిని, ల్చినరీతివాంగిల ♦ సర్గఁబోలె
నాగమోద్ధారియుతులత ♦ పోధిపుండు, పరమతత్త్వజ్ఞుఁడగువరం ♦ శరతనూజుఁ
డర్థినేతెంచినిలిచెఁబ్ర ♦ త్యక్షముగను, ధర్మసూనుండుజూచిసం ♦ తసమునంది.

వ. ఇట్లేతెంచిన వేదవ్యాసమహామునిం గాంచి యాధర్మనందనుండు సంతోషభరితాంతఃకరణుం డగుచు, మేరుమహీధరశిఖరంబునఁబోల్చునగుణకిరణప్రభాభిరామ్యుం డగు భానుండునుంబోలె, విధూతతరుణపల్లవాగ్రుం డగుచు నమున్నతకాంచనసింహాసనంబు దిగ్గన డిగ్గి యప్రమత్తుండై యమ్మహానుభావు వినయక్రియాప్రకారంబునఁ బూజించి యనంతరంబ తపనుజ్ఞాతుండై శాస్త్రంబుల నలంకరించుచుఁ గాంతియునుంబోలె, నాత్మసింహాసనాసీనుండై దరహాసప్రభావిభాసితాధరోష్ఠుండును, విస్తృతధాముండును నై చెలువొందు నత్తపోధనసత్తమున కభిముఖుండై తేజోవిరాజితుండగు బృహస్పతి సన్నిధానంబున నొప్పుసంపూర్ణచంద్రు ననుకరించుచు నాస్థానికగోష్ఠప్రసాదితాంతర్జాలోన్నతుండును, పిశంగానిలజటాధరుండును, విద్యుత్సంకలితాంబుదసంకాశదేహుండును, సమగ్రసౌమ్యతావిటపిచ్ఛాయాశీతలుండును, వపుఃప్రకర్షతాపరచితజనమనస్సంజాతస్నేహార్ద్రభావుండును, శాంతస్వరూపప్రకటితవివిక్తాంతఃకరణవ్యాపారుండును, ధర్మప్రతిపాదకాఘుచ్ఛిదశ్రుతిన్యాయుండును, సుఖోపవిష్టుండును, కరుణాకటాక్షవిరచితకుశలప్రశ్నుండునునుంబోలెఁ బ్రకాశించు నమ్మహానుభావు రాకకుం గారణంబు తెలియ నిశ్చయించినవాఁడై యిట్లనియె. ౧౫౨.

క. మునినాథపుణ్యహీనుల, కనయముఁబొందంగరాక ♦ నపగతరజస్కై
కనుపట్టుమీదుదర్శన, మొనరెనుపీతాభ్రవృష్టి ♦ యనుబోలెఁగడున్. ౧౫౪.

సీ. క్రతుకర్మములుఁగోరి ♦ కలనీగసాగెను, బ్రహ్మలాశీర్వాద ♦ ఫలితులైరి
భవబంధములనెల్లఁ ♦ బాసినే నెంతయుఁ, బూజ్యుండనైతిని ♦ బుడమిలోనఁ
బరమేష్ఠివలెజగ ♦ ద్గురుఁడనైవిఖ్యాతి, నెలకొన్న వరతపో ♦ నిధినిబరమ
శాంతుసాక్షాద్భగ ♦ వంతునాగమవిభా, గునినిన్నునేఁడుగ ♦ న్గొనుటకతన
సంపదలుహెచ్చెఁబాపముల్ ♦ సమసెసుఖము, లెదురుకొనెఁగీర్తిదిక్కుల ♦ నెల్లనిండె
నేమిఫలమింకరానున్న ♦ దోమహాత్మ, మిన్నకయెపోవునే నేను ♦ మిమ్ముఁగనుట.

చ. అమృతమరీచిఁజూచియును ♦ హర్షముఁబొందనిచక్షురింద్రియం
బమరఁగనిన్నుఁజూచిముద ♦ మందెడి నేఁడిదెచిత్తముంగడున్
బ్రమదముఁబొందెబంధువులఁ ♦ బాసినదుఃఖముఁబోవనాడుచున్
శమదమసత్యతత్త్వరుచి ♦ సారపరాశరమానినందనా. ౧౫౫.

ఆ. నిస్పృహాత్ములైన ♦ నీయట్టితపసుల, కేమిసేయునట్టి ♦ దేమిలేదు
ఐననీదుపల్కు ♦ లతిశుభంబులునాకు, హితముగానవినఁగ ♦ నిచ్చపుట్టె. ౧౫౬.

క. అనవుడుఁగృష్ణద్వైపా, యనుఁడిట్టులువిజయకాంక్ష ♦ నతివినయమునన్
గొనియాడుచుండునయ్యమ, తనయునితోఁగూర్మిమీఱఁ ♦ దానిట్లనున్. ౧౫౭.

వ. ఇట్లు పలుకం దొడంగినవాఁడై యా తపోధనుం డాత్మీయంబైన యానుగ్యస్థదోషంబు
పరిహారంబుసేయువాఁడై యిట్లనియె. ౧౫౮.

సీ. వినుధర్మనందన ♦ మనమునవిహపరం, బులయశోభూషణ ♦ మునుఘనంబు
లైనసంపదఁబొంద ♦ నభిలషించినవారి, కాత్మబంధువులందు ♦ ననవరతము
నొప్పఁగాసమవృత్తి ♦ నుండుటయుచితయుక్త, మందులోఁదపసుల ♦ కరసిచూడ
నిజముగావలయును ♦ నెఱినట్టులయిననేఁ, డనఘనీగుణవిశే ♦ షాతిశయము
కతననీమీఁదికూరిమి ♦ గడలుకొనఁగ, నిరుపమానందవైభవ ♦ భరితమగుచు
నిలిచియున్నదియిట్టట్టు ♦ దొలఁగకిపుడు, నాదుహృదయంబునీయధీ ♦ నమునుజెందె.

ఆ. ధరవిరక్తులైన ♦ తపసులకిట్లేల, పక్షపాతమనుచుఁ ♦ బలికెదేని
మొనసినిస్పృహులకు ♦ మోక్షకాములకును, నరయఁబ్రీతిగుణముల ♦ యందెకాదె.

వ. అని మఱియును నా ధర్మనందను గుణాతిశయంబును, ధృతరాష్ట్రదుశ్చరితంబునుం
బ్రకటించి యుత్సాహంబుపుట్టించువాఁడై యిట్లనియె. ౧౬౧.

క. వీరలు ధృతరాష్ట్రునకుఁ గు, మారులు మతిగారో బుద్ధి ♦ మంతులు గారో
యూరక విడనాడెను మిముఁ, బోరు ముభోగేచ్ఛ మోహ ♦ ముసు జేయునె కా. ౧౬౨.

మ. అనయంబీగతి మూఢచిత్తునకు న ♦ ర్థావాప్తియత్నాన దె
ట్లనినన్ సౌబలకర్ణముఖ్యకృత ♦ కార్యాధీనుఁడై నాఁడు దు
ర్జనసంసర్గజితాంతరాయముననిం ♦ స్సారంబు నాపత్ప్రదం
బును గానన్మతియర్థహానియులయం ♦ బుం బొందు నా కష్టునిన్. ౧౬౩.

చ. పాడిఁ దొలంగి ద్రౌపదిని ♦ బాములఁ బెట్టఁగ నవ్వసంగనో
రాడక యూరకే సభికు ♦ లందఱునుండఁగ నీవు వారిపైఁ
గీడు దలంపకుండితివి ♦ కేవలశాంతినయుక్తి నీకుఁ జే
కూడదె కార్యసిద్ధి నయ ♦ కోవిద పాండవవంశవర్ధనా. ౧౬౪.

చ. నిరుపమశాంతశీలునకు ♦ నీకును మిత్రులు నాప్తసీనమై
పరఁగుమహోపకారమునఁ ♦ బ్రాప్తమెఱుంగక క్రూరబుద్ధిపై
నెరయఁగఁ జేసిరందునను ♦ నీమతిశీలమతిప్రకాశమై
కరముప్రసిద్ధికెక్కినుప ♦ కారులె పో మతినీకు వారలున్. ౧౬౫.

చ. చటులపరాక్రమంబున న ♦ శంబగు భూమిను దెస్సులంటి నా
పటుబలశౌర్యభాణములఁ ♦ బ్రస్తుతికెక్కిన వారు శత్రులీ
పటువలెఁ గావునన్వినుమ ♦ హృత్తరయత్నము సేయనోర్పును
త్కటమగు బల్మిగల్గునెడఁ ♦ దావిజయానసూలక్ష్మిఁ బొందుగా. ౧౬౬.

వ. అదియునుంగాక. ౧౬౭.

చ. ఇరువదియొక్కమాఱుధర ♦ నేకులఁ గొట్టిన యట్టి మేటిస
ద్గురుఁడనిజామదగ్న్యుననుఁ ♦ గొంకకెదిర్చియునంబునాకడున్
దురమునఁ బాఱఁ దోలితన ♦ దోర్బలమాగురుఁడాత్మలోనన
చ్చెరువడియెంచునట్టుగను ♦ జేసిన భీష్ముని గెల్వశక్యమే. ౧౬౮.

మ. అదిగాకాతని కెంచిచూచిననిజా ♦ త్మాయత్తపంచత్వమున్
జెదలజ్జించుచు శక్తిలేకజముఁడున్ ♦ స్వాంతేపరాభూతుఁడై
మదిభీతిల్లును నట్టిభీష్ముఁడనిభీ ♦ మంబైనవిల్ ద్రిప్పుచున్
గదియన్భీతిఁ దొలంగకేరు నిలువం ♦ గానోపువారీధరన్. ౧౬౯.

చ. రణమునను గ్రసాయకప ♦ రంపరలన్నిగుఁ గుర్లు గక్కుచున్
గణఁకనుజంతలోజ్జ్వలశి ♦ ఖల్ భువనజిహ్వాలయట్లు గాఁగఁ దాఁ

గణఁగిజగంబుఁ మ్రింగుబలు ♦ కాంతు నమందుఁడయ్యు గాంతవహ్ని నాఁ
దొణఁగిమహోద్ధతిన్ నడుచు ♦ ద్రోణుని నైనను నోర్వశక్యమే. ౧౭౦.

మ. పరమాటోపనిరస్తధైర్యరిపుభూ ♦ పాలుండుశూరుండుస
ద్గురుభావాశ్రితజామదగ్న్యుఁడులస ♦ త్కోదండుఁడాకర్ణునిన్
బరఁగంజూచి సుసంస్తుతంబగుభ ♦ యప్రాప్తిన్ వెసంబొందుచున్
బగువైత్తు స్మతిమృత్యువేనియతని ♦ న్మర్దింపఁగావచ్చునే. ౧౭౧.

వ. అనిపల్కి తదనంతరకరణీయంబగు కృత్యంబును నిజాగమనప్రయోజనంబునుం దేట
పఱచువాఁడై యిట్లనియె. ౧౭౨.

మ. వినుదేవాధిపమంత్రరూపమగునీ ♦ విద్యన్ దపోవర్తియై
ఘనమౌపాశుపతాదిదివ్యశరశ ♦ క్తింబొందిశూరుండునై
పెనుపన్నక్రతనూజుచేతనిపుడీ ♦ భీష్మాదులెల్లన్రణం
బునన్ మందంగలరీవుజూడఁగనుని ♦ ర్మూలంబుగానందఱున్. ౧౭౩.

మ. గగణీనాయకనీకునేఁడుసుమహ ♦ త్త్వప్రాప్తికై దేవతా
వరమంత్రాంకితమున్ మహత్తరసుర ♦ వ్రాతప్రసాదోదయ
స్థిరసామర్థ్యము నైనవిద్యఫలసి ♦ ద్ధింబోలె నేనీయఁగా
నరయంబాత్రుఁడవీవెయంచుమదిలో ♦ హర్షించియేతెంచితిన్. ౧౭౪.

శా. ఈరీతిం దగనెంచిపల్కుచునునెం ♦ తేనింబ్రసన్నాత్ముఁడౌ
పారాశర్యునిసన్నిధానమునకున్ ♦ బ్రత్యుద్గతస్వాంతుఁడై
శూరుండజ్జనుఁడేగుదెంచెఁబ్రియశి ♦ ష్యుండుంబలెంబొమ్ముచే
కూరంజేయుమటంచుధర్మజుఁడుదాఁ ♦ గూర్కింపగంబల్కఁగన్. ౧౭౫.

వ. ఇట్లేతెంచిన యనంతరంబున. ౧౭౬.

ఉ. వ్యాసముఖంబున న్వెడలి ♦ వహ్నికణోజ్జ్వలగౌరవర్ణమై
వాసవమంత్రరూపమున ♦ వార్తకు నెక్కొనవిద్యయజ్జునో
ద్భాసితవక్త్రమధ్యమునఁ ♦ బర్వుచుఁబొందెదినోదయంబునన్
భాసిలుసూర్యదీప్తివిరి ♦ పద్మమునుంబలెఁగాంతిపుంజమై. ౧౭౭.

చ. ప్రకటముగాఁగఁదన్నియమ ♦ భాసురయోగవిధోపదేశమున్
అకలుషసత్ప్రభావమున ♦ నప్పుడెసేసెఁదదీయసిద్ధిచేఁ
బ్రకృతిమహాత్ములన్విదిత ♦ భావముగన్పడెమూలముట్టుగా
వికసితమయ్యెసాఁదగుని ♦ వేకముదృష్టియునద్భుతంబుగన్. ౧౭౮.

చ. ఒనరఁగ నామునీంద్రుఁడు జ ♦ యోదయమైన తపస్సమాధిఁ దా
ననువుగఁ గూర్పఁగాఁ దలఁచి ♦ యాత్మకు నెంతయు సానుకూలమై
తనరుచు భూరిలాభకథి ♦ తంబగు నాకృతిఁ దాల్చియున్న య
ర్జునునకు నిట్లనున్ని యమ ♦ సూచకమై తగునట్టు లెంతయున్. ౧౨౯.

శా. ఏనీ చెప్పిన యోగమార్గమున నెం ♦ తేసుప్రకాశుండవై
మౌనాభ్యాసులపద్ధతిన్ దెలిసి నీ ♦ మార్గంబ దెవ్వారికి
జ్ఞానప్రాకనిగూఢమై పరఁగఁగా ♦ స్నానోపవాసవ్రతా
నూనంబై నజపంబులన్ సలుపుమీ ♦ సోగ్రాస్త్రశస్త్రుండవై. ౧౩౦.

చ. సరభసవృత్తి నింద్రునిప్ర ♦ సన్నతఁ గోరుము యోగనిష్ఠచేఁ
బరఁగఁగ నీవు నేసెడు త ♦ పంబున కుందగు నింద్రకీలమున్
సురగిరి దాని నీక్షణమె ♦ చూపఁగలండిదె పేఁడె యక్షుఁడం
చరుదుగఁ బల్కి నిల్చె వాక ♦ యక్షుఁడు దానపు డదృశ్యతంబుగన్. ౧౩౧.

క. ఇప్పగిది నప్పగించుచు, నప్పుడె యాగూనకాని యరిగె ♦ నంత న్నృపుఁడున్
తప్పక మునియాజ్ఞ యుఁబలె, నప్పార్థుని ప్రోలనిల్చె ♦ నయ్యక్షుండున్. ౧౩౨.

వ. అంత. ౧౩౩.

మ. నయమొప్పంగ సుయక్షుఁడుం బ్రణతుఁడై ♦ నవ్యానురాగంబుచేఁ
బ్రియవాక్యంబులు పల్కుచుండు నరుతోఁ ♦ బ్రీతాత్ముఁడై స్నేహమున్
నియతాత్మం దగఁ జేసె నంతట నెయిరా ♦ నేసంగముం బెట్టునం
శయమున్నె మతిసాధుసంగమమునన్ ♦ సఖ్యక్రమం బొందఁగన్. ౧౩౪.

ఉ. అంతట నింద్రసూనుఁడు ద ♦ యాప్తికినై యొడఁబాయ మందభా
స్వంతుఁడు నట్ల నేచనఁగఁ ♦ జాలుబృహస్పతి మేరుగిరుధా
భ్యంతరసీమ లంబలెయ ♦ మాత్మజుఁడాదిగఁ బాండపేయులన్
గొంతతమంబు బొందెమది ♦ కొంకుచుఁ దాఁ బ్రసభాత్మలాభమై. ౧౩౫.

సీ. రమణీయకార్యగా ♦ రవవిలోకనతము, స్వరిహరింపంబడి ♦ తిరుగ భ్రాతృ
వాత్సల్యమునఁ బొందఁ ♦ బడివారియందువి, భాజ్యమానంబుగాఁ ♦ బ్రాప్తమైన
యాదుఃఖ మతిభార ♦ మైనదే నివిభాగ, ములఁ బొందుకతమునఁ ♦ దాలకమైన
యట్లు వారికిఁ దోఁచి ♦ యతిధైర్యమునఁ బరాం, శరవాక్యసామర్థ్య ♦ గరిమ నెమ్మిఁ
బరుల చేఁ బుట్టుతీవ్రతో ♦ పము ననరుని, భూరతయు నెంచుకొనుచుండు ♦ వారియందు
మించి చూపంగ నాస్పద ♦ మింతయైనఁ, గలిగి వసియించఁగా లేక ♦ తొలఁగెనపుడు.

తే. తోలఁగి శోభిల్లువారల ♦ నలుగురినిని, బగటిజాముల నాల్గింటి ♦ బలెను విడిచి
యంధకారంబు నిశఁ బొంది ♦ నట్లు కృష్ణ, నేకమై పొందె నాఖేద ♦ మెల్లఁ గూడి.

మ. అపుడా ద్రౌపది చూచు ప్రేమ యధికం ♦ బైనన్ సబాష్పంబులై
చపలోత్ఫుల్లతుషారతోయకణసం ♦ ఛన్నోత్పలాభంబులై
విపులంబౌ కనుదోయి మీలనముగా ♦ వింపంగ లేదయ్యెఁ బా
ష్పపరిస్రావము బుట్ట దానదొసఁగుల్ ♦ ప్రాపించు నా సెన్ను చున్. ౧౪౮.

చ. అకలుషితానురాగసుర ♦ సాంచితమున్ లలనార్పితంబునన్
బ్రకటితదృక్ప్రియంబునగు ♦ ద్రౌపది చూపపు డస్జ నుండు దా
వికసితమానసాంజలిని ♦ వేడుకతోడుతఁ గూర్మి మీఱఁగా
సకలమునుం గ్రహించెఁ బృథ ♦ సంబలముం బలె వాంఛితాత్ముఁడై. ౧౪౯.

వ. ఆసమయంబున నవ్విజయున కభిముఖంబుగా నిలిచి కోపం బుత్కటంబుగాఁ జేయం
దలంచి. ౧౫౦.

తే. వనగజము చేత నాశర ♦ ద్వాహిని బలె, విగతధృతి చేతమాలిన్య ♦ వేషమైన
ద్రుపదరాట్పుత్రి కన్నీరు ♦ గ్రుక్కుకొనుచు, నరునితోఁ బల్కె గద్గద ♦ స్వరము దోలఁక.

ఆ. పంకసన్నిభంబు ♦ పరులు చేసినయట్టి, కపటమున ననుమునుఁగు ♦ గౌరవంబు
నొగిని సంపదలను ♦ నుద్ధరింపఁగలవు, నీవు మష్టుఁ బాసి ♦ నిర్మలాత్మ. ౧౫౨.

క. ఆసుల నెల్లను దొలఁగఁగ, బాధించెదు నీతపంబు ♦ పరిపక్వం బై
సాధింపఁబడిన దాఁకను, మాధవుఁ దలపోయుచుండు ♦ మదిఁ గలఁగకుమీ. ౧౫౩.

చ. అతులయశంబుఁ బొందసుఖ ♦ మందఁగనైన మనుష్యసంఖ్య దా
నతకరియింపనైనమది ♦ నాస్థదలిర్పఁగ నిర్మలాత్ములై
సతతము నుండువారలకుఁ ♦ జయ్యనఁ బొందును నర్థసిద్ధి దా
మతి ననురాగిరమైనయుల ♦ మానినియుం బలెఁ దన్ని జాంకమున్. ౧౫౪.

సీ. వినులోకరక్షణ ♦ మునకు బ్రహ్మ సృజించు, క్షత్రతేజం బెల్ల ♦ సమసిపోవ
నధికతేజోవంతు ♦ లను మాట ప్రాణసం, కాశాభిమానంబు ♦ నాశమొంద
నాప్తకృత్యంబంచు ♦ నచటి రాజులు సంశ, యించిన ప్రమత నిచ్చ ♦ గించి మూడ
నతిదిగ్వికీర్ణమై ♦ యలభూవితానంబు, లెల్ల నొప్పు యశంబు ♦ లేర్పడంగ
శూరకర్మంబు విఖ్యాతి ♦ మాఱఁబోవ, నాయతులు దూలమనకిపు ♦ డగులు సేయు
పరిభవము నిన్ను నేఁ డెడఁ ♦ బాయుకతనఁ, దలఁచి మదిను చ్చరింపను ♦ దరము గాదు.

తే. పాంతగాయంబునలపునః ♦ ప్రహరణంబుఁ, గలసిబాధించుగతిదుఃఖ ♦ గతిని బొంది
పొనుఁగుపడుచున్న నాచిత్త♦మనఘ నేఁడు, కలఁచి వెతి నుందఁగాఁ జేయుఁ♦గలిగెముఱల. ౧౯౭.

వ. అని మఱియును.

సీ. క్రొమ్ములు బోయిన ♦ కుంజరంబును బోలె, విగతాభిమానతి ♦ వికృతి నొంది
రిపురాట్ప్రితాపాంత ♦ రిత తేజము నశార, దాంబుదావృత వా ♦ రాదిఁ బోలి
స్వనిరర్థకతనజ్ఞ ♦ తను బొందినట్లున్న, దివ్యాస్త్రములు బూని ♦ తేజరిలక
ఘనయశఃక్షయముచే ♦ గతజలాబ్ధిని బోలి, యన్యాకృతిని దాల్చ ♦ నట్టులగుచు
నీదుశౌర్యంబు బలమును ♦ నీఱుగాఁగఁ, గులపము శాంతము నుండఁ జెప్ప ♦ ఘోళిబ్రుంగి
దిక్కులేకున్న యీకురుల్ ♦ తెలియఁ జూచు, చున్న వాఁడవు తొలినిజ ♦ యొంటినైన.

సీ. ఇలలోన సత్పురు ♦ షులను సంరక్షింప, నాతండె క్షత్రియుఁ ♦ డనఁగఁ బరఁగు
రణకర్మములసమ ♦ ర్థంబైన విల్లె తాఁ, గార్ముకంబనెపించి ♦ ఖ్యాతిఁ గాంచుఁ
గాని యీయర్థంబు ♦ లేని యీశబ్దాఖ్య, ధ్యయబాతంబెల్లఁ ♦ దలఁచు నేపుడు
మూఢుఁడై యీశబ్ద ♦ ములఁ బ్రసక్తిలఁ జేయు, నాఁడె యీశబ్ద ♦ ఘాతుకుండు
గావున నీవు క్షత్రియు ♦ గరిమఁ గార్ముకంబు విఖ్యాతి నిల్పుచుఁ ♦ గడఁగి మస్మఁ
గావకున్న ట్టియీయప ♦ ఖ్యాతియెల్ల, గతముగాఁ జేసి విఖ్యాతిఁ ♦ గాంచుమనఘ.

వ. అదియునుంగాక. ౨౦౦.

క. వినునీగుణములు తేజము, ననుఁ బాయుచు నిప్పు డింకనీ యుడుపుం
బును గోరెదు మత్సామ్యం, బునఁ బొందఁ దుఁదుల్య దుఃఖ ♦ ములుగలవిపలేక. ౨౦౧.

వ. ఇంత యేమిటికిం జెనిం జెప్పెద నాకర్ణింపుము. ౨౦౨.

చ. విమతులచేఁ బ్రమాదమున ♦ వేదతనొందిగజవ్రజంబుచే
భ్రమసినటావిలూనమగు ♦ భాసురకేసరిఁ బోలెనున్న ని
న్నమరఁగఁ గార్యభారమిపు ♦ డక్కుని వాసిగలక్ష్మియుంబలెన్
మమతను బొందియున్న దిన ♦ మస్థఁడవౌటను గానదూఱెపకన్. ౨౦౩.

వ. అని యిట్లు ద్రుపదరాజనందన నిజపరిభవద్యోతకంబుగాఁ బల్కి పదియుఁ బ్రయోగ
నిర్వహణ హేతుకంబుగా నిట్లనియె. ౨౦౪.

మ. ధరలో నెవ్వఁడు తక్కుమానవులచే ♦ సంబొందఁగా రానియా
వరసంభావనవర్ధవంతముగ న ♦ ద్వైశ్వపారతంజేయున
మ్మనుజుండింబొందవు నశ్వభాస్థలులల్లో ♦ నన్బూరుమాధిక్యముల్
కన నెమ్ముఁగనుతెక్కువెట్లగనుమం ♦ ఖ్యాద్విత్వమింద్రాత్మజా. ౨౦౫.

మ. మదినీవిప్పుడుమమ్ముఁబాసిచనఁగా ♦ మామీఁదివాత్సల్యతన్
గిదియున్విఘ్నములెన్నియేనవియుమ ♦ గ్నంబొందఁగాభక్తినీ
హృదయంబందునుపాస్తిసేయుమలదే ♦ వేంద్రుండునీకెంతయున్
సదయుండైవెసఁజేయుఁగాకతపమున్ ♦ సాఫల్యతన్బొందఁగన్. ౨౦౬.

క. జనరహితమంగళస్థల, మునసొకఁడవైయుండిమోహ ♦ మునఁబొందకుమీ
వినుమత్సరరాగాత్ములు, చెనఁటులుసాధువులనైనఁ ♦ జెఱుతురుజగతిన్. ౨౦౭.

మ. అదిగానన్మఱియుప్రమాదముననా ♦ వ్యాసోపదేశంబున
న్ముదమొప్పంగనువేగఁజేసిదయతో ♦ మాకోర్కెలీడేర్చుమీ
తిరుదంచత్ఫలసిద్ధినీవుకృతకృ ♦ త్యత్వంబునన్బొందిరా
ముదితాత్మున్ననుఁగౌఁగిలింతుఁగుచముల్ ♦ మోవంగనేనత్తఱిన్. ౨౦౮.

క. అనిపరిభవంబుమఱినూ, తనకృతమైతోఁచనిట్లు ♦ ద్రౌపదివల్కన్
వినికపలియుత్తరాయణ, దినకరుఁడుంబోలెనరుఁడు ♦ దీండ్రించెఁగడున్. ౨౦౯.

ఉ. అంగటశత్రులందనని ♦ జాగ్రమునంగనుఁగొన్నయట్లుదా
నెంతయుభీషణాకృతివ ♦ హించెఁబురోహితదత్తశస్త్రిఁడై
వింతగసౌమ్యుఁడయ్యునిజ ♦ విగ్రహమందులమారణక్రియన్
మంతుకునెక్కినట్టిఘన ♦ మంత్రముఁబోలెఁబ్రచండమూర్తియై. ౨౧౦.

వ. అంత. ౨౧౧.

సీ. సౌమ్యుండుమంత్రపూ ♦ తంబుగానట్టిచ్చు, నిశితఖడ్గముఁగేల ♦ నెఱయఁదాల్చి
ప్రస్ఫీతాస్త్రసంధాన ♦ పటుతరజ్యాకర్ష, ణామోఘమైనవి ♦ ల్లమరఁబూని
కవచాసల్బిగియించి ♦ నవరత్నఖచితమై, యింద్రాయుధక్షతుల్ ♦ సాంద్రతేజ
మునఁగ్రిత్తిచేతఁబో ♦ లెనుసారెఁగడుపుచు, తారకోజ్జ్వలనభో ♦ తిరముమాడ్కిఁ
దనరుకవచంబుధరియించి ♦ ధనవభృత్య, విదితమాంగల్యహిమశైల ♦ పదవినడచె
నచటినూనులుధర్మజుం ♦ డనుపలేక, కొంతవెతఁబొందఁగావారి ♦ కంతమొక్కి.

వ. ఇవ్విధంబున నవ్విజయుండు ప్రయాణోన్ముఖుండై చనుసమయంబున. ౨౧౩.

క. కురిసెనుపువ్వులవానలు, మొరసెనుసురలోకమందు ♦ భులతోదిక్కుల్
శరనిధిప్రీతసూచకుఁడయి, వరుఁడుంబలెఁబొంగివెడలి ♦ వసుమతిఁగదిసెన్. ౨౧౪.

వ. తదనంతరకథాక్రమంబు విన్నవించెద. ౨౧౫.

క. కరనిశితనఖవిదారిత, పరకాంచనకశిపువక్షు ♦ పాండవపక్షున్
కరిరక్షాఖిలశిక్షు, నరభక్షణహారణదక్షు ♦ నరహర్యక్షున్. ౨౧౬.

మత్తకోకిల. రాజహంసను నేత్రకోసల ♦ రాట్సుతాపరపుత్త్రవి
భ్రాజమానసుగాత్రకౌరవ ♦ రాజపన్నగవేత్రది
గ్గ్రాజసన్నుతసత్యకీర్తివి ♦ రాజమానచరిత్రస
ద్భోజరాజసుతామనోహర ♦ పూజ్యమానదయానిధీ. ౨౧౭.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర కౌండిన్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర సరసభాగవతపూజావిధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



క. శ్రీరాజితఘనవక్షా, సారాంబుజసన్నిభాక్ష ♦ సంయమిరక్షా
ధారాగరుడాధ్యక్షా, నారాయణనయవిచక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మవ్విధంబున నా ధనంజయుండు శుభనిమిత్తంబులు గనుంగొనుచు ద్వైత వనంబు వెడలి శరత్కాలోపశోభితంబై కూజద్రాజహంసమాలికాకాంచికయుఁ బరి పక్వసస్యాహితపాండుతాగుణంబునం బరిపూర్ణయౌవనంబున సఖీపరివృతయై యొప్పు ప్రియురాలుం బోలెఁ బ్రకాశించు జనసమీపప్రదేశంబు డాయం జని వినమ్రశాలి ప్రసవాభిరామంబై యపగతపంకిలత్వంబునుం బొందుచు, నకలంకపంకరుహసంకలి తాభంబులై యుపాయనీభూతశరత్కాలసంపదలం బొదలు నుదారంబులైన యకృ త్రిమకేదారంబులం గని యానందించుచు విస్మయాకులత్వంబునను న్మీలితాంభోరుహ లోచనంబులైన సరోవరంబులచేతం దిలకింపంబడుచు, నిజాంగనావిలోకనవిలాస విభ్రమానుకారంబులుగాఁ బొరలు శఫరీవివృత్తంబులయందుఁ జిత్తంబు హత్తించుచు, మఱియు సవారిజంబైన కేదారవారియందు విరాజమానంబగు శాలిరామణీయకం బవలోకించి సుదుర్లభంబైన యనురూపసంగమం బింత యొప్పు సేయని యుత్కర్ష లక్ష్మీవిలాసంబు నగ్గించుచు, కింజల్కవిష్కృతఫేనపుంజోదకంబైన కంజంబులయందు రంజితస్థలపంకేరుహాశంకాంకురితమానసుండై తత్క్షణసాక్షీనోల్లుంఠితోపలక్షితాంబువుల వలన నశంకితుం డగుచు, ననుదినక్షీయమాణంబులై పర్యాయక్రమంబునం బ్రకాంతర యంబులైన తోయంబులచేతం గృతోర్మిరేఖాకారంబులై నెరికలఁ జెలువారు వెలి పట్టుపుట్టంబులమాడ్కి నతిశుభ్రంబులై కనుపట్టు విమలనదీపులినంబులం గని సంతో షించుచుం జని చని ముందట. ౨.

సీ. భ్రూమధ్యమునఁ బొట్టు ♦ పొల్పడి మీఁద వింతగాఁ, దాల్చినబంధూక ♦ దళముఁ గాంచి
యావకరపదయుక్త ♦ మగుచు నింపులుగుల్కు, పల్లవాధరశోభ ♦ నుల్లసింపఁ
గుదురు చక్కనిగబ్బి ♦ గుబ్బలు నిండఁగా, మాటికి జల్లుతో ♦ మరునరజము
నెరపినచెమటచే ♦ వరపద్మరాగసం, కలితమౌక్తికహార ♦ గరిమ నెఱపఁ
గలితకర్ణోత్పలద్యుతుల్ ♦ గలసి వెలయు, చారురుచినేత్రశుభగాత్రి ♦ శాలిగోప్త్రిఁ
గాంచి కడు మెచ్చె నాశరత్ ♦ కాలమహిమ, నేఁడు సాఫల్యమును బొందెఁ ♦ జూడ ననుచు. ౩.

వ. వెండియు,

ఆ. పోవు బీళ్ల మేసి ♦ పొదుగుల బరువున, వేగఁ బఱవలేక ♦ లేఁగలందుఁ
గూర్మి మీఱవచ్చు ♦ గోగణంబులఁ గని, యాత్మలోనఁ జాల ♦ హర్షమొందె. ౫.

సీ. కంటికింపగు శర ♦ త్కాలఘాసము మేసి, పొగ రెక్కి సంప్రాప్త ♦ పుష్టిఁ దాల్చి
శిరముఁ గొంత టువంచి ♦ చిఱుచిఱులాడుచుఁ, గాలు ద్రవ్వుచుఁ బ్రతి ♦ గా నెదుర్చు
పరవృషభంబును ♦ బొడిచి ఱంకెలు వైచు ♦ కోడె యని
తటినీతటంబులు ♦ దటిసి యోరగ నిల్చి, సెలవి కొమ్ములఁ గ్రుచ్చి ♦ చిమ్ము కొనుచు
ధరణి లోపలఁ గల యట్టి ♦ దర్పమెల్ల, విగ్రహముఁ దాల్చి యీ రీతి ♦ వెలసినట్టు
లురుతరాటోపమున నొప్పు ♦ చున్నయట్టి, కడిఁది యాఁబోతు నొక్కటిఁ ♦ గాంచి యపుడు.

తే. మంచు తెరమాడ్కి శుభ్రమై ♦ మించగి తిని, విచ్చిపోవుచు నుండు మే ♦ ఘతతిఁ జూచి
గళితసుక్షౌమజఘనయై ♦ ఖగులఁ దనరు, వరశరత్సింగ్సుపైకతి ♦ ప్రజముఁ గాంచి. ౬.

తే. అవలఁ జనుచుండి పసుల ♦ యందు సోద, రాభిమానంబు గోవి ♦ ముత్వమొంది
యలరు గృహములలో బలె ♦ నడవి నాల, నరసనున్న త్రిగోపాల ♦ నరులఁ జూచి. ౭.

వ. ఇవ్విధంబునం గనుంగొనుచుఁ దద్వ్రజాజిరంబులు దాఁటుచుం జని. ౯.

సీ. నెఱితు మ్మెదలు మూఁగి ♦ దరహాసవర్తిత, దంతకేసరములై ♦ తనరు కుంద
లోపశోభితమౌచు ♦ నుదయాతపామృష్ట, పుష్కరనిభములై ♦ ముఖములలరఁ
గలితనిశ్వాసనం ♦ చలితాధరోష్ఠతఁ, జలదేకదళలతా ♦ సామ్యమొందె
హస్తాభినయలీల ♦ నాకర్ణనములొప్ప, ఘటములు మ్రోగ ♦ గంభీరముగను
జలదరవమంచు నెమళులు ♦ చెలఁగి యాడ, బడలి వనిఁ బాడు లోచనల ♦ త్పలములనఁ బరఁ
జలకుచజఘనలయి నాట్య ♦ సఖులఁ బోలి, చల్లలటు సేయు వల్లవీ ♦ జనులఁ గాంచె. ౧౦.

సీ. గట్టిపాఱిన యట్టి ♦ కర్దమంబుల మీఁద, పెరగఁ దోలిన బండ్ల ♦ బాడలమర
సంతతగతులవి ♦ స్తారమై వర్షగ్రస్త, విషమపథములెల్ల ♦ విడిచి పసులు
గవిసి యిరుగడలఁ ♦ గలయ మేసిన సస్య, సంపదల్ గలిగిన ♦ సరణి వట్టి
జనపదంబులు డాయుఁ ♦ జనియుచ్చుట వనింద్య, కర్మభావంగికి ♦ కనకగర్భ
ఘూషణంబుల చేనొప్పు ♦ పురుషవరులు, వెలయ సాశ్రమకుంటిష ♦ ములను బోలి
పుష్పహాసంబులలరంగ ♦ బొలుచు రచ్చ, పొదలు వెనఁగాంచె నారాజ ♦ శృంగవృందము.

వ. తదనంతరంబ వ్యాసోపదిష్టుండై యనుగతగమనంబునఁ జనుదెంచుచున్న యక్షుండక్షి గోచరంబగు తచ్ఛరత్సంపదం గనుంగొని యింగితజ్ఞుండగు వాఁడు ప్రమదావసరంబున నూరకుండుట యని యపృచ్ఛా పరిభాషణశంకం బొసొస్తుచు, శరత్కాలోదయావలోకన కుతూహలుం డగుచున్న యర్జునున కిట్లనియె. ౧౨.

మ. జననాథోత్తమనిర్జలాభ్రయుతమై ♦ స్వచ్ఛాంబుకల్లోలినుల్
దనరం గాశుభదైవదానఫలకా ♦ లంబుంబలెన్ లోకముల్
ఘనసాఫల్యతనొందఁజేసెడుశర ♦ త్కాలంబునీకెంతయే
ననుకూలంబుగఁజేయుఁగాకవిజయో ♦ ద్యల్లక్ష్మినింద్రాత్మజా. ౧౩.

సీ. అడచూచితేదేవ ♦ నదులెల్లనౌద్ధత్య, రహితలైకనుపట్టె ♦ రమ్యలగుచుఁ
బరిపక్వఫలములై ♦ పైరులెంతయునొప్పె, ధరయెల్లరహితక ♦ ర్దమతఁబొంచె
వర్షాగమాసక్త ♦ వాంఛయంతయువీడి, శరదృతుపతిగుణా ♦ సక్తమయ్యె
ఘనపదంబుబలాక ♦ గమనంబులనునింద్ర, చాపనీలాభ్రసం ♦ చారములను
సారిదిలేకున్ననిర్మల ♦ స్ఫూర్తిచేతఁ, దనరుచున్నదియెట్లన్నఁ ♦ దనకుఁదానె
వెలయుచున్నట్టివస్తువు ♦ వేఱొతలఁప, నన్యగుణములఁదాఁగోర ♦ దనఘచరిత. ౧౪.

సీ. విగళితతటిల్లతల్ ♦ వెలయునంతరమున, గళితకాంచనహార ♦ గరిమనెరవు
నిర్జలత్వంబున ♦ నెఱయుశుభ్రతదుర్బ, లతనుబొందినపాండు ♦ రతనుదెలుపఁ
దనరుచుండెడుపయో ♦ ధరములుకుచలీల, నమరఁగావర్షర్తు ♦ వనెడుపతిని
నెడఁబాసివిరహాన ♦ నెంతయుఁగృశియించు, లలనలవలెదిక్కు ♦ లలరుచున్న
వలఘుచారిత్రశుభ్రాభ్ర ♦ కలితమగుచు, నవిగొకనుఁగొంటెకడువిస్మ ♦ యంబయాశ
తలఁచివర్ణింపనీశర ♦ త్కాలమహిమ, తరమెయెవ్వారికైనను ♦ మఱియువినుము.

మ. మనరాహిత్యతనెంతయుఁన్ వికలమౌ ♦ మాయూరవుంబల్కుపై
నిదినేఁడిప్పుడువాంఛసేయుడుమనం ♦ బెంతేనినావీనులున్
మదహంసస్వరలగ్నలయ్యెనదియె ♦ న్నంగాగుణవ్రాతముల్
విదితంబైననవప్రియాస్పదములై ♦ వీడుంగదాస్నేహముల్. ౧౫.

మ. జననాథోత్తమచూడుమెన్నొదరులై ♦ సంపూర్ణపాకంబులన్
వినుతంబైనపిశంగతన్వెలయుచున్ ♦ కేదారతోయాంతరం
బునవిప్పారుననాసితోత్పలఘనా ♦ మోదేచ్ఛనుంబోలెరా
జనముల్ పంటలవాలియున్నవిజనుల్ ♦ సంతోషముంబొందఁగన్. ౧౬.

సీ. కలమాబ్జబినదళ ♦ కాంతిసమ్మిశ్రత, వరపిశంగారుణ ♦ హరితరుచులు
నెరయఁగాఁగలిగిన ♦ చరదింద్రచాపఖం, డాభంబులైనతో ♦ యములుగాంచి
యేడాకుటనఁటుల ♦ నెగయుపుష్పాదిజాలు, పైటబోలెనుసారె ♦ మాటుకొనుచుఁ
గాటుకద్దిర్చిన ♦ కన్నులల్లార్చెదు, గతినెల్లగెంటెనుల్ ♦ గదలుచుండ

వెలయుకుసుమంబులనునవ్వు ♦ లొలుకుచుండఁ, గురుకుచంబులగతిఁబొవ్వు ♦ గుత్తులమర
నలరుకనలీలఁ బుష్పంధ ♦ యములువెనర, వనితలను బోలు వనపఙ్క్తు ♦ లానరఁ జూచి.

సీ. తటిదగ్నిదీప్తియుం ♦ దయితేకమభ్రాంబు, దచ్ఛదచ్ఛాదితా ♦ తపములోలయుఁ
బంకజామోదనం ♦ పర్కవాతోన్నత, తనుసీకరాప్లుతాం ♦ తరగతనలరు
కడుశుభంకరమునౌ ♦ గగనమార్గముఁ జూచి, మీఁదితోఁబుచుఁ జేరి ♦ వారుదీఁడి
యటునిటున వెవ్వన్య ♦ మరు వెంచు రాయంచ, పఱుపుపలు, కలగీతిఁ ♦ బ్రబలుచుండఁ
గడఁగి మేఘావరోధని ♦ ర్గతములగుచు, నేటికనోన్యమును జూచి ♦ మాటలాడఁ
గలిగెనంచనుభాషించు ♦ గతినిదిక్కు, లలరఁగనుఁగొంటి వేషాఘ్ర ♦ యానమునుతీయు.

వ. గొడగొనిబీళ్ల నుండి నిజ ♦ ఘోషములం బలివాంఛ మీఱఁగాఁ
గదుపులఁ బాసి ముందరను ♦ గ్రక్కున వచ్చిన ధేనుజాలముల్
నదయత లేఁగ లంగలసి ♦ చన్నుల వెంటను బాలు గాఱు పెన్
బొదుగులగానక్కులుంబలెను ♦ మూర్కొనియిచ్చెడుఁ గంటి వేల్పుసా. ౨౦.

క. జగదేకపావనంబై, జగదుద్భవహేతుకమును ♦ నవ్వత్సయుతం
బగు ధేనుసమితి యొప్పెను, నగణితఘనమంత్రసంయు ♦ తాహుతిరీతిన్. ౨౧.

క. జితబర్హిణీస్వనాంచిత, తతమగుగోపీసుగీత ♦ తత్పరతను వి
స్మృతిఁ జెందిమృగకదంబము, లతులితసస్యములు మేయ ♦ వనెకనుఁగొంటే. ౨౨.

క. అనతమైనసుబద్ధిని, తానిక్కియునాస్థచేన ♦ ధఃకృతిసేయన్
సూనశరతప్తకై వడి, ధీనుతకలమములు పొందు ♦ దీధితినొందెన్. ౨౩.

క. పరసిజరజములు జలశీ, కరములు పరిగొనెడు వాయు ♦ గతిఁ జెందినవి
తృరివృతులగుదుశ్చరితుల, కరణిని భ్రమరములు గతులు ♦ గానవుకంటే. ౨౪.

సీ. వవడంపుఁ దునుకల ♦ భంగినొప్పెడు చంచు, వులశాలిశిఖలెల్లఁ ♦ గలయఁగొఱికి
కఱచుక కొని పోవు ♦ వరశుకంబులు శాలి, పాలికలదరింప ♦ సోలి సొగసి
బారుగా విరిగి వే ♦ పఱచుచుఁ జూపట్టెఁ, బక్షదీధితులాకు ♦ పచ్చగాఁగ
సరిచంచువులజీగి ♦ వనుసరక్తిమగాఁగ, సరవిఁ దద్గతమైన ♦ శాలిశిఖల
జిగిపిశంగతనొప్పంగఁ ♦ జిత్రవర్ణ, కలితసాంద్రేంద్రచాపసం ♦ కాశమగుచు
నవిగొకనుఁగొంటి వేమునిఁ ♦ యత్తుఁడిట్లు, పలుకుచుండంగఁ దత్సమీ ♦ పమున నంత.
సీ. [illegible] ♦ గలతేజముల్లను, శాశ్వైకచుపట్టు ♦ రమణఁదోఁచఁ
[illegible] ♦ [illegible] యైతోలనొప్పు, శిఖరశాబరులు సఖ ♦ ల్లితమునయు

విగళితజలభార ♦ విశదాంబుముక్సంచ, యంబకోయనిపిస్త ♦ యమునఁజూచె
నాసన్న భూముల ♦ నలరు నల్లనివన, చ్ఛాయనీలాంబర ♦ సామ్యమొంద
నుపరిభాగంబున ♦ నొప్పుమంచుకరళ్ల, చేతగౌరత్వవి ♦ ఖ్యాతమగుచు
సీరపాణివిధంబునఁ ♦ జెలువుమీఱి, యమరకిన్నరగంధర్వ ♦ యక్షముఖ్య
విరచితావాసమై చూడ ♦ నొఱపుమీఱు, హిమగిరీంద్రంబుగనుపట్టె ♦ నింద్రజునకు.

వ. ఇవ్విధంబునం గనుంగొని డాయం జని మేరుమహీధరవిజయదిగంతావలోకనరభసనభోవిలంఘనేచ్ఛాసముత్పతితం బైన తెఱంగున సమున్నతంబై భానుమండలప్రభావిభాసితపురోభాగనిబిడాంధకారసమాచ్ఛాదితాపరభాగం బగుచు లలితాట్టహాసనిరస్తతమస్స్తోమాగ్రతలానుగతగజాజినశ్యామలపరిధానాలంకృతశంకరోపమితంబై, యితరేతరాదర్శితనరనభశ్చరసురనికరకృతవితతయుచిరతరవివిధమణిరచితభాసురావాసంబును, భుజగభూమణప్రభావప్రకటనార్థాభినిర్మితజగత్త్రియప్రతిబింబానుకారంబును, నాగేంద్రధవళితనభోవ్యాపితజాంబూనదరాజివిరాజమానాపహసితసౌదామినీసహితశారదనీరదసముదయాంచితశిఖరసముచ్ఛ్రితంబును, వివిధమణిగణఘృణిజాలపతాకాంశుప్రదీపితామయ్యపభోగితలతికాగ్రహోదితలతాకాంతకాంతారోపలాంతరగోపురోపశోభితనగరసంకాశప్రదేశంబును, ననవరతప్రవర్షితజలభారపాండురితాపవర్జితతటిద్గర్జితోభయపార్శ్వకటకసంవ్యాపితాభ్రనిచయోదితపక్షలక్ష్మ్యుపలక్షితంబును, నాకజగజ్రవజాహతసంరుగ్ణసమవతారసమవిషమతటస్ఫుటతద్వ్యగోపలక్షితోదకవికసితనిష్యందమకరందబిందుసందర్భనానందపరిభ్రమితమిళితభృంగసందీపితారవిందసందోహసముద్దీపితవివిధవిహారానుకూలకూలసంజాతమంజులనికుంజపుంజోపరంజితశీకరనిర్ఝరప్రవాహాభిరామనిర్ఝరోపశోభితంబును, అభినవసమున్నిద్రజపాకుసుమసంకాశప్రభాభిశోభితపద్మరాగమణిగణోపరంజితహాటకకుడ్యకాదాచిత్కసానుసంకల్పితసంధ్యారాగాభిరామధామంబును, ఆలోలనీలతమాలమాలికావిలాసకదంబనికురుంబసముజ్జృంభితంబును, నీహారతుషారపరిప్లుతంబును, విస్తీర్ణకర్ణవ్యాపారసంజాతవాతోద్ధూతమదగంధానుబంధబంధురపుష్పంధయసంశోభితగండస్థలమూర్తికాభిరచితతనుత్రాణాయమాననీహారబిందుసందోహసమావృతోత్తుంగాంగాభిరామసముద్దండశుండాదండవిఖండితకమలమండలప్రచండమదవేదండతండోపమండితంబును, నానావిధానర్ఘ్యరత్నమణిప్రభాభిరామసముత్తుంగశిఖరోపశోభితంబును, అపరిమితకుసుమితలతాగృహసంకలితఘనగహ్వరప్రదేశంబును, కూర్మప్రపాదరాజహంససంచారసైకతనితంబసరోవరనాళీవిహరచక్రవాకరోజకంబుగ్రీవబిసబాహుజలజాతకరాననోత్పలపత్రనేత్రరోలంబమూ

పరశాస్త్రంబులచేతఁబోలెనఘముల్ ♦ వారించునీయద్రిచే
నరనాథార్యభవచ్ఛిదంబులగువి ♦ జ్ఞానంబులుం బుట్టెడున్. 3౨.

* * * * * * * * * *

చ. జగములలోపలన్ మిగుల ♦ సన్నుతికెక్కినయీనగస్థితా
త్యగణితమోహనస్థితియ ♦ పంక్తిశముల్ నరనీతిపొరిగుం
డగు పృథునందనో ప్పెడుమ ♦ హత్తరసంపదలుం బలెంగడున్
సుగుణసమృద్ధి చేసవిగొ ♦ శోభితమైకనవయ్యెఁ జూచితే. 33.

ఉ. శారికలింపుమీఱఁగను ♦ సారెకుఁ బల్కఁగఁ గ్రొవ్వభూరుహం
భూరుహరాజి నమ్రతను ♦ బొందిన వెంటియునట్టియుత్తమై
నీరములొప్పఁగానలరు ♦ నిర్మలసైకతరాజహంసవా
నీరయుతంబులౌనదులు ♦ నెమ్మిఁగ రేఁగాలకింపునింపెడున్. 3౪.

చ. ఘనతరచూతపుష్పనవ ♦ గంధవిశేషంబగువాసితోయనా
ననలకుఁ దేంట్లుమూఁగినవల ♦ సత్స్వరదంతినిపోలికన్ ముల్
గనుఁగొనఁగా వసంతబుతు ♦ కాలము గానియు కాలమందునున్
న్మోనసిపికాళికిన్ మదము ♦ బుట్టఁగఁ జేసెనుఁ గంటివే నృపా. 3౫.

లయవిభాతి.

మఱియు నవదిచూతసురగ ♦ తరుణులు మెలంగుసురగ, చిరకటకదేశములఁ ♦ బరఁగుఘనవిద్యా
ధరమధురగానముల ♦ కెరవగు చుప్రోయు నను, బునుఁ జనములొప్పఁగను ♦ గరపలులు నీభూ
ధరమున నహీంద్రునకు ♦ వరయుహితమైనసుధ, గరవిడిచియుండుటను ♦ గరమునగుఁగాంగన్ ♦
సురనగము కంటెగుగు ♦ తరమగుచుఁ దేజమున, మెఱసికనుపట్టెడిది ♦ నరవిభుతిలకంబే.

చ. అనుపగుసంపదంబొదలు ♦ నట్టిలతాగృహరాజిమోహనున్
తనరఁగఁ బెట్టుదీపములు ♦ లాగున నొప్పఁగమించు దివ్యచం
దనవపల్లవోజ్జ్వలిత ♦ తల్పములొప్పు సరోజవాతముల్
మనముల దేవకామినుల ♦ మర్వఁగఁ జేసెను సాకలోకమున్. 3౬.

చ. హరునిమనంబులోఁదలఁచి ♦ శుద్ధ్బతినీలజలంబులోపలన్
మెఱసితపంబు సేయునల ♦ మీనవిలంఘనలోలనేత్రనా
గిరిజను జూచి మేనుబుల ♦ కింపఁగ నెంతయు సాత్త్వికోదయ
స్ఫురణదలిర్పఁగా భవుఁడు ♦ మోదముతోఁ దుతఁ దొల్లియిచ్చుటన్. 3౭.

చ. కరమున జాఱుచుండు నహి ♦ కంకణముం గని కంపమంది మే
గఱుపొడువంగఁ దాభయము ♦ గ్రమ్మఁగ మాటికిఁ జూచుచున్ యువాం
కురములు చేతఁబట్టి కడు ♦ కూరిమి పెండిలికూఁతు రైనఁదా
మురియుచుఁ జెట్టఁబట్టెఁదన ♦ మోమున లేనగవంకురింపఁగన్. ౩౯.

వ. అదియునుం గాక. ౪౦.

మ. అరుదారంగ సురాసురౌఘములు మ ♦ న్నర్థిన్ సుధాప్రాప్తికై
పరఁగం గానల వార్థి భగ్నజలవి ♦ స్పష్టాహిలోకంబుగా
సొరిదిం ద్రచ్చుచు నాగ్రతాడుగతి నాఁ ♦ జుట్టుంగనఁ జుట్టున
య్యురగేంద్రాంకితసానుమందరనగం ♦ బొప్పారెడున్ జూచితే. ౪౧.

ఉ. భానుకరప్రసారపర ♦ భాగతలస్ఫురదింద్రనీలసం
తానవిరాజమానరజ ♦ తస్ఫటికాంచితకుడ్యదీధితుల్
మానుగ నెంచి చూడ దిన ♦ మధ్యమునందును గౌముదీభ్రమన్
భూనుత మాటిమాటికిని ♦ బుట్టఁగఁ జేసెడుఁ జూడు మీగిరిన్. ౪౨.

చ. మలయసమీరపాతమున ♦ మందగతిన్ జలియించు తామరల్
పొలఁతులభ్రూవిలాసముల ♦ పోల్కి తరంగితమై కొలంకులన్
బొలుచు జలాంతరంబునఁ బ్ర ♦ ఫుల్లములై సవిలాసవైఖరిన్
దలఁకొని నృత్యమాడెడువి ♦ ధంబున నొప్పెడుఁ జూడు ముగ్ధనా. ౪౩.

క. వినువీధి కెదురు నిగుడుచు, ననువగు నీస్ఫటికకాంతు ♦ లర్కాంశులతో
నొనఁగూడి తత్సహస్రా, ఖ్యను మిగులఁగఁ జేయుకరణి ♦ నలరెడుఁ గంటే. ౪౪.

చ. హరునకు సంతసంబుగ ధ ♦ నాధిపుఁ డున్నతమౌ మహాపురం
బిరవుగఁ జేసియుండిన మ ♦ హీధరమా రజతాద్రి యల్లదే
మెఱసెడు మించి చూడుము స ♦ మీపమునం జరియించు మండుభా
స్కరునకు నస్తమానమున ♦ కాలమునందును బుట్టఁజేయుచున్. ౪౫.

ఉ. సానుచయంబులం బొలుచు ♦ చారుమణిద్యుతు లీనగంబునన్
ధీనుతవప్రమధ్యముల ♦ దిద్దిన గోడలు యంచు శంకలోఁ
బూనఁగఁ జేసెడున్ నదియుఁ ♦ బోవఁగ నొప్పెడు మందమారుతం
బీనగమందునైన విను ♦ మిట్టి విచిత్రముఁ గంటివే నృపా. ౪౬.

తవిలి జనించు నాబలభి ♦ దభ్రపథాంచితచాపసంహతిన్
బ్రవిమలలీలనిండి కను ♦ పట్టఁగఁ జేయఁగఁ జాలి పొల్చెడున్. ౫౩.

చ. హారనిశిరంబునందుఁ జెలు ♦ వారుచునుండెడు చంద్రరేఖ యీ
గిరివనమధ్యభూములను ♦ గృష్ణనిశీసమయంబునందునన్
వరతరువల్లికాభినవ ♦ పల్లవసిక్తసుధాస్రవత్ప్రభో
త్కరములచేత వెన్నెలలు ♦ గాసెడుఁ గంటివె యీ విచిత్రమున్. ౫౪.

మ. అరుణైయొప్పెడు చూడుమల్లదె త్వదీ ♦ యంబైన యీ రాకకున్
ఇరవై నట్టిదియున్ భవత్పితృమనో ♦ భీష్టంబునై క్రాలు భూ
ధరరాజంబల యింద్రకీలము లస ♦ త్ప్రాంతార సంవ్యాప్తకం
గరభర్మద్యుతి యుత్తరీయసుమహా ♦ ద్వాసం బెపో లెందగున్. ౫౫.

చ. హరిసుతయిమ్మహాద్రినని ♦ లాహతిచే లతికానుసంగముల్
విరియఁ దదంతరంబులను ♦ వేగముతోఁ ద్విగుణీకృతంబులై
యురువడిఁ జొచ్చు భాస్కరమ ♦ యూఖములన్ ఘనభర్మతీరవి
స్ఫురగురుకాంతులమ్మెఱుఁగు ♦ శోభలఁ బోలెడుఁ బార్థ చూచితే. ౫౬.

చ. భయపడి సర్పముల్ చెదరి ♦ పాఱెడునట్లుగఁ గంపమొందనెం
తయు నొరయంగ నంటుకొను ♦ తన్మదవాసనకున్ మదేభసం
చయములు చేరనట్టిహరి ♦ చందనముల్ పరికించి చూచిన
శ్చయముగ నింద్రు నేనుఁగిట ♦ ఛాయకు వచ్చినజాడఁ దెల్పెడున్. ౫౭.

ఆ. గహ్వరాంతరముల ♦ ఘనబృందసాంద్రేంద్ర, నీలరుచివిభిన్న ♦ నిచయమగుచుఁ
గలయఁ బర్వనట్టి ♦ గతినోష్ణరవిదీప్తి, తిమిరయుతవిభాతి ♦ నమరెఁ గంటె. ౫౮.

ఉ. శాంతుఁడవయ్యు వ్యాసముని ♦ శాసనపద్ధతి శస్త్రధారివై
యింతయు మోసపోక నిపు ♦ డీగిరిమీఁదఁ దపంబు సేయు మీ
వెంతయు నిష్ఠఁ జేసినను ♦ నిద్ధరలోన శుభంబు లొందన
త్యంతము దుష్కరంబగుమ ♦ హోత్తరసిద్ధులొందుఁ గావుతన్. ౫౯.

వ. అని పల్కి నిజనివాసంబునకుం బోవం దలంచి యిట్లనియె. ౬౦.

సీ. అనసీశనీయింద్రి ♦ యాశ్వముల్ దుష్పథ, గాములు గాకుండుఁ ♦ గాక యెపుడు
నధికతపఃక్లేశ ♦ మైనచో సాధనో, త్సాహమిచ్చును గాక ♦ శంకరుండు
నఖిలదిక్పాలకు ♦ లర్థిఁ జోనీతపో, బలముఁ గాచుచు మహా ♦ త్ఫలయుతముగ
నిర్మలంబై యొప్పు ♦ నీమనోరథమును, ముదముతోఁ దుదను జే ♦ యుదురు గాక

చ. సలలితమైనతత్కనక ♦ సానుమరీచులచేతరక్తిమం
బొలుచుతరంగసామ్యమునఁ ♦ బొందినవల్లభుఁగానలేక తాఁ
బలుమఱుఁబ్రేమమీఱు వెడ ♦ బల్కులనారయుచక్రవాకపు
న్వెలఁదినిగాంచినంతసిలె ♦ వేడుకబుట్టదెకూర్మిఁజూచినన్. ౨౧.

చ. ఒనరఁగనన్నదీవిచల ♦ దూర్మికలంగునలంకృతంబులై
తనరెడుకాంతిపుంజములు ♦ తజ్జలమగ్నమణీసమూహముల్
అనువుగఁదెల్పెవాన్కృపున ♦ కాత్మగతంబగునట్టిచేష్టలన్
ఘనమగు నాకృతుల్ దెలుపు ♦ కైవడినెంతయువిస్మయంబగున్. ౨౨.

మ. ఉపలోద్ఘాతతరంగమాలికలపై ♦ నుద్వేగవాతాహతిన్
జపలంబైమతివిస్తరించుచుఁగడున్ ♦ స్వచ్ఛోల్లసత్కేతకీ
విపులాగ్రాభతనొప్పఫేనముసరి ♦ ద్వేల్లత్ప్రహాసంబొయం
చపుడాపాథుఁడుచూచెనెంతయుఁబ్రమో ♦ దాశ్చర్యతందేలుచున్. ౨౩.

చ. జలములుఁద్రావవచ్చువన ♦ సామజగండమదాంబుబిందువుల్
సలిలముమీఁదనిండిపిల ♦ నచ్ఛిఖిపింఛసమానవర్ణమై
యలరుచువేడ్కఁజేసెనపు ♦ డగ్గజబృందముఁజూడవచ్చిన
య్యలఘుసరిద్విలోచనస ♦ హస్రముమాడ్కినిరాజమౌళికిన్. ౨౪.

మ. ప్రతిబోధత్వముచేవిభిన్నముఖమై ♦ పాతాచ్ఛముక్తామణీ
తతితోడంగళితాశ్రుబిందుయుతమై ♦ తల్పంబుపైనొప్పన
య్యతివంబోలెడుశుక్తిసైకతముపై ♦ నాయూఢఁగన్పట్టెనా
క్షితినాథాగ్రణిసంతసంబుననిరీ ♦ క్షింపంగనాముందటన్. ౨౫.

చ. జలములయందుఫేనతను ♦ సాంద్రలతావృతమైతనర్చుచు
న్నలరుప్రవాళపల్లవము ♦ నంగవశాత్మతఁజూడనొప్పన
త్కులనతిదంతకాంతివెలుఁ ♦ గొందెడునన్మధురాధరోష్ఠముల్
దలఁచుకొనంగఁజేసెనుగ ♦ నంజయునిన్నదిసంతసించుచున్. ౨౬.

చ. తరళతరంగసంకలిత ♦ దానసుగంధముఁగ్రోలిరోషముల్
నెరయుజలంబులందిగయుం ♦ నీరుజగంబులసాభిముఖ్యతన్
సరినెదురేగుదెంచుప్రతి ♦ సామజయూధముఁబోలెఁజూచున
వ్వరవనదంతిసంఘముల ♦ వారకచూచెనరుండువేడుకన్. ౨౭.

మ. ఘనశస్త్రాస్త్రంబులు దాల్చియున్నిగులని ♦ ష్కాపట్యుఁడై సభ్యవ
ర్తనలన్మానులమీఱుచున్మృగములన్ ♦ రంజిల్లఁగాఁజేసెన
య్యనఘుం డెన్నఁగఁదారజోగుణవిహీ ♦ నాత్ముండునై యట్లకా
యనుకంపాదిగుణంబులెవ్వరినిజే ♦ యన్ లేవు రంజిల్లఁగన్. ౮౬.

సీ. అనుకూలపాతమం ♦ దానిలంబంతట, వీవంగఁజేయుచు ♦ వెలయుఋతుగు
ణావధీరితభాస్క ♦ రాంచితదీధితుల్, గురుసుఖస్పర్శగా ♦ నెరపఁజేసి
పుష్పాపచయవేళ ♦ భూరుహంబులు పల్ల, వాంజలులై మ్రోల ♦ నానతములు
గాఁజేయుచును శయ్యఁ ♦ గా భూమి నవతృణా, స్తరణతఁ బ్రతినిశీ ♦ సమయములను
గడఁగి సేయుచు విగతాభ్ర ♦ గగననిపతి, తాంబుకణరాజి భూరేణు ♦ వణఁగఁజేయు
సదయుచేఁబోలె నిజతప ♦ శ్చర్య చేతఁ, బ్రతిదినంబును బరిచర్యఁ ♦ బడసె నతఁడు.

వ. ఇవ్విధంబున నధికఫలోదయంబునకై సస్యాగ్రంబునం బుట్టు కుసుమంబులుంబోలె నిజాగ్రంబునం గనుపట్టు నా శుభనిమిత్తంబులు గనుంగొని యాతండు విస్మయాధీనత్వంబునం బోధకుండయ్యె. అశ్లోకదా, జితేంద్రియులైన వారి ప్రభావగుణంబులు ధీరత్వంబును జెఱుపవుగదా. అది యట్లుండె నట్లు మహత్తరతపోవర్తనుండై యప్పార్థుండు సేయు తపఃప్రభావం బితరుల కలవి యగునే యని నిశ్చయించి యవ్వనేచరు లత్యంతఖేదాయత్తబుద్ధులై యాఖండలుసన్నిధానంబునకుం జని, తదనుమతిం బ్రవేశించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిచి ఫాలతలంబులం గదియించి మధురవాక్యంబుల నిట్లని విన్నవింపం దొడంగిరి. దేవా భవదీయం బైనయింద్రకీలాద్రి యందు జటావల్కలధారణుండై సూర్యచంద్రాగ్నిప్రతినిభుం డైనయొక్క మహాపురుషుండు జగంబు తపియింప విజయార్థంబు శత్రుభీషణంబుగా శస్త్రాస్త్రంబులు ధరియించి వేదవిద్యానుష్ఠానంబుల సదాచారసంపన్నులైనమునుల నతిశయించుచు, నత్యాశ్చర్యకరం బైనతపంబు సేయుచున్నవాఁడు. అతనితపఃప్రభావంబున మారుతంబులు శైత్యమాంద్య సౌరభ్యంబులై యత్యంతసుఖావహత్వంబు గావించెడు. భూమి నవతృణాస్తరణంబై శయ్యాసనాదులయం దనుకూలం బయ్యెడు. గగనంబు మేఘధూమరహితంబై జలధారావర్షంబున భూపరాగంబు నడంగించెడు. ఇవ్విధంబునం బృథివ్యాదిపంచభూతంబులు నతనికి మనఃపూర్వకంబుగాఁ బరిచర్య గావించునట్లున్నయవి. ఇంకేమని విన్నవింప నేర్తుము. మృగంబులు సహితము పరస్పరవిరోధంబులు మాని శిష్యవర్గంబు సద్గురుం గొలిచినట్లు, సంతతంబును సేవించుచున్నయవి. పుష్ప

పచయసమయంబున వృక్షజాతులు పుష్పితంబులై యనుకూలదామోదసమ్రమత్వంబునం బొందెడు. అన్నగంబును భవదధీనంబైనవిధంబున సర్వప్రాణివర్గమున కధికవశంబై యున్న యది మఱియును. ౭.

చ. శ్రమరహితత్వమే ప్రబల ♦ సత్త్వము దెల్పును హృచ్ఛరీరమా
సమరజయంబుఁ జాటు మఱి ♦ శాంతుఁ డటంచు ననూనంబుగా
సముఖము జేరినన్ బ్రభువు ♦ సన్నిధిఁ బోలె భయంబు పుట్టు నా
విమలతపోమహత్త్వ మిది ♦ విస్మయమయ్యెడు మాకు నాసవా. ౮.

ఉ. ఇట్టితపంబు సేయుఘనుఁ ♦ డే కులజాతుఁడొ యున్న నేమి నా
పుట్టువునవ్వాయమును ♦ బుద్ధి నెఱుంగము రాకొలంబునన్
బుట్టినవాఁడొ కాకమును ♦ పుంగవజాతుఁడొ దైత్యజాతుఁడో
యెట్టికులంబువాఁడొ దివి ♦ జేశ్వర యాఘనుఁ డెంచి చూడఁగన్. ౯.

క. ఎన్నేని కారణంబుల, నెన్నియు మతి నెఱుఁగలేక ♦ యిప్పుడు మీతో
విన్నపము సేయుతప్పిది, మన్నింపుము మంచిచేని ♦ మఱి కాపన్నన్. ౧౦.

క. హితమేల తెలుపకన్నను, సతతము వనములను దిరుగు ♦ జడులెక్కుడన
స్మతులేడ సెంచిచూచిన, క్షితిలోపల నింతపట్టు ♦ సిద్ధంబనఘా. ౧౧.

వ. అంత. ౧౨.

చ. వనచరులిట్లు దెల్పినను ♦ వాసవుఁ డప్పుడు కూర్మిమీఱఁగాఁ
దనయుని సత్తపంబు మది ♦ తాల్మియు నువ్వని విస్మితాత్ముఁడై
మనమునఁ బుట్టుహర్షమును ♦ మానుగ నాఁచెను రాజచిత్తముల్
తనరఁగ నీతిమార్గములు ♦ తప్పవు గాగణించి చూచినన్. ౧౩.

మ. ఇరవొందంగ ననంతనీంద్రుఁడు మనం ♦ బేకాగ్రతన్ నిల్పియా
నరుపై భక్తి నిదన్మనస్థిరతఁగా ♦ నంగామదిం గోరితా
నెఱిఁగ్రేయుండిమ శేమి యుం దెలియన ♦ ట్లేసంత సంబొప్పఁగా
సురనారీతతిఁ బిల్చి యిట్టులనియెన్ ♦ జోద్యంబు వేద్యంబుగాన్. ౧౪.

చ. యువతివతంసలార వినుఁ ♦ డొక్కటి చెప్పెద మీకు బోలెనే
యువని నిమర్మభేదులగు ♦ నస్త్రములందఱి కోమలంబునున్
అవిహతమున్న మోఘమును ♦ నత్యబురూపము దూరపాతి నాఁ
బ్రవణతనొప్పు నస్త్రమిఁక ♦ భావజు గెల్చువకొండు గల్గునే. ౧౫.

తే. ధరణి సంసారముక్తికై ♦ తపము విడిచి, నట్టి మానుల రాజన ♦ మనుపరాగ
మణఁచు నవబోధవారిమిఁ ♦ గైన లోచ, నాంజలులఁ ద్రావఁబడినట్లు ♦ లణఁగిపోవు.

చ. జగములయందు మున్వివిధ ♦ సామ్యములందగు సుందరత్వముం
దిగిచి విధాత మిమ్ముఁ దన ♦ నేర్పు మీఱ సృజించి యిచ్చుటన్
దగవసియింపఁ జేసి సత ♦ తంబు జనౌఘము నిందుఁ జేరఁగా
నోగి ముదమందఁ జేసెనిఁక ♦ నుర్విన సౌఖ్యమెమీకు నెవ్వియేన్. ౯౭.

వ. కావున. ౯౮.

ఆ. కళలనిపుణులైన ♦ గంధర్వులను గూడి, యరిగి యతని తపముఁ ♦ జెఱచి రండు
ఎలమి నిస్పృహులను ♦ నెల్ల గెల్చెదు మీకు, నీసుఖాత్మ గెల్చు ♦ టెంత యరిది. ౯౯.

క. ఈకరణి నుగ్రమగు తప, మేకాగ్రత సేయునతఁడు ♦ హృదయంబునఁ దా
నేకరణి సుఖముఁ గోరును, ప్రాకటముగ నంటి రేని ♦ పడఁతుకలారా. ౧౦౦.

క. వినుఁడతఁడీగతిఁ జేసెడు, ఘనతపము దిముక్తికొఱకు ♦ గాదిది నిజమ
య్యనఘుఁడు రిపువధ చేతను, గను ఫలము ను మదిని గోరి ♦ కానితలంపన్. ౧౦౧.

క. అదియెట్లన్న నునెంతయు, విదితంబుగఁ దాల్చినట్టి ♦ విల్లెక్కుడ సౌ
ఖ్యదమగు ముక్తి యు దెక్కుడ, మదిలోపల నెంచి చూడ ♦ మానినులారా. ౧౦౨.

చ. తలఁపమహాజుఁడౌనతఁడు ♦ తక్కినమానులుబోలె నాత్మలో
నలిగి శపించునో యనుభ ♦ యంబును లేదదియెట్టులన్న నున్
వెలయు యశంబులెన్నినయ ♦ విక్రమశాలుల బుద్ధులెంతయున్
లలనలయందు నింతయుఁ ద ♦ లంపవు కీర్తిశోభ శోనేనియున్. ౧౦౩.

వ. అని యిట్లు సకలదేవతాసమక్షంబున నాజ్ఞాపించి వివిధాంబరాభరణాదుల బహూకరించి, పొండు కార్యంబు సాధింపుఁ డని యా ఖండలుం డనుప నా యచ్చర లత్యంత సంతుష్టాంతరంగులై, యా సహస్రలోచనులోచనసహస్రంబునకు విస్మయంబాపాదించు తేజంబునం బ్రకాశించుచు వినమితశిరస్కలై వినయంబున నయ్యాస్థానమంటపంబు వెలువడి. ౧౦౪.

క. వనితామణులుత్తుంగ, స్తనభరనమితాంగులగుచుఁ ♦ దడయక యపుడిం
పెనయఁగ నిజసదనములకుఁ, జనిగమనోద్యుక్తలగుచుఁ ♦ జయ్యననంతన్. ౧౦౫.

క. సైంధవగజరథములతో, గంధర్వులు వెంటనడువఁ ♦ గట్టాయితమై
దింధిమ్ము నిస్వనాయించిరి, బంధురగతి మర్దళమ్ములు ♦ పటురవమొనఁగన్. ౧౦౬.

క. ఆరవముదిశలఁబర్వ్వ మ, భూరివిమానౌఘవివర ♦ పూరిత మైతా
బోరున మ్రోయు మఁబురిలో, నారూఢిగఁజా టెఁదత్ప్రి ♦ యాణము దెలియన్. ౧౦౭.

వ. ఇవ్విధంబునఁ బ్రయాణోన్ముఖులై నిఖిలబృందారకసందోహంబు లానందంబునం
గనుంగొనుచుండఁ దత్పురంబు నిర్గమించి నడచునెడ. ౧౦౮.

ఆ. భానుమండలంబు ♦ పైవచ్చుకతనన, పసరసలవిను నాత ♦ పహరణముగ
నమరఁబట్టినట్టి ♦ యాతపత్రంబులు, సార్థకతను బొంది ♦ వయ్యెనపుడు. ౧౦౯.

చ. ఎదురుగదుర్నిమిత్తముల ♦ కెల్లను హేతువు గాఁగఁ బీఁచున
య్యుదుటుదువాలి గాలినరు ♦ ణోత్పలమాలన నన్ని భాసులై
పదములువోట్రిలన్నడుచు ♦ భామల చెక్కులభానుదీప్తి చే
నొదవినరక్తిమంబలము ♦ దోద్ధతకాంతి నిజేసెనయ్యెడన్. ౧౧౦.

క. దివిజానుభావమునసురు, జవనాశ్వాకృష్టసురథ ♦ సంచయములు న
క్రవివర్తనంబులేకయె, దివినివిమానములరీతి ♦ దృప్తగతిఁబోయెన్. ౧౧౧.

వ. అప్పుడు. ౧౧౨.

చ. లలనలగంధసారముల ♦ లందమిటారి మెఱుంగునగ్గవల్
పులకితమైగగుర్పొడువఁ ♦ బుట్టుపరిశ్రమబిందురాజిత
త్తిలకపరిమ్యతాస్యములఁ ♦ దీర్చినమౌక్తికభూషణాకృతిన్
దెలిపెనుసుందరాంగులమఁ ♦ దేజమెఱుఁ జవికారమేనిచేమున్. ౧౧౩.

మ. పతితోల్కార్చిసమానదీధితులుప ♦ ర్వంగానవిచ్ఛిన్నరూ
పతసౌవర్ణనికాషగౌరరుచులిం ♦ పారన్న భోవీధిరా
జితమైయొప్పెడుతద్రథధ్వజపట ♦ శ్రీమించివిస్తారమున్
అతివిస్తారము సేయురీతిఁగనఁగా ♦ నయ్యెన్ స్వయంబొప్పఁగన్. ౧౧౪.

తే. కుసుమసుకుమారగాత్రులౌ ♦ కొమ్మలాత, పమునకోర్చుటగంధర్వ ♦ పతులుసూచి
కమలభవుచిత్రసంసృష్టి ♦ కౌశలమున, కచ్చెరువునొందిరయ్యాగ ♦ యమునపుడు.

సీ. శృంగారములుదీర్చు ♦ సిందూరరాగంబు, తరుణార్కరోచులఁ ♦ బ్రస్తరింపఁ
గవకంబు పెంపొందు ♦ కక్ష్యబంధప్రభ, లిరువంక మెఱుపుల ♦ కరణిఁబరఁగ
నిర్మలమణిమయ ♦ ధర్మవర్మప్రభ, లింద్రచాపద్యుతు ♦ లీనుచుండ
ఘణఘణంఘణయను ♦ ఘంటికారావముల్, ఘనగర్జితంబుల ♦ కరణిమ్రోయ
వసనవప్రస్థలంబులఁ ♦ గురియుచుండు, కలితమదధారజలవర్ష ♦ గతిని దెలుప
నరథసంబునకురణి తెంపు ♦ కరిఘటాళి, పాలిచెలిమాతబృందంబు ♦ పోల్కిఁదనరె.

క. త్వరితగతిఁ బంచ ధారా, స్ఫురణల్ దనరంగఁ దురగ ♦ ములు నడతెంచెన్
దురగాభిధానమప్పుడు, మును నెప్పఁగ సార్థకతను ♦ బొందిన కరణిన్. ౧౧౭.

చ. పరఁగ దురాసదంబగు ప్ర ♦ భాకరమండలమిట్లు దాఁటి యా
తెరువులు వాహినీతతులుఁ ♦ దాము నుదూరము వచ్చి యూర్మికల్
నెరయఁగ దిగ్వధూతతికి ♦ నేర్పడ దిద్దిన యేకవేణి నాఁ
బరఁగు వియన్నదిం దిగిరి ♦ బంధురమర్దళవాద్యఘోషతోన్. ౧౧౮.

క. సమదాళిపరివృతాంచిత, కమలరజోవ్యాప్తమగుచు ♦ గగనధునీభం
గములం దోఁగుచుఁ దత్తా, పము దీఱఁగ నపుడు మలయ ♦ పవనము వీఁచెన్. ౧౧౯.

చ. కరితురగావగాహనము ♦ క్రందున నెంతయు ఘూర్ణమానమై
పొరలి విమానభిత్తులగు ♦ భుల్లునఁ దాఁకుచు నేటికైననున్
దరిఁగని మంటిమంచు ననుము ♦ దంబునఁ బొంగిన రీతి నూర్మికల్
నెరయ సురాపగా విమల ♦ నీరము లత్తఱి నొప్పెఁ జూడఁగన్. ౧౨౦.

క. సురభవనవేదులిసుసుల, నొరయుచు నిరుగడలఁ బడఁగ ♦ నుడుమార్గంబున్
సరిగడచి మేఘములపైఁ, బఱచెదు రథనేములపుడు ♦ భ్రమణత నొందెన్. ౧౨౧.

మ. ఘనదంతాహతిచేత వర్షిలు ఘనా ♦ ఘంబుల్ పథశ్రాంతి చే
తను నేతెంచు గజవ్రజంబులను మో ♦ దంబందఁగాఁ జేసె నె
ట్లనినన్ భూమిఁ బరోపకారులగు ధ ♦ న్యాత్ముల్ ప్రవర్తించు వ
ర్తనముల్ పీడలు సేయువారి యెడలన్ ♦ దాత్పర్యమే సేయుఁగా. ౧౨౨.

చ. వసుసను పచ్చుచుండు సుర ♦ వారవధూకటిరమ్యవస్త్రముల్
పసఁడగు వానిచేత బఱె ♦ వాయువశంబున సారె జాఱఁ దా
వరమణిమేఖలాంశువుల ♦ వారిగఁ బర్వుచు నూరుమధ్యమం
దోఱపగు చల్లడంబు గతి ♦ నొప్పె నభోంశుకలీల వింతఁగన్. ౧౨౩.

ఉ. సారతుషారవర్షమునఁ ♦ జందనపుందిలకంబు లెల్లనుం
జాఱఁ బరిశ్రమంబుడిపి ♦ సంతసమందఁగఁ జేసి మేఘముల్
వారలచేత సత్కృతులు ♦ వారక పొందెను వట్ల కాదె యా
ధారుణిఁ జేసినట్టి సుకృ ♦ తంబె సఁబాపు నెసుల్పదోషముల్. ౧౨౪.

చ. కలితతరోర్మిరేఖలఁ బ్ర ♦ కాశములౌ పులినస్థలంబులుం
బఱెఁ జెలువారు పీతజల ♦ భారపయోధములందు భిన్నమై

పొలుచు సురేంద్రచాపమును ♦ బూన్నముచేసెను దత్సురాంగనా
సలలితభూషణద్యుతులు ♦ సంధులఁబర్వుచు సాంగ మేర్పడన్. ౧౨౫.

వ. ఇవ్విధంబున మేఘమండలంబు నిర్గమించి విహంగమార్గంబునం గడచి నిజాగమనప్రయోజనవిషయంబు లైనభావికరణీయకార్యపర్యాలోచనంబు లైనసల్లాపంబులు సేయుచు, జలధరపటలంబుచేతం గప్పం బడక యధికోన్నత్యంబునం గనుపట్టు కనకసానుసముజ్జ్వలం బగునింద్రకీలశైలేంద్రంబుఁ బ్రవేశించి విలాసినీముఖనలినంబు, నాఘాతస్ఫుటవిశదాతపత్రఫేనంబును, దూర్యరవగంభీరంబునుం గా నశ్వంబులనుండి ప్రసహించు మందాకినీప్రవాహంబుచందంబున నా నసహస్రాక్షుపంపునఁ జను దెంచుగంధర్వవాహిని తచ్ఛిఖరప్రదేశంబున నీడువిడిసె నప్పుడు. ౧౨౬.

ఉ. అగ్గలమైన వేగమున ♦ నశ్వచయంబులెసేతున్నతిగన్
బగ్గము లెంతయుం గదియఁ ♦ బట్టినమోములవాంఛిభూమిపైన్
గ్రుగ్గితురంగముల్ నడుప ♦ బోరుననంబులు మిన్నులొర్వఁగా
డిగ్గరథావళుల్ గరపు ♦ రీవిదలిర్పనతిప్రయాణతన్. ౧౨౭.

చ. ఇరుగడ మేఘముల్ దనర ♦ నింద్రనగంబున కాభిముఖ్యమై
యొరువడినంతరిక్షమున ♦ నుండి వెసందిగుసామజోత్కరం
బిరవుల పక్షకంపనమె ♦ కింతయు లేకయు మున్నె నుండుభూ
ధరవరసామ్య మొందు మను ♦ దచ్ఛిఖరంబునఁ బొల్చె నెంతయున్. ౧౨౮.

క. వినువీథిఁ బఱచుకొాశల, మునసమవిషమములనేక ♦ మగపర్గఁతిషైఁ
జను సైంధవఖురసరణులు, గనుపట్టె నదీసమీప ♦ గతపులినములన్. ౧౨౯.

క. సెలయేఱుల ప్రతిరవములఁ, గలసిగభీరముగ మ్రోయు ♦ ఘనరథనిస్వనముల్
జలదస్వనమని యుద్గత, గళపింఛతవిను చునీల ♦ కంఠములాడెన్. ౧౩౦.

ఉ. ఉన్నతశైలకూటముల ♦ నుండి గుభిల్లనమూఁకి పొలుచున్
జెన్నగు పార్శ్వవప్రహరి ♦ నీలమణిద్యుతితోడ నేకమై
పన్ని నభోంతరంబునవి ♦ భాగము బొందినరీతి వింతదై
యున్న జలప్రవాహ మొక ♦ టొయ్యనఁ జూచిరి ముగ్ధలప్పుటన్. ౧౩౧.

చ. అదలుచు మావటీలఁ దమ ♦ యాత్మ గణింపక ప్రాంతసంచర
న్మదగజగంధలుబ్ధమగు ♦ మారుతమొయ్యన వీవఁ గ్రోధతం
బొదలిక రేణుసంఘముల ♦ ముందరఁ జూచితదాత్తచిత్తతన్
గదిసిచయతిప్రయాణమున ♦ గంధగజంబులు వ్రాపు రుత్తతన్. ౧౩౨.

చ. జవమునవచ్చుసాంద్రరథ ♦ చక్రవిఘట్టనచేజనించియ
న్నవసలిలంబులీలనరు ♦ ణంబగు రేణువునిండఁదోఁగియ
ద్దివిజవరేణ్యువాహినియు ♦ దీర్ఘతపర్తవివర్తయైనజా
హ్నవివలెనవ్యపల్లవవ ♦ నంబులునిండదిగెన్మహోర్బటిన్. ౧౩౩.

చ. అలరినివాసయోగ్యమగు ♦ నట్టివనంబులుఁబూచిపువ్వుముల్
వెలయఁగరాలుతావులను ♦ విస్తృతమౌక్తికసైకతంబులన్
జెలువగుశాడ్వలస్థలులఁ ♦ జెన్నగుచుండెడుదివ్యవాహినీ
సలలితతీరభూమివిల ♦ సచ్ఛిబిరంబుగనిల్చెసైన్యముల్. ౧౩౪.

మ. కరమొప్పంగనుజాహ్నవీతటమునం ♦ గంధర్వసైన్యంబులీ
కరణిండిగ్గినవేళమద్గిరికిను ♦ త్కర్షంబగంజేసినా
పరసంయోగముసైవయోగముననో ♦ ప్పంజేయుఁగాగౌరవం
బరయన్సత్పురుషానుకూలతనసా ♦ ధ్యంబెద్దిభావించినన్. ౧౩౫.

చ. పొలుపుగఁబూచిఘుమ్మురను ♦ భూరుహముల్విజనప్రదేశముల్
కలయఁజిగిర్చినట్టిలతి ♦ కావిసరంబులుదేవకామినీ
లలితతరోపభుక్తిసఫ ♦ లత్వముఁబొందెనునెట్లటన్నఁదా
జెలఁగిపరోపకారమును ♦ జేసినదేకదకల్మియెన్నఁగన్. ౧౩౬.

చ. అలసియుసౌఖ్యమేదియుని ♦ జాగ్రతలస్థితసర్పఫూత్కృతో
చ్చలితనవప్రవాళహరి ♦ చందనసంగతిదుష్టసేవకుల్
దలముగనున్నయట్టివిభు ♦ దండనుబోవనుదత్సురాంగనల్
నిలకతిరస్కరించిరిల ♦ నిందితమేకదదుష్టసంగతుల్. ౧౩౭.

చ. అలసకదానిజీనిపని ♦ యాస్తరణధ్వజకంకటాదులున్
వలనుగడించితెచ్చిరిమముఁ ♦ బాపుటకైధరమావటీలుదా
ర్కొలుపనిసన్నితన్గదిసి ♦ కుంజరయూథముపాల్చెనస్థితిన్
బ్రళయసమీరభగ్నగహ ♦ నద్రుమవిస్తృతశైలరీతులన్. ౧౩౮.

మ. ఘనమాతంగమనోకకూటిట్లునిజమా ♦ ర్గక్రాంతిచేనొందుని
ద్రమువాలించితొలంగినట్టిశయన ♦ స్థానంబునన్దానవా
సనఁగ్రోలన్ఝుణమందుభ్రావాలునచల ♦ త్సారంగజాలంబులే
చినవేగంబునఁజారుశృంఖలగతిన్ ♦ జెన్నొందెఁజిత్రంబుగన్. ౧౩౯.

సీ. ఈరీతిబడలికల్ ♦ దీఱినపిమ్మట, జలములుద్రావింపఁ ♦ దలఁచియుప్పొ
డారోహణముచేసి ♦ యాధోరణావలి, గంగకుఁదెచ్చిన ♦ గదిసియావల
వనగజమదగంధ ♦ వాసనఁ బైదచల్లు, పొలితటంబులమీఁద ♦ నాలుకఁదలఁచి
సురసరిద్వాహినీ ♦ సరణికష్టంబైన, ఘూర్ణిల్లుచునుశైత్యం ♦ బుశనిసూతులఁ
గరలికరములెత్తి ♦ ఘీంకృతుల్ సేయుచు, మఱలితిరుగఁబడక ♦ మస్తకములు
ద్రిప్పణొనుచుమత్త ♦ రింధమావంతుల, సరకుసేయకుండెఁ ♦ గొలఁకులొన్ని. ౧౪౦.

మ. జలముల్ద్రావఁగవంగినట్టికరిణీ ♦ జాలంబుతుండంబులన్
గలయంద్రావుచుఁబోనశేషజలముల్ ♦ గారప్రవర్షానసం
కలితంబైనకపోలపాలికలపైఁ ♦ దార్కొరంబుత్రోఁజల్లఁడ
జ్జలబిందుప్రకరంబుజాలెనుమదా ♦ సారంబుచందంబునన్. ౧౪౧.

మ. అతితృష్ణన్బడియుండియున్ద్రుతముదా ♦ నాఘ్రాణమేచేసి యు
త్పతితక్రూలంబుపరేభశంకమదిలో ♦ భావించిరోషంబుతో
మతిసెన్నన్హిమశీతమైనవనజో ♦ న్మత్తేభదానాంబుసం
యుతమౌతోయముఁద్రావదయ్యెనొకవా ♦ గోత్తంసముత్స్వేచ్ఛలన్. ౧౪౨.

సీ. ఈరీతినీరాను ♦ నిభరాజయూధముల్, జలమెల్లవానసం ♦ కలితముగను
జేసితామరలెల్ల ♦ చెలఁగితుండంబులఁ, బెకలించిగండుపా ♦ లికలసారె
తాటించుచునుమదో ♦ ద్ధతిమీఱఁగుమిగాడి, విహరించిక్రీడల్ ♦ పెహింతరక్త
మదరేఖలొప్పఁగా ♦ మరవాసనలనీను, కమనీయతరకపో ♦ లములుతెలియఁ
గనకసానుదీప్తిఁ ♦ గడునొప్పునడగొండ, లొక్కొయనఁగమిగుల ♦ నొప్పమీఱి
సురశిబిరమునకు ♦ మందయానంబుల, గంగవిడలిపోను ♦ గట్టుమించి. ౧౪౩.

మ. ఘనరక్తధ్వజినీరజంబుకలయం ♦ గాఁబర్విసంక్షోభసం
జనితప్రస్ఫురవీచికల్తటములా ♦ చ్ఛాదింపమాతంగముల్
దనకంజాతపరాగసంచయముశో ♦ ర్ణంబైపిశంగత్వముం
దనరంజెందిజలంబుఱొల్చినపుడం ♦ తన్చిత్రమంజిష్ఠనాన్. ౧౪౪.

చ. నిరుపమకాంతిమీఱిమద ♦ నిస్రుతసప్తవిధస్థలంబులన్
స్ఫురణనిబద్ధవామపద ♦ భూరిగళంబులసంగహారముల్
గురుతరధూపవృత్తవన ♦ కోటులనల్పుచుఁజూడనొప్పిన
ద్విరదములంజలచ్యుతప్రచల ♦ గంధగిరిప్రకరంబుచాడ్పునన్. ౧౪౫.

క. నిరతము సప్తస్థలముల, ధరణిరజంబణఁగఁ దారఁగు ♦ దంతావళిస
త్కరగంధనిరసనైలా, పరిమళమదగంధము పుడు ♦ పవనము దాల్చెన్. ౧౪౬.

ప. ఉదరిమృగేంద్రయూథములు ♦ హుమ్మని గ్రమ్మరాయుచు నిద్ర మేల్కొనన్
బెదరక గర్జితభ్రమను ♦ జెంది సముద్గతకంధరంబులం
బొదలి చకోర కేకికుల ♦ ముల్ జలభూములనాలకింపఁగా
నుదితసురేభబృంహితము ♦ లొప్పెను మేఘునినాదవైఖరిన్. ౧౪౭.

మ. ఘనచిత్రాంబరభూషణోద్వహనశా ♦ ఖల్ మీఱిమార్గశ్రమం
బునదివ్యాంగనలాతురత్వమెసయన్ ♦ మున్మున్న గానచ్ఛటం
దనరం గావిభజించి కట్టినగృహ ♦ స్థానంబులన్ రమ్యమై
తనరెన్ దద్వనపాదపంబులు పురో ♦ ద్యానప్రభ స్మీఱుచున్. ౧౪౮.

వ. తదనంతరవృత్తాంతం బెట్టి దనిన. ౧౪౯.

క. నరకిన్నగవరచారణ, గరుడోరగసిద్ధసాధ్య ♦ గంధర్వపకిం
పురుషామరమునివందిత, చరణాబ్జదయావిలోల ♦ శౌరినృసింహా. ౧౫౦.

మాలిని. అమలకమలనేత్రా ♦ యాంత్రకృద్బ్రహ్మసూత్రా
విమలశుభచరిత్రా ♦ విస్ఫురద్గౌరగాత్రా
వినుతతిమిరమిత్రా ♦ వీరలక్ష్మీకళత్రా
సమదదనుజజైత్రా ♦ సన్మునిస్తోత్రపాత్రా. ౧౫౧.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర పరమభాగవతపూజావిధేయ సింగయనామధేయప్రణీతం బైన కిరాతార్జునీయం బను మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

క. అత్తఱినొకసతితుమ్మెద, మొత్తంబులుఝుమ్మురనుచు ♦ ముసరినఁగరముల్
త్రత్తఱపడివిదళింపఁగ, బిత్తరిమఱియొకతెదానిఁ ♦ బేర్కొనిపల్కెన్. ౯.

ఉ. మానితనవ్యపల్లవస ♦ మానములౌకరముల్ విదుర్చుచున్
బూనివృథాపరిశ్రమముఁ ♦ బొందకు వేమదిఁగల్పవల్లికా
నూనపరిభ్రమన్మధుప ♦ యూథములొయ్యనసాశ్రయించెని
న్నానకయెట్లునీవిఁకను ♦ మాన్పెదవేభయపెట్టిమానినీ. ౧౦.

ఆ. ప్రణయకుపితయగుచుఁ ♦ బతిఁబాసివేఱొక్క, తరుణిమరలఁగలయఁ ♦ దలఁచియున్న
గానిభావమెఱిఁగి ♦ తరుణివేఱొక్కతె, పలికెనిట్టులనుచుఁ ♦ బ్రౌఢివెలయ. ౧౧.

ఉ. కోపముమానవేవిభుని ♦ గొబ్బునఁగూడవె కాకతక్కినన్
జాపలమైననీమనము ♦ చాలతపించునుముందుబోలె నే
నాపలుకెంతయున్నిజము ♦ నాతిరొయంచునునిట్లు నేర్పుమైఁ
దీపుగఁబల్కియల్కవెనఁ ♦ దీర్చెనసచ్చెలిగూడెనాథునిన్. ౧౨.

సీ. గురుకాశసూనదు ♦ కూలసాగసకల, క్వణితరేఖాకాంచి ♦ కస్వజఘన
సన్నిభతీరదే ♦ శప్రభూషితకుంజ, పాన్థోధియోషిత్సి ♦ వంతికలను
అతినూరపాతఘే ♦ దితనిర్ఝరస్రవ, తృప్తితియాతవల్లభో ♦ త్సంగశీత
లాచ్ఛమౌక్తికవన ♦ హాసోపలక్షిత, నిర్మలోదకబిందు ♦ నివహములను
నచలదళిపుంజమ్మృగులాంజ ♦ నాభిశారి, తత్ప్రసూనాక్షిసాదర ♦ తానిరీక్ష్య
మాణనప్రమాంగలతికాస ♦ మాజములను, నంతసంబునఁజూచుచు ♦ నంతమఱియు.

క. వారణమసకలితాఘణ, సారస్థిరగండకషణ ♦ జాతత్వ్యనా
వారమనోహరచందన, భూరుహములుజూచిరంత ♦ ముండరఁజనుచున్. ౧౪.

చ. తరుణులువేడ్కనోఁజెలఁగి ♦ తాముసుబూవులఁగోయకుండియున్
బరువుపక్వానముల్ రమకు ♦ వారకచేసెడులీలనిచ్చున
వ్విరులనునాథులందుఁగల ♦ ప్రేమలఁగైకొనిరప్పుడెంతయున్
మురియుచువల్లభుల్ ప్రియముఁ ♦ బొందెడువట్టుగసాదరంబుగన్. ౧౫.

క. మఱియొకమానినినాథుఁడు, విరులిచ్చ్యనుసవతిపేర ♦ బెట్టుగబిలుపన్
జరణమునసేలవ్రాయుచుఁ ♦ గరమల్కనుబల్కకుండెఁ ♦ గన్నీరొల్కన్. ౧౬.

చ. సరసములాడునాథుదెస ♦ సన్ముఖమైతసద్దృష్టినిల్పితా
నరిమురిపిడిజాఱెడుని ♦ జాంశుకముస్మళికట్టకయ్యెడన్

